137
ఏప్రిల్ / మే
1992

# అరుణతార

సాహిత్య సాంస్కృతిక మాసపత్రిక

## ఉడుతలు

- రాప్తాడు గోపాలకృష్ణ

పట్టపగలు పదిగంటలకు
కాలేజీ కాంపస్‌లోనో, నాలుగురోడ్ల కూడలిలోనో
విప్పారిన కళ్ళవుతారు, ముడిపడిన భృకుటులౌతారు
నిలబడిపోయిన నిశ్వాసాలౌతారు, కర్తవ్యదీక్షితులౌతారు
ముక్కుపచ్చలారని నాలుగు చేతులతో
రాజ్యహింసకు నిరసనగా తలపెట్టిన బంద్ తాలూకు
వాల్ పోస్టరు లౌతారు
నీళ్ళుపెట్టి దువ్వినా అణగని తలలతో
ప్రభుత్వ వసతి గృహాల ముతకగుడ్డలతో
మోకాళ్ళ మీద రసికారే పుండ్లతో
సూదులు విసిరే చూపులతో
అందరి మూతి మీద చేతులౌతారు
ఉద్యమ విజయానికి ఉడుతలౌతారు
ఆకాశంలో మెరుపుల్లా అదృశ్యమౌతారు
విప్లవ కిరణాలై గుండె గుండెలోనూ వెచ్చదనమౌతారు

2

# విషయసూచిక


సామ్రాజ్యవాదాన్ని ఎదిరించటమే శ్రామికవర్గ కర్తవ్యం (సంపాదకీయం) సి. యస్. ఆర్. ప్రసాద్ 3

నా తల్లి తెలంగాణ (కవిత) - జీ.త్రి. 6

సరిహద్దుల్లో.... అమ్మకోసం (కవిత) - మహేంద్రతనయ 7

'మాపెద్రిగానీ....' (కవిత) - గూడూరు గంగాధరరావు, కో.ప్ర. 8

రక్షణ (కవిత) - రిపోర్టర్ 9

ఆగదు ఈ ప్రజాపోరు (కవిత) - పినాకపాణి 12

పోరాటమే మార్గం (కవిత) - కె. యుగేంద్రనాథ్ పి... 12

అప్పుల భారతం (కవిత) - పి. నాసరయ్య 13

పిడికిలెత్తిన రైతు (కథ) - ఆర్వీ 14

ప్రజలపాట - అవగాహన - వి. వి. 19

ఎక్కుపెట్టిన పాట - రుద్రజ్వాల 31

పాటంటే - వెన్నెల 32

వేగుచుక్క (కథ) - ఆజాద్ 34

కనిపించని కథలు (సమీక్షా వ్యాసం) - ఎన్. వేణుగోపాల్ 46

కదిలింది యువతరం (శ్రీకాకుళ పోరాట పాటలు) - సేకరణ : మాసేపల్లి 59

విరసం విశేషాలు :

29-3-92 న విజయవాడలో సమావేశమైన విరసం కార్యవర్గం చేసిన తీర్మానాలు 65

కలం లొంగిపోదు (కవిత) - గూడూరు గంగాధరరావు 72

కరపత్రాలు 73

నిలువుదోపిడి (స్ట్రీట్ ప్లే) 83

దార్శనికుడు 'చే' జగన్ 90

3

సంపాదకీయం :

# సామ్రాజ్యవాదాన్ని ఎదిరించటమే శ్రామికవర్గ కర్తవ్యం

ఇది మే నెల. అంటే ప్రపంచ వ్యాప్తంగా శ్రామిక వర్గం తన విముక్తిని సాధించుకోవటానికి, సాధించుకున్న విముక్తిని నిలబెట్టుకోవటానికి, పరిపుష్టం చేసుకోవటానికి, మరింత చైతన్యవంతంగా, క్రియాశీలకంగా తనను తాను పునరంకితం చేసుకోవటానికి దీక్ష పూనే నెల.

ప్రపంచ వ్యాప్తంగా కమ్యూనిజానికి కాలం చెల్లిందని పెట్టుబడిదారీ, సామ్రాజ్యవాదాలదే భవిష్యత్తని, సంఘర్షణ స్థానే సామరస్యం నెలకొనే ఒక కొత్త సమాజం ప్రపంచ సామ్రాజ్యవాదుల నాయకత్వంలో ఏర్పడబోతోందని, రాబోయే శతాబ్దం ఈ పరిణామాలన్నిటికీ స్వాగతం పలకబోతున్నదని, సామ్రాజ్యవాదులు, పెట్టుబడిదారులు మూడో ప్రపంచ దేశాల్లోని వారి తైనాతీలు కాకిగోల చేస్తున్న ఈ సమయంలో భారత శ్రామికవర్గం తన కర్తవ్యాలను మరింత దృఢంగా పునశ్చరణ చేసుకోవాల్సిన సమయమిది.

పి. వి. నరసింహారావు, మన్‌మోహన్‌సింగ్‌ల జోడీ దేశాన్ని స్వేచ్ఛా వ్యాపార పట్టాలపై కెక్కించి పెట్టుబడిదారీ రైలుబండిలో సూపర్‌ఫాస్ట్ ఎక్స్‌ప్రెస్ లాగా వేగంగా సుభిక్షం చేయబోతున్నదని మేధావులు ప్రజల్ని నమ్మింప జూస్తున్నారు. సామ్యవాదానికే కాదు, నెహ్రూ తరహా సోషలిజానికి, మిశ్రమ ఆర్థిక వ్యవస్థకు, పబ్లిక్ రంగానికి కూడా కాలం చెల్లిందని వాదిస్తున్నారు. ప్రపంచ బ్యాంకు, అంతర్జాతీయ ద్రవ్యనిధి సంస్థ వెరసి అమెరికన్ సామ్రాజ్యవాదం తప్ప మనల్ని, మన దేశాన్ని గట్టెక్కించే నాథుడే లేడంటున్నారు. చైనాలాంటి దేశమే ప్రపంచ బ్యాంక్ నుండి అప్పులు తీసుకొని అమెరికాకి అణిగిమణిగి వుంటే ఇంక మనమెంత, మనదేశమెంత అంటున్నారు. అప్పిచ్చేవాడు అప్పు పుచ్చుకునేవాడి మీద షరతులు పెట్టటం న్యాయం కాదా ? అందుకే వాడి కనుసన్నల్లోనే మనం కూడా మన కొత్త

బడ్జెట్టును తయారుచేసుకున్నామంటున్నారు. అసలిదంతా ప్రపంచ వ్యాపిత ధోరణే అని, ప్రపంచమంతా పెట్టుబడిదారీ విధానం వైపు పరుగులు తీస్తుంటే మనం సోషలిస్టు జపం చేస్తూ కూర్చుంటే ప్రధాన స్రవంతి నుండి వేరుపోమా అని వాపోతున్నారు.

దక్షిణకొరియా, ఫిలిప్పీన్స్ వంటి దేశాలు తమ ఆర్థిక వ్యవస్థను, సామ్రాజ్య వాద ఆర్థిక వ్యవస్థతో అనుసంధానం చేసి, ఎంతటి మహత్తర, అద్భుత ఆర్థిక విజయాలను సాధించాయో చూడండంటున్నారు. మనం కూడా అలాంటి అద్భుతా లను సాధించాలనుకోవటం పొరపాటా అని ప్రశ్నిస్తున్నారు. అందుకే విదేశీ పెట్టు బడులకు, బహుళజాతి సంస్థలకు తలుపులు బార్లా తెరుస్తున్నామన్నారు ఏ విదేశీ వ్యాపారస్థుడైనా మన దేశంలో తన కిష్టమైన ప్రాంతంలో, తన కిష్టమైన వ్యాపా రాన్నో, పరిశ్రమనో మనతనుకూలంగా వుండే షరతుల మీదనే ప్రారంభించు కోవచ్చునంటున్నారు. వారి ప్రయత్నాలకి ఏ అధికార యంత్రాంగమూ అడ్డు చెప్ప దని, ఆలస్యం అసలే చేయదని వాగ్దానాలు చేస్తున్నారు. సాక్షాత్తు ప్రధానమంత్రే దేశ దేశాల్లో పర్యటించి మేం తలుపులు బార్లా తెరుచుకున్నాం, మీ కనుకూలమైన వాతా వరణాన్ని ఏర్పాటు చేశాం, అవి చాలవనుకుంటే ఇంకా ఏమైనా చేస్తాం,'జో హుకుం' అంటూ సామ్రాజ్యవాదులముందు మోకరిల్లుతున్నాడు.

ప్రపంచంలో ఎక్కడెక్కడినుంచో ఘరానా పారిశ్రామికవేత్త లొచ్చి ఈ దేశంలో పెట్టుబడులు పెడుతుంటే, దేశాభివృద్ధికంటే తమ వ్యక్తిగత ప్రయోజనాలే ముఖ్యమనుకునే 'అలగా' జనం జీతాలు పెంచమనో, పనులు బందు పెట్టవద్దనో, తమ స్థానంలో యంత్రాలు ప్రవేశపెట్టవద్దనో, తమ బిడ్డలకి నదుపాయాలు కలి గించమనో అన్యాయంగా డిమాండ్ చేసి దొరలకి చికాకు కలిగిస్తారేమోనని ముందు జాగ్రత్తగా మిలిటరీ పోలీసు బలగాలను పెంచుకోవటంతోపాటు, రాజ్యమంటే ఖబ డ్దార్ అని నరసింహావతారమెత్తి ప్రళయతాండవం చేస్తున్నాడు.

ఇదంతా దేశ ప్రగతి కోసమని, ప్రజల్ని సుఖ సంతోషాలతో ముంచెత్తటాని కనీ, ప్రజలకిక అన్నపానాదుల సమస్య లేదనీ, అసలు ఆకలి దప్పులే ఉండవనీ వందిమాగధ వర్గం ప్రజల్ని నమ్మింపజూస్తున్నది. కాని వారు చెప్తున్నదీ, చూపిస్తు న్నదీ పెట్టుబడిదారీ తరహా అభివృద్ధి నాణానికి ఒక వైపు మాత్రమే. మనం చూడా

ల్సింది రెండో వైపు. చిలీ, గౌతమాలా, కొలంబియా, పెరూలాంటి దేశాల ప్రజల యదార్థ జీవితాలను పరిశీలిస్తే ఆ అభివృద్ధి తాలూకు చీకటి కోణాలు కనబడతాయి. సామ్రాజ్యవాదానికి, బహుళజాతి సంస్థలకు తలుపులు బార్లా తెరిచిన దేశాలు తమ ఆర్థిక సార్వభౌమాధికారంతో బాటు తమ రాజకీయ సార్వభౌమాధికారాన్ని పోగొట్టు కున్న వైనం అర్థమవుతుంది. అక్కడి ప్రజలు ఉద్యోగాలు కోల్పోయి, సామ్రాజ్య వాద ఆర్థిక దోపిడికి వ్యతిరేకంగా పోరాటాలు చేస్తున్న క్రమం అర్థమవుతుంది. అక్కడి ప్రజల సంస్కృతి, సాహిత్యం, కళలు, జీవిత విధానం, ఆలోచనా విధానం, భాష సామ్రాజ్యవాద శక్తులచేత ఛిన్నాభిన్నం చెయ్యబడ్డ వైనం అర్థమవు తుంది. తమ బతుకులు తమకే కాకుండాపోయిన క్రమం సుబోధకమవుతుంది. తమ శ్రమ తమనికాక, కొన్ని వేల మైళ్ళ దూరంలో వుండే ఒకానొక సామ్రాజ్య వాది కండలు పెంచటానికి ఎలా ఉపయోగపడుతుందో తెలుసుకున్న ఆ ప్రజలు తమ బతుకుల మీద తమ అధికారాన్ని నిలబెట్టుకోవటానికి తమ సాహిత్యాన్ని, భాషని, సంస్కృతిని కాపాడుకోవటానికి చేస్తున్న ప్రయత్నాలూ కనబడతాయి.

ఈనాటి నరసింహారావు మన్‌మోహన్ సింగ్‌ల జోడీ రూపొందించిన గారడీ బడ్జెట్టు మన దేశాన్ని కూడా ఆ వైపుగా నెట్టటానికి చేసే క్రమంలో మొదటి మెట్టు మాత్రమే. ఈ క్రమాన్ని మొదటి మెట్టులోనే అవగాహన చేసుకుని విశ్లేషించు కోలేకపోతే, పాలకవర్గాలు దింపాలనుకున్న ఊబిలో దిగటానికి మనం సిద్ధమైనట్టే. ఎవరి మరణ శాసనాన్ని వాళ్ళు రాసుకున్నట్టే. అలా మన చేత చేయించాలంటే పాలకవర్గ ప్రచార యంత్రాంగం సరుకుల మాయావాదపు పొరను అల్లుతోంది. దాన్ని చీల్చుకుని బయటపడి సామ్రాజ్యవాదపు నిజ స్వరూపాన్ని మొత్తం ప్రజ లందరిచేత ఆలోచింప జెయ్యటమే నేడు మనదేశ శ్రామిక వర్గ కర్తవ్యం. ఆ కర్త వ్యాన్ని దృఢంగా నిర్వహించటానికి అవసరమైన చైతన్యాన్ని ఉద్యమాలక్రమంలో ఈ పాటికే రూపొందించుకుని ఉన్నాం.

— సి. యస్. ఆర్. ప్రసాద్

# నా తల్లి తెలంగాణ

— జి. త్రి.

బందూకుల పహరాలో నా తల్లి
శత్రువుల ఉక్కుకోరల్లో నా తల్లి
సరిహద్దు దళం దిగ్బంధనంలో నా తల్లి
అయినా సరే....ప్రతిఘటనా పోరాటంలో నా తల్లి
నా తల్లి పోరాట సాంప్రదాయం
నా తల్లికి ప్రాణం తృణప్రాయం
నిజాం ముష్కరుల్ని సైతం నిలువున కూల్చేసిన నా తల్లి
తన ఎందరో పుత్రుల్ని పోరుకు పంపిన నా తల్లి
ప్రజాయుద్ధ బాటసారులకు బందూకును బహూకరించిన నా తల్లి
నా తల్లి శరీరంపైన తన పుత్రుల రక్తం
నా తల్లి శరీరంపైన ఎన్నో గాయాలు
అయినా సరే....నిత్యం నినదిస్తూ నా తల్లి
నా తల్లి ఉచ్ఛ్వాస నిశ్వాసాలపై నిఘా ఉంచినా
ఉచ్ఛ్వాసం నుంచి వచ్చి నిశ్వాసంలో నిష్క్రమించే
నా అన్నలకేం పహరా కాయగలవు ?
నా తల్లికి మరణం లేదు
మండుతున్న తెలంగాణా పల్లెల్లోంచి
అమరులైన అన్నల రక్తంలోంచి
రెట్టించిన కసితో తిరిగి పుడుతుంది నా తల్లి
నిర్బంధాలు, దిగ్బంధాలు నా తల్లికి చిరపరిచితాలు
నిఘా పహరాలు నా తల్లికేం కొత్తకాదు
నా తల్లి తెలంగాణ, రణంగాణ - బలంగానే పాడుతుంది

# సరిహద్దుల్లో....అమ్మకోసం

— మహేంద్రతనయ

అమ్మా !
నిన్ను చూడాలని
నీ చల్లని గుండెలపై సేద తీరాలని
బిడ్డను చూసిన ఆనందపు క్షణాన
రాలే కన్నీటి చుక్కల్లో తడవాలని
ఆశతో ఆతృతతో వచ్చిన నీ కొడుకు
నిన్ను చేరకుండానే మాయమయ్యాడని
నిన్ను చూడకుండానే కళ్ళు మూసాడని
నిన్ను చేరుతానన్న ఆనందంతో ఎగిసిపడిన గుండె
రాకాసి ఉక్కుహస్తాల్లో నలిగి మూగబోయిందని
తెలుసా అమ్మా నీకు !
ఒకే దేశంలో సరిహద్దు ముళ్ళకంచెల్ని దాటాల్సి రావడం
ఒకే ఊర్లో సరిహద్దుల్ని ప్రాణాలకు తెగించి
దాటడమంటే నీకు తెలుసా అమ్మా !
అమ్మా !
నిన్ను చూడటానికి ఎన్నో సరిహద్దు భద్రతల్ని దాటాలి
నిన్ను చేరేందుకు భద్రతాదళాల బందూకుల సందుల్లోంచి దూరాలి
నీ ప్రేమను అందుకునేందుకు నీ బిడ్డ ఆ దారుల్లోనే నడిచాడు
సరిహద్దుల్ని చెరిపేందుకు
సరిహద్దుల్ని దాటబోయాడమ్మా నీ బిడ్డ

* * *

కొడుకా !
ఎక్కడరా నా బంగారు తండ్రీ !
మామూగు మీసాల నా బంగారు తండ్రి ఎక్కడ
నా గుండెల్లో ఆటలాడి, తను ఏడ్చి నన్ను ఏడ్పించే
తను నవ్వి నన్ను నవ్వించే నా కొడుకు

ఒక్క క్షణం ఇల్లు దాటితే గుండెలు బరువెక్కి
కళ్ళు కాయలు కాసేట్టుగా చూసే నా బిడ్డ
వాడి కాలుకు ముల్లు గుచ్చితే నా గుండెల్లో గుచ్చినట్టే కదా!
అయ్యో! ఎక్కడో తుపాకీ శబ్దాలు
ఏంటి బిడ్డా ఈ తుపాకి మందు వాసన!
నా బిడ్డల్లారా! ఏమయ్యార్రా మీరు?
పలకండిరా నాయనలారా?

* * *

ఉదయానికి ఉదయానికి మధ్య
ఎన్ని ఉదయాలు! ఎన్ని అస్తమయాలు! ఎంత ఘర్షణ!
ఎన్ని ఆరాటాలు! ఎంత తపన! ఎన్ని విజయాలు! ఎన్ని అపజయాలు!
అమ్మా!
ఎగుస్తున్న మా గుండెల్లో చూడు హోరులెత్తే నీ బిడ్డను
బ్యాక్ సైట్, ఫోర్ సైటుల్లోంచి లక్ష్యాన్ని చూస్తున్న
మా నల్లని కనుగుడ్డుల్లో చూడు మెరుస్తున్న నీ బిడ్డని
తుపాకి ట్రిగ్గర్‌ని లాగుతున్న మా వేలికొనల్లో చూడు
కసితో జ్వలిస్తున్న నీ బిడ్డని
వర్గ సరిహద్దుల్లో పారుతున్న మా రక్తాల్లో చూడు
జండా అయిన నీ బిడ్డను!
(అమ్మను చూడటానికి వెళ్ళి ఊరుకి చేరకుండానే భద్రతా దళాల చేతనే హత్య చేయబడిన ఒక కామ్రేడ్ కోసం).

## 'మా వెర్రిగాని....'

రాజ్యం రక్తం రుచి మరిగిన చోట
నీరు సాక్ష్యం చెప్పదు
ఏరూ సాక్ష్యం చెప్పదు
పావురం స్థానంలో రాబందు ఎగిరేచోట
చెట్టు సాక్ష్యం చెప్పదు
చిలకా సాక్ష్యం చెప్పదు

మాట వేటాడబడుతున్నచోట
మనిషీ సాక్ష్యం చెప్పదు
అయినా మా వెర్రిగానీ—
నేరస్థులెవరో నేల పసిగట్టేసినంక
సాక్ష్యాలూ, సట్టుబండలూ ఎందుకు
శిక్షలు తప్ప!

— గూడూరి గంగాధరరావు, కో. ప్ర.

# రక్షణ

— రిపోర్టర్

భూమిని నమ్ముకునోల్లం, కాయకష్టాన్ని నమ్ముకునోల్లం
గిట్లయితదనుకోలేదు బిడ్డా
పురుగు బుషోస్తదని భయపల్లేదు
పాములు కాల్లల్ల ఆడినా జంకలేదు
బాయిల కాడానే బతుకనుకున్నం, పంటలతోనే సంబంధమనుకున్నం
ఊరికి దూరమైనా బాధ పల్లేదు, సుట్టాలు వద్దన్నా లెక్కవెట్టలేదు
ఇంట్ల అందరికింత తిండి దొరుకుతె సాలనుకున్నం
కలిసందరం కష్టపడ్తే కరువేముంటదనుకున్నం
ఎండన్లే వానన్లే సలన్లే, మట్టిల మట్టోలె మెసిలినం
మట్టి బెడ్డల్ని నలిపి ముల్లుగట్టి నీల్లు వెట్టి సేన్లు పెంచినం
ఊరవతల యేరేసినట్లున్నా
మా ఇంద దగ్గరి కొచ్చినోల్లే మాసుట్టాలనుకున్నం
వాల్లు నియ్యత్ గుండి, నియ్యత్ నిలవెట్టితందుకు పాణాలిస్తమంటే
లేనోనికింత బువ్వదొరికెటట్లు నేస్తమంటే
దోసుకునెటోల్ల ఆట కట్టిస్తమంటే సంబరపడ్డం
మా మనుసులనుకున్నం
కలోగంజో ఉన్నదింత మాతోపాటు తినుమని పెట్టినం
అంతకు మించి మాకేం తెల్వదు బిడ్డా
అంతకు మించి మేమేం జెయ్యలేదు బిడ్డా
దొరల దగ్గర తుపాకులున్నట్లే వాళ్ళ దగ్గరా ఉన్నాయనుకున్నం
బదితందుకోందే ఎవలు భయపడ్తరనుకున్నం
మంత్రాలకు చింతకాయలు రాలయనుకున్నం
ఇంత దెలిసినోల్లు ఇంతో అంతో నియ్యతునోల్లే ఊరిడిసి పెట్టాలొస్తచ్చె
మనసుల కుటిలం బెట్టుకోని ఊరోల్లందర్ని ఏడ్పించే మా దొరలకు
తగిన మిండలొచ్చిరనుకున్నం

నేనేమన్న అన్యాలంగ మాట్లాడిన్నా బిడ్డా
మేమేమన్న మొఖంలేని పనులు జేస్తిమా బిడ్డా
ఎవలినన్నా ముంచినమా, ఎవలి కొంపలకన్న అగ్గిపెట్టినమా
ఎవలితోనన్న గెలిగిచ్చి కయ్యం బెట్టుకున్నమా
మా మానాన మేం బతికినం
మాకు కలిగిందాంతోనే సరిపెట్టుకున్నం
దేవుడు నల్లగ సూస్తె కాలం కలిసొస్తదనుకున్నం
పగలైనా, రాత్రైనా సమానమేననుకున్నం
గిదంత మొన్నటిమాట బిడ్డా, గిదంత కలనుకోవాల్సొచ్చె బిడ్డా
బతుకు గింత అన్యాలంగ అయితదనుకోలేదు బిడ్డా
ఇపుడు రాత్రనంగనే వణుకు పుడ్తంది
చీకటి పడ్డదంటెనే బుగులు బుగులైతంది
కాని పనులు సెయ్యకున్నా కష్టాలు పడాల్సొచ్చె
కాకి బట్టలోల్లొస్తె చేసిన పని జెప్తిమి
అన్న లేడుంటరంటే తెల్వందెట్ల జెప్తం బిడ్డా
పాణాలు దీస్తమంటే మాత్రం పగోనిజాడైనా ఎట్ల జూపిస్తం బిడ్డా
వాల్లేమన్నా కోళ్ళా గొర్లా బిడ్డా బలియ్యడానికి
మనుసుల మాట మనుసులనే ఉంచుకున్నం
మొదటిసారే ఆగమాగం జేసిరి, ఇల్లంత అంగడంగడి జేసిరి
అయినా నోరు మెదుపలేదు బిడ్డా
కాళ్ళమీదబడి కనికరం జూపుమన్నం
తిట్టుకుంట పోయినోల్లు మల్ల రారనుకున్నం
పగిలిపోయిన బువ్వకుండలోల్నే మా బతుకులయినయనుకున్నం
నిద్రవట్టిందో లేదో రాత్రికి రాత్రి
మల్ల దర్వాజమీద దబ్బ దబ్బ బాదవట్టిరి
అన్నల మొచ్చినమనిరి
అయినా ఇనకపోతే బాంబులు పెడ్తమని భయపెట్టిరి
అయ్యేదేదో కాకతప్పతుందా అనుకున్నం బిడ్డా

తలుపులు తియ్యంగనే తోముడు మొదలువెట్టిరి
జాడ సెప్పకపోతే మాజాడ కరువైతదనిరి
అయినా తెల్వందెట్ల సెప్తం బిడ్డా
ఒచ్చేది పొయ్యేది సెప్పి పోవడానికి వాల్లు కన్నబిడ్డలు కాదుగద బిడ్డా
మాది గోజల బతుకైంది
గోజుల కన్నా కనీసంగా తన్నులు దిన్నం బిడ్డా
వాయసోల్లు, ముసలోల్లని జూడకపోయిరి
వాయసయి పోయినోల్లం
వాయసయి పోయినోల్లం ఎప్పుడు దీస్కపోతదో అని ఎదుర్జూసెటోల్లం
కాటికి కాల్లు జాపుకున్నోల్లం
మంచంల పడకపోతే మల్ల మనుసులమైతమా బిడ్డా
ఏ రాత్రి ఎప్పుడెవలొస్తరో, ఏంపేరు జెప్పకొనొస్తరో తెల్వదాయె
కలిగినోల్లం కాకున్నా, కడుపులకు కరువు రాదనుకున్నం
భూమిని నమ్ముకున్నోల్లం
మంట్లెనే బతికి, మంట్లెనే కలిసిపోదామనుకున్నం
అన్నీ ఇడిసి పెట్టాల్సొచ్చింది బిడ్డా
ఊరుమీద ప్రేమా, ఇంటిమీద ప్రేమల్ని తెంపుకోవాల్సొచ్చె బిడ్డా
పాణాలు నిలుపుకునె తందుకు పరుగులు పెట్టక తప్పకపాయె
మా చెమటతో చేతికొచ్చిన పంటను గాలికొదిలేసినం బిడ్డా
గాలి మోటర్ల మీద దిరిగేటోల్లు బాగనే ఉన్నరు
మాయే గాలిబతుకులయినయి బిడ్డా
మేమేం తప్పుజేసినం బిడ్డా, మా బతుకెందుకిట్లాయె బిడ్డా
రెండ్రోజుల్నుంచి నోట్లె మంచినీల్లు వొయ్యలే
నువ్వన్న గింత కనికరం జూపి ఈ పూటకింత తిండిబెట్టవా బిడ్డా
ఇజ్జత్‌దార్ల నింత తిప్పలు పెట్టవట్టిరి
ఇదంతా ఉత్తగ పోతదా బిడ్డా
మాలత్త వాల్లకు తగులక పోతదా బిడ్డా
మాసావు వాల్లకు రాకపోతదా బిడ్డా

# ఆగదు ఈ ప్రజాపోరు

పినాకపాణి

నందనంగా చేస్తానని ప్రగల్భాలు పలికిన పి. వి. నియోజకవర్గంలో
ఎన్‌కౌంటర్ చిగుళ్ళు మొదలయ్యాయి.
కొండపూవుల అశ్రుసిక్త నయనాల్లో కాంతిరేఖగా ఎదుగుతున్న నెలవంకమీద
దొంగచాటుగా తుపాకీలు గర్జించాయి.
ఓ కామ్రేడ్ యాదన్నా !
నీ మరణంతో గుండెలోతులు కల్లోలానికి గురైన
జనం అగ్నిశిఖలుగా మారుతున్నారు
గ్రామాల మీదికి నెత్తుటి కోరల వేయిపడగలు బుసకొట్టి దాడిచేస్తుంటే
తాము మాంసపు ముద్దలయిపోతూకూడా
రగిలి రగిలి దండకారణ్యపు ఎర్రచిగుర్లుగా మారి
రాయలసీమ - నల్లమలను మండించి తీరుతారు

(మార్చి 14న నంద్యాల దగ్గర చెలిమ ప్రాంతంలో పోలీసుల దొంగచాటు కాల్పుల్లో అమరుడైన కె. యాదన్న స్మృతిలో....)

# పోరాటమే మార్గం

— కె. ఉగేంద్రనాథ్ పిళ్ళై

నిరాశల విషవలయంలో బందీవై
కష్టాల రాబందులకు ఎరవై
నిట్టూర్పుల్లో మునిగిపోతే
నిస్తేజంగా మిగిలిపోతే
నీ ఆశయం సిద్ధించదు
నీ లక్ష్యం నెరవేరదు !
దైన్యంగా వున్న నిస్తేజాన్ని
తరిమెయ్

ఆశాలతలు నీ గుండె నిండా
మొలకెత్తుతాయ్
సత్తువ కోల్పోయిన నీ పాదాల్లో
చైతన్యం నింపు
అవి ఉక్కుపాదాలై
ముందుకు దూకుతాయ్
నిర్వేదంతో వున్న నీ చూపులో
నిప్పురవ్వలు కురిపించు
విప్లవ జ్వాలా శిఖలై పైకిలేస్తాయ్ !
నీ పోరాటం
గురి తప్పని మిసైల్‌లా ప్రయోగించు
దొరల దొరతనం పతనమౌతుంది
నీ జీవితం
రేపటితరానికి ఆదర్శమౌతుంది
ఆరుతున్న దివ్వెలకు
ఆయుష్షు పోస్తుంది !

# అప్పుల భారతం

— పి. నాసరయ్య

దోపిడీని కూలగొట్టు
ఏలెటోడ్ని తరిమిగొట్టు
దేశాన్నే అమెరికాకు
పెట్టినారు తాకట్టు
గద్దె నెక్కినోడిదయ్యె
కోట్లుకోట్లు ప్రజలసొమ్ము
రాజకీయ బిజినెసందు
ప్రజలనోట గొట్టు దుమ్ము ॥దో॥
'ప్రజాబంధు' లెక్కువాయె
ప్రజలసొమ్ము మింగుడాయె
ఉన్నదంత మాయమాయె
అప్పుకొరకు తిప్పలాయె ॥దో॥
చెమట కక్కి కష్టజీవి
చారెడంతె తింటవుండె
తెచ్చినట్టి అప్పులన్ని
దోపిదోళ్ళు మింగుతుండె ॥దో॥
అంతులేని అప్పు పెరిగి
ఐ. పి. స్థితికి ప్రభుత వచ్చె
వరల్డ్ బ్యాంక్ ఐయమ్మెఫ్లు
కాళ్ళుబట్టుకోని ఏడ్చె ॥దో॥
రూకవిలువ కోయవలెర
ప్రభుతపాలు తొలగవలెర
ప్రైవేటంతటుండవలెర
అంటు హీన షరతులడిగె ॥దో॥
బాంచనయ్య కాళ్ళు మొక్త
చెప్పినటులె చేసి తీర్త
అంటు గేట్లు దోపిడికి
బార్ల తెరిచినట్టు వార్త ॥దో॥

ప్రైవేటోళ్ళ పెత్తనంతో
పనులు మనకు దొరకవన్న
ధరలు నింగినంటునురో
కూడుగుడ్డ మనకు సున్న ॥దో॥
దోపిదోడు అమెరికోడు
ఐరోపాను అర్పెరో
లాటినమిరికాను మ్రింగి
మనల ముంచవచ్చెరో ॥దో॥
కన్నుమూసి వున్నమంటే
ఉన్నదంత చేయిదాటు
చిప్పమనకు చేతికిచ్చు
తప్పదింక అప్పుకాటు ॥దో॥
ప్రజకు శక్తి తరుగులేదు
ప్రజల శక్తి కెదురులేదు
ప్రజాద్రోహి నిలువలేదు
ప్రభుత పతనమాపలేదు ॥దో॥
ఆకలయిన జనం మనం
ప్రజ్వలించు అగ్గి మనం
పాటుపడెడి శ్రామికులం
ప్రభుతకూల్చు శక్తిమనం ॥దో॥
ఉద్యమాల వెలుగు మనం
పోరుబాట పిలుపుమనం
మేడె యిచ్చు శక్తి మనం
స్వేచ్ఛపోరు సేనమనం ॥దో॥
ప్రజలె మేటి నేతలురా
ప్రజలె మేటి ప్రభుతరా
ప్రజదె గట్టి చేతరా
ప్రజా ప్రభులె రక్షరా ॥దో॥

కథ

# పిడికిలెత్తిన రైతు

—ఆర్వీ

"ఉప్పలన్నా, బండి పాటకు పోతానాదే ఇయ్యాల". అప్పటికింకా తెల్లార టానికి బారెడు పొద్దుంది. వరంగల్‌కు, ఉల్లోకు ఎడ్లబండి కొట్టుకొని పొట్టపోసుకునె ఉప్పలయ్య అప్పుడే లేచి ఎడ్లకు సొప్పేత్తాండు. ఆ మసక మసకలో మాట్లాడిందెవలో అర్థమయి, 'అ పోతాంది, మన సుక్కరాయలింగుది పత్తెస్కపోతాన. ఎందుకురా, ఎవన్నా ఏస్క రావాల్న'.

కొత్తపెల్లి గంగయ్యకి ఒక్కసారి నిరాశ ఆవరించింది. "ఉన్న పత్తిచేను ఎండి పోబట్టె—సీల్లు గట్టాన్కి పైపులు ఏస్కరావాన్నె" గంగడు.

'అయితే పగటాల్లకు మార్కెట్ కాడికి రాపో. మన రెడ్డోల్ల దుకాణం కాడుంట'. అంటు బొక్కెన్ల తౌడేసి కలియబెడ్తాండు.

"అఁఅఁ" అనుకుంట గంగడు ఎనక్కి తిర్గి గుడిసెవైపు నడక సాగించిండు. ఇంకా తెల్లారలేదు. తన బతుక్కి కూడ దారి కన్పించడం లేదు. వాల్గేండ్లకాంచి వున్న రెండెకరాల రాగట్ల పత్తినే ఏత్తాండు. ఓ యోడు కాకపోయిన ఓయోడైన పండదా అని. కాని ఎప్పటికప్పుడు చేతులు దులుపుకున్నట్టె కాబట్టె. అయ్య సావుకు జేసిన అప్పు మిగుల్తాంది. రెండు రెండు నాలుగు రెక్కలు మిగులుతానయ్. తనతో పాటు కాయకష్టం చేసే రామిని యాజ్జేసుకుంటు స్వగతంగా అనుకున్నాడు.

ఎదురుగా గుడిసె కన్పించింది. గంగడి పెళ్ళాం రామక్క లేచి అకి లూడ్తాంది. చిన్నపొల్ల రామక్క కాల్లు పట్టుకొని ఒకటే ఏడుపు ఏడుత్తాంది. కల్లెం బట నీల్లు, ముక్కెంబట చీమిడి, ఒంటిమీద బొత్తమీదకు ఎక్కిన గౌను.

గంగనికి అక్కడ నిలబడ బుద్దిగాక "సీ పోరగాండ్ల పెండ్లాం...." అను కుంట ముందుకు నడుత్తుంటే, "గింతపొద్దుగాల ఎటయ్యా" అంది రామి. కాని అదేం వినబల్లె చిరాకులో వున్న గంగడికి. అయినా రామికి తెల్సు ఆయనెక్కడికి పోతాండో. వారం రోజుల కాన్నుండి మనసుల మనసు లేకుండా వుంటాండు. ఆయన రందేందో రామికి బాగా తెల్సు. పత్తేసిన కాన్నుండి ఒక్క రోజన్నా వానలేదు. ఇప్పటికి

నాలుగు తడులు వేసిన మల్ల వారం కానుండి ఎండకు బోల్సు (పూత) రాలిపోతాంది. ఆకెండి పోతాంది. మల్ల తడెయ్యాల్నంటే పైపులు కిరాయి కావాలే. ఇంజను కిరాయి కావాలే. బాయినోల్లని కాల్లు పట్టుకోవాలే. ఇప్పటికే పంటపేరు మీద మూడువేల అప్పైంది. మల్ల ఎప్పటి శిప్ప యెన్గులెన్నె వుండే. రామి ఒక్కసారి దీర్ఘంగా నిట్టూర్పు విడిచి ఈ లోకంలకు వచ్చే వరకు కాల్లు పట్టుకొని రాగాలు తీస్తున్న నర్సిని చూసి చిరాకేసి ఒక్కటి చరిసింది. దాంతో ఇగ నోరు నెత్తిన పట్టుకొన్నది నర్సి.

× × ×

అది సాయంత్రం.

ఉప్పలయ్య బండి ఊళ్ళోకి అడుగుబెట్టింది.

"అరె కొట్టరాదురా" ముందున్న గొర్లమందను కొట్టుకపోతున్న గొల్లోల్ల అయిలిగాన్ని చూసి అరిచాడు ఉప్పలయ్య. గంగడు బండిలో వున్న పైపుల మీద కూచున్నాడు. ఉప్పలయ్య పగ్గాలు పట్టుకొని బండి నడిపిస్తున్నడు. గొల్లోల్ల అయిలి గాడు ఎనక్కి తిర్గి "నీ యవ్వ అగరాదే, వున్నది గింతంత సందేనాయె. ఎక్కడికి పోతయె గొర్లు". అంటూ గొడ్డలి భుజానేసుకొని గొర్లను అదిలిత్తాండు.

ఇదంతా బండి మీదుండి సూత్తున్న గంగడు మనసుల 'గీ పోరగాండ్లకు ఎవ్వడు చెప్పేటట్టు లేదు. సంఘపోల్లు వత్తాండ్లు పనీపాట లేని పోరగాండ్లను ఎంట దేస్కొని పాటలు నేర్పి, నాలుగు మాటలు జెప్పి ఎటుగానోల్లను జేత్తాండ్లు. మొన్న నాల్రోజుల క్రింద ఊల్లె సారా దుకాణం పగలగొడ్తానపుడు చూసిన గంగనికి యమ కోపమొచ్చిందికాని, పోరంగాండ్లు యెం ఇనెటట్టు లేరని ఊకున్నడు. పక్కూల్లె నుంచి దొంగ సార వత్తనే వుండే, రేటెక్కువ బెట్టి అమ్ముతనే వుండే, వాన్నేం జెత్తాండ్లు. సంఘపోల్లు మీటింగు బెట్టి రైతులు ఇట్లకట్టబడ్తాండ్లు, అట్లకట్ట బడ్తాండ్లు మనం ఎదురు తిర్గాల్నని చెప్పె. గవన్ని ఎవడు చెయ్యాలె. ఏం జెయ్యాల్నన్న బక్క పాదోని మీదనే వీల్ల జులుం' బండి గుడిసె దగ్గరికి వచ్చింది.

ఆ రోజు తొమ్మిది గొట్టె రాత్రి వరకు రామక్క గంగడు కల్సి బాయికాడికి పైపులు మోసుకున్నరు. ఆ రాత్రి ఇగ నిద్ర పట్టలేదు గంగనికి.

'ఇగ గీ ఒక్క తడేసి సూత్త. నీ యవ్వ పండితె పండింది, లేకపోతే లేదు. ఇగ నా వల్ల గాదు. నీ యక్క ఈ యోదే మందుల ధరలు పెరిగె, నూటయెనభై

కచ్చే మందు బత్తా రెండువందల యాభై రూపాలాయె. అయిన ఏసిన. ఇగ అదో నేనో తేలిపోద్ది. గింతకంటె ఎక్కువ చేసెటోడెవడు. చేసి చేసి బొక్కలు తెల్లవడే. పక్కకు పడుకున్న రామిని చూసి వాని మనసంతా ద్రవించింది. పెండ్లైన కొత్తల ....ఎట్లుండె, ముద్దబంతి మొకం, ఇంతింత రెక్క. అప్పటి కళే లేదు. మొకమంత పీక్కుపోయి ఎండిపోయిన సొప్ప లెక్కయ్యింది. తెల్లార్తె పొద్దు బూకితే అదీ నా ఎంబడి ఎవుసాయానికి అచ్చుదేనాయె. మొకం తిప్పుకున్నడు గంగడు. ఒక్కసారిగా ఏదో తెలియని ఆవేశం వచ్చింది. 'తుపుక్కున' వూంచి 'నీ తల్లి బతుకు పెండ్లాం ....' అనుకున్నడు.

పూర్తిగా తెల్లారలేదు.

గుడిసె తలుపు దగ్గరికేసి ముంత యాదయ్య ఇంటికేసి అడుగు లేసిండు. ఆయనే ఈ వూళ్లె జెర పెద్ద ఆసామి. గంగని రెండెకరాల రాగడి పక్కనే యాదయ్య భూమి పున్నా, బాయి అటు మూలకు తవ్విచ్చిండు. దానికి కరెంటు ఇంజను పెట్టించిండు. ఈ వూళ్లె రోజు కల్లు వాడ్కె పట్టుకొని రంది లేకుండా వున్నది గీ యాదయ్యొక్కడే. వాని పోరగాండ్లు పట్నంల సదువుతాండ్లు.

యాదయ్యను లేపి "జెర గియ్యాల యింజను పెట్టాల్నె, లేకపోతే నా సావు కున్నది గోస". అంటే "ఇయ్యాల మా మిరపచేనుకు నీల్లు కడ్తాండ్లు. రేప్పెట్టుకో రాదుర గంగయ్య" అనంగనే తలొంచుకొని ఎనక్కి తిర్గిండు. మంచిగ పంట పండితె బాయి తవ్వియ్యాలె అనుకున్నడు. కాని అది ఈ జన్మల జర్గతదనే నమ్మకం వాడికి పోయింది. 'యాదిగాడు పుణ్యానికి పెట్టినట్టు, పైస్మీద ఇంజను పెట్టడు. ఇగ తను అడుగంటడం కాయం'. వాడి మనసుల దుఃఖం గడ్డకట్టింది.

× × ×

గంగడు ఆ రోజు పత్తేసుకొని మార్కెట్‌కు పోతాండు. బండిమీద పత్తి బత్తాలపై కూసోని బండితోపాటు ఊకుంట ఆలోచనలు చేత్తాండు. "అంతకొద్తె అయిదు బత్తాల పత్తి అయ్యింది. అంటే మూడు క్వింటాల్లు అయితది కావచ్చు. ఏం రేటుందో, దేవుని దయవల్ల ఇయ్యాల ధర మంచి గుండాలే. ఫస్టుల రేటు బాగున్న దని వుప్పలయ్య చెప్పిండే. ఈ మధ్య దించుతాండ్లట, ఏమయితదో ఏమో. ఒక్క సారి గుడిసె యాది కచ్చింది. గుడిసె కప్పాలే, వానకొత్తె బొలెబొలె అయితాంది. ఈసారన్న కప్పాలే. రామికి బట్ట కొనాలే. పీలికలైన బట్టలు కట్టుకోంగా సూడలేక

పోతాండు. పోయినేడు కుదువబెట్టిన రామి పట్టగొలుసులు ఇడ్పియాలే. పోరిని బడికి బంపాలే మంచి బట్టలు కుట్టిచ్చి.

కాని ఇయ్యాటి ధరమీద వుంది తన ఆశంతా. దారిలో గొల్లోల్ల అయిలిగాడు మరో పదిమందిని ఎంటేసుకొని సైకిల్లమీద పట్నం మొకాన పోవుడు చూసి, 'నీయవ్వ ఎటో పోత్తాండ్లు. ఎవని కొంప ముంచుతరో' అనుకొని మళ్ళీ తన ఆలో చనల్లో మునిగిండు.

మార్కెటు వచ్చింది. మార్కెట్ నిండా పత్తి. చుట్టూ అడ్తీ దుకాండ్లు. పీక్కుతినడానికి సిద్ధంగా వున్నట్టున్నాయ్. గోదాములు....గంగని లాంటి రైతుల చెమటని రక్తాన్ని అతి చవగ్గా కొనేసి తనలో దాచుకొనే గోదాములు. పెట్టుబడిదారుల ఆస్తులను కాపాడే గోదాములు. అన్నీ గమనిస్తూనే ధర చెవిన పడింది - గంగనికి. పాణం పోయినట్టైంది వానికి. 'మొదలేవో పదిహేను వందలదాక ధర బెట్టిండ్లు. సర్కారోల్లు కూడ మందుల ధరలు పెరిగినపుడు పంట ధరను కూడ పెంచుత మన్నరు. మొదలు మొదాలు ఎవడు రానప్పుడు ధర పెత్తరు. సంబురపడ్తు రైతులు రాంగనే సప్పున ధర దించేసిండ్లు లం - కొడు - కులు. రైతులంతా గుంపులు గుంపులుగా చేరి ఇవే మాటలు అనుకుంటాండ్లు. గంగని పక్కపంటి రైతొకడు పత్తి కాంట వేయించుకుంటాండు. దూరంనుండి వచ్చాదేమో. ఇగ ధరైనంక ఏం జేత్త రనుకున్నడో ఏమో. గంగడు అటే సూత్తాండు. దడ్వాయికాలు తోటి మెల్లగ బాట్ల కెల్లి తొక్కి టక్కున లెక్క చెప్పతాండు. గంగనికి గుండె గుభెల్లుమంది. ధర తెల్సిన కానుండి ఏదో తెలియని బాధ, కోపం మితమైన ఆవేశం. మార్కెట్లో రైతును దోచుకునే పద్ధతులు కొన్ని కొన్ని యాదికత్తానయ్. అడ్తిల రకరకాల కమీషన్లు, అవి కాకుండా పైసలు ఆ రోజే ఇవ్వాలంటే కూడ ఏదో కమీషనని కట్ చేసుకోని ఇత్తరు. గిక్కడ గీదడ్వాయి కూడ ముంచబట్టే, అగోగక్కడ శాంపిల్ అని సంచులు కోత్తాండ్లు. మరి ధరలు గిట్ల దించితె బత్తాలల్లరాల్లు పెట్టుకచ్చేటోడు పెట్టుకరాడు? గంగని లెక్కడో మండుతాంది అక్కడ గుంపులు గుంపులుగా చేరి మాట్లాడుతున్న రైతుల మాటలు వినబడుతున్నయ్. ఏమో చేద్దామంటాండ్లు. చెయ్యాలె చెయ్యాలే ........ ఏవన్న చెయ్యాలే. గప్పుడే ఎక్కణ్నుంచో గుంపు నినాదలిత్తాండ్లు. 'పండించిన పంటకు ధర పెంచాలని, లేకపోతే రైతులు ఎవ్వరు పంటను అమ్మవద్దని'. గంగనికి యను సంబురమైతాంది. 'అవును ధర పెంచాలే,

లేకపోతే ఆరుగాలం కష్టపడింది వృథా'. వాడికి అరవాలని వుంది. రక్తం పుడుకెత్తుతుంది.... పిడికిలి బిగుసుకుంటోంది. గుంపు దగ్గరైంది. జనం .... వందలాది జనం. అదుగో, గుంపుల అస్పష్టంగా అయిలిగాడు. అవును, గొల్లోల్ల అయిలిగాడు. అవును గొల్లోల అయిలిగాడు. సంఘం గుర్తొచ్చింది. కాని ఎప్పుడూ అర్థం కాని సంఘపోల్ల మాటలు ఇప్పుడు అర్థమయినట్టు అనిపిస్తుంది. పక్కనుంచే పోతుంది గుంపు. కలవాల .... తనూ గుంపులో కలవాలి. గొల్లోల్ల అయిలిగాని పక్కకు చేరాలి. మార్కెటు ఆఫీసులో కూసోని సేట్లందరు రైతుల రక్తానికి ధర కడ్తాండ్లు. చిక్కిపోయిన శరీరాలకు ధర నిర్ణయిస్తాండ్లు. వాళ్లను పట్టాలి.

'తన్నండ్లి' ఎవడో గుంపులో నుండి రాయి విసిరిండు అద్దం 'ఖల్లున' పగిలింది. గుంపులోనుండి "రాల్లు....రాల్లు" అద్దాలు పగులుతున్నాయ్. కుర్చీలు విరుగుతున్నాయ్. అవును పెట్టుబడుదారుల పునాదులు కదులుతున్నాయ్. గంగడు చేతులరాయి తీస్కున్నడు. అతని పిడికిట్లో రాయి బిగుసుకుంటోంది.

---

# పురుష స్వామ్యం

నీ మానం, ఆత్మాభిమానం పిచ్చివాడి చేతిలో బొమ్మలా
మూడు గంటలపాటు నిన్ను నగ్నంగా ఇసుకలో చిత్రహింసలకు గురి చేస్తే
ఆ రక్షకభటుల రాక్షసత్వం చూసి, ఏరు చినబోయింది
లంగాలో తొండలు విడిచి, కాళ్ళు కట్టేసి
నీ బాధలో, కన్నీటిలో రాక్షసానందాన్ని పొందే
ఆ నీచుల దురాగతాలు ఎన్నని - ?
నీ కూతురులాంటిదాన్ని అన్న నీ అర్థింపులకు 'బావ' అని పిలవమన్న
పురుష స్వామ్యంపై పంజా విసురు !

—లక్ష్మీ సుహాసిని

# ప్రజల పాట - అవగాహన

— వి. వి.

మౌఖిక సాహిత్యం గురించి కాని, పాట గురించి కాని విశ్లేషించడానికి ముందు సాహిత్యవిమర్శలో నెలకొని ఉన్న ప్రమాణాల చట్రం నుంచి మనం బయటపడాల్సి ఉంది. లిఖిత సాహిత్యానికి, ఈనాడైతే ముద్రిత సాహిత్యానికి ఉన్న సామాజిక గౌరవం మౌఖిక సాహిత్యానికి లేదు. మౌఖిక సాహిత్యం గురించి ఈనాడెంత ప్రాచుర్యం పెరుగుతుందని చెప్పుకున్నప్పటికీ మొత్తం సాహిత్యంలో భాగంగా పరిగణించి అంచనాకట్టే ప్రయత్నాలు ఎన్నడూ జరగలేదు. సామాజిక రంగంలోని ఇతర అంశాల్లో ఉన్నట్టే లిఖిత, మౌఖిక ప్రక్రియలను ఆస్వాదించి, ఆదరించే "వర్గాలు" ప్రజల్లో వేరు వేరుగా ఉన్నాయి. ప్రజాసాహిత్యం గురించి మాట్లాడే సందర్భాల్లో కూడా ఈ మాట్లాడేవాళ్ళు ఎక్కువగా రాసేవాళ్ళు కావడం వల్ల ఈ లిఖిత సాహిత్యమే ఇప్పటికీ ప్రామాణిక సాహిత్యంగా పరిగణింపబడుతున్నది. అందుకే ముందుగా మన సాహిత్య ప్రమాణాలకు ప్రాతిపదికఐన చట్రం (అలంకారశాస్త్రం) గురించి చర్చించాలి.

భారత ఉపఖండానికి సంబంధించినంతవరకు మనకు తెల్సిన సామాజిక జీవితంలో ప్రజలపాలన ఎన్నడూ ప్రజల భాషలో జరగలేదు. మన మొదటి అధికార భాష సంస్కృతం. అది ప్రాకృతమూ, పాళీ వంటి భాషలను సంస్కరించి ఏర్పరచిన భాష అని అంగీకరించినా అది అధికార భాష అయ్యేనాటికి అది రాజాస్థానాలకు ఋష్యాశ్రమాలకు పురోహిత వర్గానికి మాత్రమే పరిమితమయిన భాష అయింది. భాస, కాళిదాసాదుల నాటకాలను మొదలుకొని సంస్కృత సాహిత్యంలో నాటకాలను పరిశీలిస్తే సీత, శకుంతల వంటి పాత్రలకు కూడా సంస్కృత విద్య నిషేధమని మనకు అర్థమవుతుంది. మన సాహిత్య ప్రమాణాలు ఎన్నడూ ప్రజలభాషగా లేని ఈ సంస్కృత అలంకారశాస్త్రం నుంచి వచ్చినవే. ఈనాటికీ ఈ ప్రమాణాలతోటే మనం సాహిత్య విశ్లేషణ చేస్తున్నాం.

సంస్కృత అలంకారకశాస్త్రం, లేదా దానితో అన్వయించి కొన్నాళ్ళుగా పాశ్చాత్య అలంకారిక శాస్త్రాన్ని అంటే సాహిత్య విమర్శనా పద్ధతులను ప్రవేశపెట్టాం. ఇవి మనకు ఇంగ్లీషు భాషనుంచి వచ్చినవి. ఈ దేశంలో ఇంగ్లీషుభాష

ఎన్నడూ ప్రజలభాష కాకపోవడం మాత్రమే కాకుండా ప్రజలను దోచుకోవడానికి ప్రవేశపెట్టిన పాలకులు కుట్ర అనేది కూడా మనం మరచిపోరాదు. సంస్కృత అలంకారశాస్త్రం, ఇంగ్లీష్ లిటరరీ క్రిటిసిజమ్ ఇచ్చిన ప్రమాణాల నుంచి ఈ ఉప ఖండంలోని ప్రజల సంస్కృతిని, భాషను, సాహిత్యాన్ని అంచనా వేయడం పాలకుల ప్రమాణాలనుంచి ప్రజల జీవితాలను అంచనా వేయడమే అవుతుంది.

అయితే మరి ప్రమాణాలు ఎక్కడినుంచి వస్తాయి ? ఈ ప్రశ్నకు జవాబు మన రాజకీయార్థిక నేపథ్యంలో కూడా గమనించాల్సి ఉంటుంది. కొన్నివేల సంవత్సరాలు వైదికమతం, హిందూమతంగా పరిగణింపబడిన వర్ణవ్యవస్థ, పురోహితవర్గ ఆధిపత్యం, ఫ్యూడల్ రాచరిక పరిపాలన, విదేశీ దండయాత్రలు ఒక విషాదమైతే, మరో విషాదకరం వలసపాలన. ఈ వలసపాలన ఇక్కడి ఉత్పత్తి సంబంధాలతో సంబంధంలేని రాజకీయార్థిక వ్యవస్థను మనపై రుద్దింది. వర్ణవ్యవస్థ అనే చట్రం నుంచి బయటపడకుండానే మనం పార్లమెంటరీ వ్యవస్థ అనే చట్రంలోకి ఒక చైతన్య పూర్వకమైన కృషి, పోరాటం, ఉత్పత్తి సంబంధాల మధ్య మార్పు లేకుండానే నెట్టబడ్డాం. రాజాస్థానాలకు, ఋష్యాశ్రమాలకు, పురోహిత వర్గాలకు బైట ప్రజలు, వారి సహస్ర వృత్తులు వారి జీవన విధానంలో అభివ్యక్తమయ్యే సంస్కృతీ అది ప్రతిఫలించే సాహిత్యం ఉంటుందనే సత్యం ఎట్లా కాలగర్భంలో కలిసిపోయిందో పార్లమెంటరీ రాజకీయాల వెలుపల, పార్లమెంటరీ రాజకీయాలకు భిన్నంగా ప్రజాజీవితముంటుందని, ప్రజాజీవితంలో రాజకీయాలుంటాయని మనం గుర్తించాల్సి ఉంది. కనుక ఒక్కమాటలో వర్ణవ్యవస్థ, వలసపాలనల చట్రాలనుంచి, సంస్కృత ఇంగ్లీషు ప్రమాణాలనుంచి మనల్ని మనం విముక్తం చేసుకుంటే తప్ప మనం మౌఖిక సాహిత్యాన్ని గానీ, పాటను గానీ అంచనా వేయలేం.

రామాయణ, భారతాలు ప్రజల నోళ్ళలో గాథలుగా మారాయని భాసుడు, కాళిదాసు రామాయణ భారత ఆధారాలుగా నాటకాలు రాసారని రాసిన సాహిత్య చరిత్ర అసలు ప్రజల నోళ్ళలోని గాథలే రామాయణ భారతాలయ్యాయని గుర్తించడానికి చాలాకాలం పట్టింది. ఆ గాథలకు లిఖితరూపం ఇచ్చిననాడే, లిఖిత సంప్రదాయం ప్రారంభమయిన దశనుంచే ప్రజలు తమ సంస్కృతీ వారసత్వాన్ని పోగొట్టుకోవడం ప్రారంభమయిందేమో. జనజీవితంలో ఉన్నటువంటి విషయాన్ని ఒక చట్రంలోకి తేవడానికి ప్రయత్నించినప్పటినుండే జనజీవితానికి సంబంధించినటువంటి సంస్కృతినీ,

వారసత్వాన్ని కోల్పోవడం ప్రారంభమయిందేమో. సంస్కృతమూ, ప్రమాణమూ అనే దృష్టి, నియమాలు లేకుండా ఉత్పత్తి సంబంధాలు ప్రమాణంగా ఇవాళ మనం భాషాసాహిత్య సంస్కృతులను విశ్లేషించాల్సి ఉన్నది.

జానపద సాహిత్యంగా, స్థూలంగా విశ్లేషణ ప్రారంభమయిన (మళ్ళీ దీనికి ప్రమాణం సంస్కృతమే) పల్లెపాటలు అన్నీ సారాంశంలో ప్రజల పాటలు కావు గాని అవి ప్రజల పాటలకు ప్రాణాధారం. పల్లె అంటే ఏమిటి ? అడవికి, కొండలకు, నదికీ దగ్గరగా ఉండేది. సముద్రం ఒడ్డున ఉండేది. అడవికి దగ్గరగా ఉన్న పల్లెలు ఆదివాసీ జీవితానికి దగ్గరగా ఉన్న పల్లెలు, ఆదివాసీ తెగల జీవితానికి దగ్గరగా ఉన్న పల్లెలు.

ఆదివాసీ తెగల సంస్కృతిలో మిత్ (Myth) ఉంది. దీనికి సమానార్థకమయిన తెలుగుమాట చెప్పడం కష్టం. వాళ్ళ జీవితాలలో ఉండే కొన్ని నమ్మకాలు, కొన్ని అలవాట్లు అనుకోవచ్చు. ఆ దేశకాలాల్లోకి వెళ్ళి ఆ దేశకాల పాత్రల సందర్భంలో ఆ మిత్‌లోనుంచే వాళ్ళు పాడుకున్న పాటనుగానీ, చెప్పుకున్న కథనుగానీ పునర్నిర్వచించుకుంటే తప్ప మనం పాట మూలాల్లోకి వెళ్ళలేం.

పని-పాట, పాటు-పాట అవినాభావ సంబంధం గురించి చాలామంది చెప్పే ఉన్నారు. గాత్రం అంటే శరీరం. గాత్రం అంటే పాట. శరీర వ్యక్తీకరణ పాట. అంటే శ్రమలో, ఉత్పత్తిలో పాల్గొనే శరీర వ్యక్తీకరణ పాట. ఈ శరీరాలు ఒక సమూహమై ఒక పోరాటంలో వ్యక్తీకరింపబడినపుడు ఒక ప్రచార ఉధృతిలోగాని సంఘర్షణయే సాహిత్యం అనేది మనకర్థంకాదు.

ఉత్పత్తిలో పాల్గొనే క్రమమే కళారూపం. పాటులో పాల్గొనే వ్యక్తీకరణే పాట. లేదా విస్తృతార్థంలో కళారూపం. ఇవి నైపుణ్యంతో రూపొందించుకోవడానికి అన్ని వృత్తుల్లోనూ, ఉత్పత్తితో సంబంధంలేని బ్రాహ్మణులలో తప్ప ప్రత్యేక ఉపజాతులూ, కులాలూ ఉన్నాయి. ఉదాహరణకు ఆదిలాబాద్ జిల్లాలోని గోండు, కోలాము, పరధాను, పరమేశులలో పరధాను అనే తెగ పాటలు పాడడానికి, కథలు చెప్పడానికి ప్రత్యేక నైపుణ్యం పొందినవాళ్ళు. మరాఠీలలో ఆరెమరాఠీలు దాసరులలో మాల దాసరులు ఇట్లా గమనిస్తే ప్రతి తెగలోనూ మనకు కనిపిస్తారు. బెంగాల్, ఒరిస్సా ప్రాంతాల్లో వెదురు కర్రకు తగిలించిన మట్టిపిడత. తీగ (ఏకతార) మీటుతూ పాడే బౌల్ తెగవాళ్ళు తత్వాలు చెప్తూ విచ్చమెత్తుకుంటూ కనిపిస్తారు.

వీళ్ళలో ఎక్కువమంది నేతపనివారు. బ్రిటిష్ వలసపాలన, మిల్లువస్త్రాలు వచ్చి జీవితాలు శిథిలమయినవాళ్ళ కబీరుకు వారసులు. ఆనాడు వృత్తిని ఈనాడు ఆ వృత్తి శైథిల్యాన్ని వాళ్లు పాడుతున్నారు.ఇందులోని కర్మవాదాన్ని సామ్రాజ్యవాద దుర్మార్గం నుంచి వేరుచేసి మనం చూడలేం. బెంగాల్‌లోని భక్తి సంప్రదాయాన్ని, ఉర్దూ సాహిత్యంలోని సూఫీ సిద్ధాంతాన్ని ఈ ఉత్పత్తి సంబంధాలనుంచి వేరుచేసి విశ్లేషిస్తే అర్ధసత్యాలను మాత్రమే కనుక్కోగలం. కాబట్టి ఈ చట్రం నుంచి పైదొలగి కొత్తగా భూమి పొరల్ని తవ్వడం ప్రారంభిస్తే తప్ప ఈ మౌళిక సంప్రదాయ మూలాలు, వనరులు మనం కనుక్కోలేం. ఇవ్వాల్టి ప్రజల పాట దగ్గర ప్రారంభించి వెనక్కుపోతే వీటికి కొత్త మనకు ఆధారాలు లభించవచ్చు. నిన్నటి పల్లెపాటకు, ఇవ్వాల్టి ప్రజల పాటకు ఉన్న సంబంధం ఏమిటి ?

ప్రజ అనే మాటను కూడా ఉత్పత్తిలో పాల్గొనేవాళ్ళు అనే అర్థంలో కాకుండా స్థూలంగా మానవ సమూహం అని అర్థంలో వాడినపుడు ప్రజలు పాడే ప్రతి పాట ప్రజల పాట కాదు.

ప్రజల జీవితాలు, ప్రజల పోరాటాల చిత్రీకరణ మాత్రమే కూడా ప్రజల పాట కాదు. ప్రజల ప్రాపంచిక దృక్పథాన్ని ప్రతిఫలించేది ప్రజల పాట అవుతుంది. ఒక జానపదగాథ, ఒక పల్లెపాట జీవితాన్నే కాక పోరాటాన్ని, ప్రాపంచిక దృక్ప థాన్ని, విముక్తిపథ నిర్దేశాన్ని,ప్రతిఫలించే కళారూపంగా ఎట్లా రూపొందుతుంది ? ఏ యే అంశాలు ఈ రూపాంతరీకరణకు దోహదం చేస్తాయి ? ఈ రూపాంతరీకరణం అయినా, మార్పు అయినా పరిమాణాత్మకమయింది కాదు. గుణాత్మకమయింది. ఒక జానపదగీతం లేదా ఒక పల్లెపాట, ఒక ప్రజల పాటగా విప్లవీకరింపబడిన గీతంగా ఎట్లా రూపొందుతున్నది-అనేది గ్రహించాలంటే పదార్థం (Matter) మీది మిత్ తొలగిపోయి దానిలోని చలనమూ, ఘర్షణా, మార్పూ వ్యక్తమయ్యే తీరుతో అను సంధానించి గ్రహించాలి. అంటే నడకలుగా ఉన్న జీవితం ఉరుకులు, పరుగులుగా గుణాత్మక మార్పు చెందే దశలో జీవిత వ్యక్తీకరణ కళారూపాల్లో పొందే అభి వ్యక్తిని అర్థం చేసుకోవాలి.

సాహిత్యం, కళలు జీవిత వ్యక్తీకరణ. మార్క్సిస్టు పరిభాషలో చెప్పా లంటే ఫలసేకరణ దశనుంచి ఉత్పత్తిలో పాల్గొనే దశదాకా మానవుడు ఆహార సేకరణకోసం ఎంచుకున్న అన్నిమార్గాలలో తన ప్రయత్నాన్ని, శ్రమను, కష్టాన్ని,

ఆనందాన్ని వ్యక్తీకరించిన రూపం. ఈ వ్యక్తీకరణ జీవితాన్ని ఎదుటివారితో, బృందంలో, సమూహంలో పంచుకోవడం కోసం. పాటను పంచుకోవడం అంటే పాటను పంచుకోవడం. వర్గ సమాజంలో ఈ వ్యక్తీకరణలు సహజంగానే ఒక విశ్వ జనీన లేదా సమూహ స్వభావాన్ని కోల్పోయి తమ తమ వర్గ ప్రయోజనాలను ఆపాదించుకుంటున్నాయి. అందువల్ల ఈ వ్యక్తీకరణకు వ్యక్తీకరణ సాధనాలు, రూపం, భాష, ప్రక్రియలు ఉద్దేశించిన వర్గాల ప్రయోజనాన్నిబట్టి మారుతాయి. సూత్రీకరించి చెప్పాలంటే కళలకూ, సాహిత్యానికీ ఆ యా వర్గ ప్రయోజనాలనుబట్టి శ్రోతలు ప్రేక్షకులు వాళ్ళకు ఉద్దేశించిన సందేశం (భావప్రచారం) వాటి కనుగుణమయిన రూపం, ప్రక్రియ, భాషను ఎంచుకుంటాయి.

తెలుగు లిఖిత సాహిత్యంలో లభ్యమవుతున్న రెండు ధోరణులనుబట్టే ఇది వివరించాలంటే వైదికమత ప్రచారానికి నన్నయాదులు రాజాస్థానం, మార్గ (సంస్కృతం) పద్ధతి, సంస్కృతి ఛందస్సు ఎంచుకున్నారు. వైదికమతంపై తిరుగుబాటు చేసిన వీరశైవాన్ని ప్రచారం చేయడానికి పాల్కురికి సోమనాథుడు రాజాస్థానం వెలుపల 'చావకూడు' ఏర్పాటుచేసి దేశీ, జానుతెనుగు పద్ధతుల్లో ద్విపద ఛందస్సులో తన భావప్రచారం చేసాడు. ఈ ప్రయత్నంలో భావజాలంలో రాజరిక భూస్వామ్య భావజాలం నుంచి భాషలో సంస్కృత ప్రభావం నుంచి, ప్రక్రియలో పద్య ప్రభావం నుంచి ఆయనెంతవరకు విముక్తమయ్యాడనే చర్చ వేరు. కానీ నెల కొని ఉన్న ఒక భావజాలాన్ని ఎదుర్కోవాలంటే ఒక కొత్త భావజాలాన్ని ప్రవేశ పెట్టాలంటే మన ప్రేక్షకులను, శ్రోతలను వారికి అవసరమైన భావజాలాన్ని వారి కందించే భాషను, కళారూపాలను ఎంచుకోవాల్సుంటుందనీ, ఇవి అనివార్యంగా పరస్పర సంబంధంలో మారతాయనీ మనం గుర్తించాల్సి ఉంటుంది. తెలుగులో రాజాస్థానాన్ని ఆశ్రయించిన వైదికమార్గ కవులకు భిన్నంగా శతక కవులను అందులో తలమానికంగా వేమనవంటి కవులను విశ్లేషిస్తే ఈ విషయం సులభంగా అవగత మవుతుంది.

భావ ప్రచార అవసరం వచ్చినపుడల్లా సాహిత్యం ఒక చట్రంను ఛేదించు కోక తప్పలేదు. లిఖిత సాహిత్యంలోనే మనకు వెయ్యేళ్ళుగా దానికాధారాలు లభిస్తూ వుంటే ఇంక ప్రజలదైన వివిధౌఖిక సంప్రదాయంలో దానికెంతశక్తి ఉండి ఉండాలి! పాల్కురికి సోమనాథుకు మొదలు వేమనవరకు ఈ ప్రత్యామ్నాయ మార్గాన్ని ఎంచు

కోవడానికి బలమైన ఆలంబన ప్రజల పాటలనుంచి, గాథల నుంచి వచ్చి ఉండాలి. పాల్కురికి సోమనాథుని ద్విపద మొదలు వేమన ఆటవెలది తేటగీతి, గురజాడ ముత్యాలసరాల వరకు జానపదపాటలు, గొబ్బిపాటలు, గుమ్మడి పదాలు చెందిన రూపాంతరీకరణే అని పరిశోధకులు తేల్చి ఉన్నారు. అట్లాగే సైద్ధాంతికంగా ఆస్తికత్వం ఉన్ననాటినుంచి, నాస్తికత్వం వైదికమత ప్రచారం ఉన్నకాలం నుంచి వైదికేతర ప్రజల మతాలు ప్రజల్లో ఉన్నాయని ఈ రెండు భావజాలాల మధ్య ఘర్షణ వర్గ సమాజం ఏర్పడినప్పటినించీ ఉన్నది అనేది నిరూపింపబడిన సత్యమే.

ప్రస్తుతం విశ్లేషించవలసిన అంశం వేల సంవత్సరాలుగా సుసంపన్నంగా ఉన్న ప్రత్యామ్నాయ సాహిత్యంలో అందులోనూ మౌఖిక కళారూపంలో మనం ఎంచుకున్న ప్రేక్షకుల శ్రోతల దృష్ట్యా మనం చేయదల్చుకున్న భావప్రచారానికి ఎంచుకుంటున్న ప్రక్రియల్లో వస్తున్న లేదా తెస్తున్న మార్పు ఏమిటి ? విషయంలో వస్తున్న మార్పు ఏమిటి ? జీవిత చిత్రణలో లేదా నిర్దేశకత్వంలో, దృక్పథంలో వస్తున్న మార్పు ఏమిటి ? ఈ మార్పుమీద ఉత్పత్తి సంబంధాలలో వస్తున్న ఘర్షణ తెస్తున్న ప్రభావమేమిటి ?

తెలంగాణా పల్లెల్లో గత అర్థశతాబ్దపు పల్లెపాటలను తీసుకుంటే వాటిపై ఆంధ్రమహాసభ ఏర్పడిన కాలంనుంచి ప్రజాపోరాటాల ప్రభావం బలంగా ఉంది. మొదటిసారిగా అశేష ప్రజానీక ప్రయోజనాలను సాధించడానికి భూమి, భుక్తితో ముడివడిన భాషా, సంస్కృతీ, జాతి విముక్తి ఆకాంక్ష ఆ ఉద్యమంలో అభివ్యక్తమయింది. గ్రంథాలయోద్యమం, వెట్టిబ్రతుకులనుంచి, బానిసబతుకులనుంచి విముక్తి అనే పునాదిపై నిర్మాణమయింది. రాత్రి పాఠశాలలు, భజనసంఘాలు క్రమంగా రాత్రిళ్ళువచ్చే బడితెసంఘాలతో అనుసంధానింపబడ్డాయి. నూటికి 96 శాతం నిరక్షరాస్యులైన ప్రజలు తమ విముక్తికి సంబంధించిన అభివ్యక్తికోసం అన్వేషించారు. చాలా సహజంగానే వాళ్ళకు మౌఖిక కళారూపాల సంప్రదాయం చేతికందింది.

తెలంగాణా రైతాంగ పోరాటంలో స్పష్టాస్పష్టంగానూ, నక్సల్బరీ శ్రీకాకుళ పోరాటాల్లో స్పష్టంగానూ వ్యక్తమయిన అంశం ఒక ప్రజాస్వామిక విప్లవాన్ని ప్రచారం చేయడానికి, లేదా ప్రతిఫలించడానికి విప్లవోద్యమం జానపద కళారూపాలను ఎంచుకుంటుందనేది. స్థూలంగా చూసినపుడు ప్రజాస్వామిక భావజాల వ్యక్తీకరణకు ఇది ఫ్యూడల్ ప్రక్రియను ఎంచుకోవడంగా కనిపిస్తుంది. కాని నిజానికిది

స్టాలిన్ చెప్పినట్లు జాతీయరూపం (Native form) సామ్యవాద విషయం (Socialist content). అంతిమ విశ్లేషణలో జానపదబాణీ ప్రజలబాణీ అవుతుంది కానీ ఫ్యూడల్ బాణీ కాదు. ప్రజా పోరాటాలద్వారా ప్రజలు రాజ్యాధికారాని కొచ్చేదాకా వర్గ సమాజాల్లో పాలకుల భావజాలమే పాలితుల భావజాలంగా చలామణి అవుతుంది - అని మార్క్స్ అన్నట్టు ఆ పాటల్లోని వస్తువు, ప్రాపంచిక దృక్పథం చాలా సందర్భాల్లో ఫ్యూడల్ భూస్వామ్య వాసనలను వీడకపోవచ్చు. కనుక జానపద బాణీలను ప్రజాస్వామిక భావజాల వ్యక్తీకరణకు వినియోగించడం ప్రజల జీవితాలు పోరాటాలు తిరిగి ప్రజలదైన ప్రాపంచిక దృక్పథంతో ప్రజల దగ్గరికి వెళ్ళడమే అవుతుంది.

నూతన ప్రజాస్వామిక విప్లవ దశలో విప్లవ ప్రజానీకానికి దగ్గరగా వెళ్ళవలసిన విప్లవ సందేశం అనివార్యంగా మౌఖిక కళా సంప్రదాయాలను స్వీకరిస్తుంది. వ్యవసాయ దేశాల్లో విప్లవం నిర్వహించవలసిన మౌలిక విప్లవకర వర్గాలు అత్యధిక శాతం నిరక్షరాస్యులు. ఈ విప్లవకర వర్గాల దగ్గరికి విప్లవ సందేశం వెళ్ళాలన్నా, ఈ విప్లవకర వర్గాల విప్లవ సందేశం వ్యక్తం కావాలన్నా అది మౌఖిక కళారూపాల్లో జరగవల్సిందే. పాలకవర్గాల అన్ని చట్రాలనుంచి వ్యవస్థీకృత సంస్థల నుంచి (Institutions) విముక్తం కావల్సినట్లే పాలకవర్గాల భాషా, సాహిత్య, సాంస్కృతిక చట్రాల నుంచి విముక్తం కావల్సిందే. ఈనాటి సందర్భంలో చెప్పాలంటే సామ్రాజ్యవాద సాంకేతిక పరిజ్ఞానానికి ప్రత్యామ్నాయమైన ప్రజల సాంకేతిక పరిజ్ఞానాన్ని చేపడితే తప్ప పనిముట్లు ఆయుధాలయినట్లే పాటలు ఆయుధాలయితే తప్ప ప్రజాస్వామిక విప్లవం ఫలప్రదం కాదు. మన సౌలభ్యం కోసం ఈ మౌఖిక సంప్రదాయాలకు లిఖితరూపం ఇస్తున్నప్పటికీ ఇవి సజీవ సంచలన రూపంలో—ఇంకా వివరించాలంటే వాటి గతితార్కిక పరిణామ రూపంలో—అవి ప్రజల మౌఖిక సంప్రదాయంలో ఉంటాయి.

మనం తోట దగ్గరికి గుర్రం మీదపోతే మొదట గుర్రం మీదనుంచి తోటను చూడాలి. ఆ తర్వాత గుర్రం దిగి తోటను చూడాలి. తోటలోని ప్రతి చెట్టునుంచి, తీగనుంచి తోటను చూడాలి. చెట్టుమీది, తీగమీది ప్రతి పూవునుంచీ, ఆకునుంచీ తోటను చూడాలి. మొత్తంగా తోటను చూడాలి. అపుడుగానీ తోట మనకర్థం కాదు. మనమర్థం చేసుకోవాల్సింది మాత్రం తోట-అంటాడు మావో. ప్రజల పాటలు

విశ్లేషణ చేయాలంటే ఇట్లా సమాహారంగా పాటలను చూడాలి. స్థూలంగా వాటి స్వభావాలలో వచ్చిన మార్పులను చూడాలి. వాటిలోని సూక్ష్మాంశాలను చూడాలి. గత వర్తమానాలను సంధానించి భవిష్యత్తుకోసం అల్లుతున్న ఈ ప్రజల పాటను రూపొందించిన గద్దర్, అంజయ్య, వంగపండు వంటి కవుల అనుభూతులా, అనుభవాలా తెలుసుకోవాలి. ఈనాడు మనకు ఎందరో ప్రజల పాటలను రాస్తున్నా ప్రచురంగా ఏ ఒకరిద్దరి పేర్లో ఏ ఒకటి రెండు సంస్థల పేర్లో వినవస్తున్నట్టుగానే తెలంగాణా రైతాంగ పోరాట కాలంలో కూడా మనకు మిగిలినవి ఏ రెండు మూడు పేర్లో. ఇది ఒక రకంగా ధాన్యం రాశి మీద రైతువేసే ముద్ర వంటిది. ఆ ముద్రతో, ఆ గుర్తుతో రాశిని పోల్చుకుంటాం. ఆ రాశి స్వభావం, శక్తి, సారం ఆ ముద్రలో వ్యక్తమవుతాయి. ఆ రాశిని వదిలి ముద్రకు ఒక ప్రత్యేక ముద్ర లేదు. కనుక ఆ పేర్లు ఒక ప్రయాణంలో మైలు రాళ్ళు. ఒక వ్యక్తీకరణకు సంకేతాలు.

తెలంగాణా రైతాంగ పోరాటకాలంలో వేలాది పాటలూ, ఇతర కళా రూపాలూ వస్తే మనకివ్వాళ యాదగిరి, సుద్దాల హనుమంతు, రాజారాం వంటి ఇద్దరు ముగ్గురు పేర్లు మాత్రం మిగిలాయి. తిరునగరి రామాంజనేయులు వంటి వాళ్ళు ఆంధ్ర ప్రాంతం నుంచి వచ్చిన విద్యావంతులు తెలంగాణా పోరాటంలో సంలీనమై రాసారు. సుంకర సత్యనారాయణ, వాసిరెడ్డి భాస్కరరావు అటువంటివాళ్ళే.

జానపద బాణీలను చేపట్టి కళారూపాలు రూపొందించిన వాళ్ళలో కూడా మళ్ళీ రెండు రకాలున్నారు. ఆ జీవితం నుంచి వచ్చి పోరాట క్రమంలో చైతన్య వంతులై జీవితాన్నీ పోరాటాన్నీ చిత్రించినవాళ్ళు మొదటి రకమైతే, పోరాట క్రమంలో చైతన్యవంతులై అందువల్ల కార్మికవర్గ చైతన్యం పొంది ప్రజలతో మమేకమై రాసినవాళ్ళు రెండవరకం. బాణీలు, ప్రక్రియలు, భాష ఎంచుకోవడంలో ఈ రెండురకాల్లో సూక్ష్మ విశ్లేషణలో తప్పకుండా కొంత వ్యత్యాసం కనిపిస్తుంది. అనుభవసారానికి జోడైన వర్గచైతన్యం అవగాహన సారానికి తోడైన వర్గచైతన్యం కన్నా సజీవమైన కళారూపాలను సృష్టిస్తుంది.

ఈ అంశానికి రెండవకోణం కాలపరిమితి. తెలంగాణా రైతాంగ పోరాట కాలానికి చైనా మార్గమే మనమార్గం అనే అవగాహన వచ్చేనాటికే పోరాట విరమణ దశకు చేరుకున్నాం. వ్యావసాయక దేశాల్లో ప్రజల విముక్తి భూమి విముక్తి మీద ఆధారపడి ఉంటుందని గ్రామాల మీద రైతాంగం అధికారం భూమిని స్వాధీనం

చేసుకోవడంతో ప్రారంభమై అంతిమంగా రాజ్యాధికారం సిద్ధిస్తుందని ఇది సుదీర్ఘ కాలపు పోరాటంగా ఉంటుందని చైనా విప్లవం అనుభవానికి తెచ్చింది. దీన్నే మావో సెటుంగ్ 'నూతన ప్రజాస్వామిక విప్లవం' అని దీనికి 'వ్యవసాయక విప్లవం' ఇరుసు వంటిదని చెప్పాడు. ప్రజాబలం బలపడి శత్రుబలం బలహీనపడేదాకా ఇది ఆత్మ రక్షణ (గెరిల్లా) పోరాటంగానే ఉంటుంది. అట్లాగే ఉక్కు శిక్షణ గల కార్మికవర్గ పార్టీ నాయకత్వం, ఫ్యూడల్, సామ్రాజ్యవాద శక్తుల్ని ఏకాకుల్ని చేసి ఎదుర్కొ గల ఇతర వర్గాల ఐక్యసంఘటన, ప్రజలనుంచి ఏర్పర్చే సైన్యం - ఈ మూడూ మంత్రదండాల వంటివని కూడా చైనా విప్లవానుభవం నుంచి మావో చెప్పాడు. దేశాల స్వాతంత్ర్య పోరాటాలకు, జాతుల విముక్తి పోరాటాలకు, ప్రజల విప్లవ పోరాటాలకు కార్మికవర్గ పార్టీ నాయకత్వం వహిస్తే విప్లవ విజయం సుసాధ్యమవు తుందని కూడా జపాన్ సామ్రాజ్యవాద వ్యతిరేకయుద్ధం విప్లవ విజయంలో పర్యవ సించడం ద్వారా చైనా గ్రహించింది. వియత్నాంలో కూడా ఈ రాజకీయానుభవమే రుజువయింది. తెలంగాణా రైతాంగ పోరాటంలో జాతి విముక్తి పోరాటం కమ్యూ నిస్టుపార్టీ నాయకత్వంలో 'దున్నేవానికే భూమి' నినాదంతో ఆంధ్రమహాసభ అనే ఐక్య సంఘటనలో భాగంగా కొనసాగింది. అది నిజాం వ్యతిరేక పోరాటంగానే కాకుండా, ముక్కోటి ఆంధ్రులు ఒక్కటి కావాలనే ఆకాంక్షతోనే కాకుండా జమీం దారీ, జాగీర్దారీ వ్యవస్థ రద్దుకై, వెట్టిచాకిరీ రద్దుకై ఒక్కమాటలో 'విశాలాంధ్రలో ప్రజారాజ్య' స్థాపనకై కొనసాగింది. అయినా నాయకత్వం దీనిని దీర్ఘకాలికంగా నిర్వహించ లేకపోవడం వల్ల ఇది దీర్ఘకాల పోరాటమయితే విముక్తి పోరాటమవు తుందని గ్రహించి భారత ప్రభుత్వ మిలిటరీ బలగాలను పంపించి నెహ్రూ, పటేల్‌లు అణచివేయడం వల్ల ఇది అర్ధాంతరంగా ముగిసింది. పర్యవసానంగా సాధించుకున్న విజయాలు కూడా మిగలకుండా పోయాయి. తెలంగాణా చైనాకు యేనాన్ వలె ఒక విముక్త ప్రాంతం కాలేకపోయింది. మూడువేల గ్రామాలను విముక్తం చేసి పదిలక్షల ఎకరాల భూమిపై అధికారం సాధించిన రైతాంగం 51 నాటికి మళ్ళీ ఆ అధికారాన్ని పోగొట్టుకున్నారు. తెలంగాణా పోరాట పాటల్లో "రంగూ రంగుల మారి నెపురయ్యా, నీ రంగూ బయిరంగమాయె నెపురయ్యా' వంటి పాటల్లో విప్లవ శ్రేణుల్లో ఈ అవగాహన కనిపించినప్పటికీ నాయకత్వం ఈ అవగాహనతో పోరాటాన్ని కొనసాగించలేకపోయింది. ఒక నిప్పురవ్వ దావానలం

లాగా వ్యాపించలేకపోవడం, భౌగోళిక పరిస్థితులు, రాజ్యాంగ యంత్రాన్ని పట్టుకోవాలనే అవగాహన, జాతి విముక్తి పోరాటాన్ని విప్లవ పోరాటంలో పర్యవసింపచేయడం మొత్తంగా నూతన ప్రజాస్వామిక విప్లవ వ్యూహానికి సంబంధించిన అవగాహనలో అప్పటికి ఇంకా స్పష్టత ఏర్పడలేదు. ఈ అవగాహన పరిమితులు ఇంచుమించుగా అప్పటి మౌఖిక సాహిత్యానికి కూడా ఉంటాయి. పైన పేర్కొన్న పాటలో కానీ, 'మా భూమి' వంటి నాటకంలో గాని నెహ్రూ, పటేల్‌ల వర్గ స్వభావం గురించి నాయకత్వానికన్నా ముందు చూపు కల విశ్లేషణ కనిపించినప్పటికీ ఆ అవగాహనకు తగిన ఆదరణ, ప్రోత్సాహం లభించలేదు. ఆనాడు అభ్యుదయ రచయితల సంఘానికి కమ్యూనిస్టు పార్టీ ఇచ్చిన స్థానం ప్రజా నాట్య మండలికి ఇవ్వలేదు. 'మా భూమి' నాటకాన్ని కూడా 'అభ్యుదయ' తగిన స్థానమిచ్చి గుర్తించలేదు. చివరకు సుందరయ్యగారే 'అభ్యుదయ' పత్రిక గురించి ఒక విమర్శనాత్మకమయిన వ్యాసం రాయాల్సొచ్చింది. అంటే ప్రజలనుంచి వచ్చిన కళారూపాలను గ్రహించి విప్లవీకరించే కృషి జరిగినప్పటికీ దాని అవసరానికి సంబంధించిన అవగాహనలో ఆనాడు స్పష్టత లేదు.

నక్సల్బరీ, శ్రీకాకుళ పోరాటాలు ప్రపంచవ్యాప్తంగా రివిజనిజానికి వ్యతిరేకంగా జరిగిన పోరాటాల నేపథ్యంలో వచ్చాయి. ముఖ్యంగా చైనా శ్రామికవర్గ సాంస్కృతిక విప్లవ నేపథ్యంలో వచ్చాయి. అందువల్లనే అక్కడ లిన్‌పియావో మూలాలను కన్‌ఫ్యూషియస్‌లో వెతికి రెండువేల సంవత్సరాల ప్రజావ్యతిరేక ధోరణులను ఎండగట్టినట్లుగానే ఇక్కడ దిగంబర కవులతో ఆరంభమై అన్ని విలువల్నీ ప్రశ్నించే ఒక యువ సాంస్కృతికోద్యమం ప్రారంభమయింది. పైకి విగ్రహ విధ్వంసనవంటి ఒక మొరటు విధానంగా కనిపించినప్పటికీ రాజా రామ్మోహన్‌రాయ్, గాంధీ, ఈశ్వరచంద్ర విద్యాసాగర్‌ల గురించి ఉమ్మడి కమ్యూనిస్టు పార్టీ అవగాహనను కూడా యువతరం ప్రశ్నించింది. సామ్రాజ్యవాద వ్యతిరేకత విషయంలో కందుకూరి, గురజాడలను కూడా విమర్శనాత్మకంగా విశ్లేషించవలసిందే అని తేల్చి చెప్పింది. "కలకత్తా కాళిక నాలిక రుచిమరిగిన మధుర మిఠాయి" అని మధురై కమ్యూనిస్టుపార్టీ నిర్ణయాలను పాణిగ్రాహి ఎద్దేవ చేస్తూ రాసిన పాటలో రివిజనిజం మీద తిరుగుబాటు కనిపిస్తుంది. మౌఖిక కళారూపాలను పునర్జీవింపచేసిన వెంపటాపు సత్యం, దానికి రక్తమాంసాలనిచ్చిన సుబ్బారావు పాణిగ్రాహి చైతన్యపూర్వకంగా

వీటిని విప్లవీకరించారు. వెంపటాపు సత్యం స్వయంగా శ్రీకాకుళ గిరిజన రైతాంగ పోరాటానికి నాయకత్వం వహించడమే కాకుండా "కండబలం కలిగినట్టి కొండజాతి వీరు"లను పురికొల్పడానికి పాటలు రాసాడు. మావో సూక్తులు పాటలలో చెప్పి వాళ్ళకి విప్లవ చైతన్యాన్ని పెంచాడు. సుబ్బారావు పాణిగ్రాహి 'అక్టోబరు 31' జముకు కథలో శ్రీకాకుళోద్యమ ప్రారంభాన్ని సూచించాడు. గిరిజనుల వాద్యమైన జముకును గ్రహించి వాళ్ళ కళారూపమయిన జముకు కథను విప్లవ చైతన్యవ్యాప్తికి వినియోగించాడు. స్వయంగా విప్లవోద్యమ నాయకత్వం ఈ మౌఖిక కళారూపాలను పునరావిష్కరించడంలోనే ఈసారి ఈ ప్రయత్నం స్పృహతో చైతన్యంతో కూడిందని అర్థమవుతుంది.

1970 జులై 4న విప్లవ రచయితల సంఘం ఏర్పడిననాడు "ప్రజను సాయుధం చేస్తున్న రెవల్యూషనరీ నేడు కవి." అని చెప్పుకున్న నిర్వచనానికి సాంస్కృతిక ఆచరణ రూపమే అక్టోబరు మహాసభలనాటికి వెలువడిన "నరుడో భాస్కరుడా" పాట, 'శివుడు' పేరుతో ఈ పాటరాసిన కవి అనాడు విప్లవోద్యమానికి నాయకుడు. ఈ ఒరవడిలో ప్రజల దగ్గరికి వెళ్ళడానికి పాట రాయాలన్న అవసరాన్ని గుర్తించి 'జనసేన' వంటి కవులు ప్రముఖంగా పాటలు రాసారు. విరసం ఏర్పడక పూర్వం తమ కవితారూపం 'దిక్కులు' అని ప్రకటించుకున్న కవులనుంచి వచ్చిన చెరబండరాజు "ఏటికేతంబెట్టి ఎయిపుట్లు పండించి గంజిలో మెతుకెరుగని" తెలంగాణా రైతాంగానికి

"కొలిమంటుకున్నాది, తిత్తినిండా గాలి పొత్తంగ వున్నాది
నిప్పారి పోనీకు రాజన్నా"

అని విప్లవ ప్రబోధానికి పాటను ఆయుధంగా అందుకున్నాడు. చెల్లి చెంద్రమ్మ కథాంశం ఉన్న బతుకమ్మ పాటగా పుట్టి ఒగ్గుకథగా పరివర్తన చెందింది. తెలంగాణా రైతాంగ పోరాటపు వారసత్వం ఒక నిర్మాణరూపంలో ఒక ఉద్యమ స్ఫూర్తితో చైతన్యపూర్వకమైన ప్రయత్నంగా పునరావిష్కరింపబడింది.

1972లో ఆంధ్రప్రదేశ్ జననాట్యమండలి ఏర్పడేనాటికి ఉన్న అవగాహన నేపథ్యం ఇది. వెంపటాపు సత్యం, సుబ్బారావు పాణిగ్రాహి శివసాగర్ (శివుడు) చెరబండరాజు వీళ్ళంతా విప్లవోద్యమానికీ, విప్లవ సాంస్కృతికోద్యమానికీ నాయకులు. జనసేన వంటివారు తెలంగాణా రైతాంగపోరాట అనుభవంనుంచి వచ్చి

ములుగు, ఏటూరునాగారం ప్రాంతాల్లో విప్లవోద్యమాన్ని నిర్మించిన రామనర్సయ్య వంటి నాయకుల ప్రోత్సాహంతో పాటలు రాసినవాళ్ళు. వీళ్ళంతా ఇంచుమించుగా తమ అనుభవసారంనుంచి కాకుండా అవగాహన నేపథ్యం నుంచి విప్లవోద్యమంతో మమేకమయినవాళ్ళు. ప్రజా కళాకారులు ప్రజలనుంచి వచ్చే ఒక గెంతు (Leap) వంటి పరిణామాన్ని మనం జననాట్యమండలి ఆవిర్భావంలో చూస్తున్నాం. యేనాన్ విముక్తప్రాంతంలో ఎర్రనాటక రంగస్థల మేర్పడి ప్రజలే విప్లవ కళాకారులుగా రూపొందినట్లుగా హైదరాబాద్ పరిసర కంటోన్మెంట్ ప్రాంతంలో 'బీదలపాట్లు' నాటిక ప్రదర్శనతో ఆ ప్రాంతాల జానపద బాణీలు తీస్కొని పాటలూ, ఇతర కళా రూపాలూ రూపొందించడంతో డప్పు, గజ్జెలు వంటి ప్రజల వాద్యాలు చేపట్టడంతో జననాట్యమండలి ఆ విప్లవ సాంప్రదాయాన్ని ప్రారంభించింది.

ప్రజను సాయుధం చేసిన రెవల్యూషనరీ స్థాయినుంచి ప్రజలే కవులయ్యే స్థాయివరకు విప్లవ సాంస్కృతికోద్యమ ప్రభావం పెరిగిన ఈ రెండు దశాబ్దాల పరిణతి గురించి వివరంగా విశ్లేషణ మరొకసారి [విశాఖ విరసం యూనిట్ నిర్వహించిన 'ప్రజలపాట' పై సదస్సులో చేసిన ప్రసంగంలో ప్రథమార్థానికి సంక్షిప్త రూపం.]

---

# ఇంకానా....

వెదురువుంది - కాగితం లేదు
కర్ర వుంది - తలుపు తాళాలు లేవు
మా మాడియాల ముడిసరుకంతనూ
విశ్వమంతా పంచుకొని ఆనందిస్తుంటే
చూస్తున్నాం - సహిస్తున్నాం
మీ లాఠీలను, తుపాకులనూ భరిస్తున్నాం
అయితే,
ఇంకెంతకాలం భరించమంటారు ?
మీ ఆనందాలలో మేమూ భాగస్వాములవుతాం
వద్దంటే తిరగబడతాం, కాదంటే గుంజుకుంటాం
మీ బాబుగాడి, తాతగాడి సొమ్ము కాదంటూ మరీ చెబుతాం!

— సాధన

# ఎక్కుబెట్టిన పాట

— రుద్రజ్వాల

పాట కిటికీ కాదు
నువ్వు మూసెయ్యటానికి.
పాట నిచ్చెన కాదు
నువ్వు తోసెయ్యటానికి.
పాట నీ పంచె చెంగు కాదు
పాదాలంటి నడుచుకోవటానికి.
పాట నీ పక్కదుప్పటి కాదు
పదవి కింద పరుచుకోటానికి.
పాటంటే సారాపాటనుకున్నావా
ఎవరు మందిని ముంచాలో తేల్చటానికి ?
పాటంటే ఎన్నికల వేలం పాటనుకున్నావా
ఎన్ని పేట లెంతకు పాడాలో వోల్చటానికి ?
పాట ప్రకృతి.
పాట పోటు.
పాట పిలుపు.
పాట మలుపు.
నువ్వు గాలిస్తే దొరకటానికిది కాలిబాట కాదు.
నువ్వు పిలిస్తే నేలబడి దొర్లటానికిది కొబ్బరిబోండా కాదు.
నువ్వు పిండితే బొటబొట జారటానికిది తేనెపట్టు కాదు.
నువ్వు మండిపడితే బూడిద కావటానికిది క్యాయ్యతుపాకీ కాదు.
మాయకుడా, పాలకుడా !
మరల మరల ఏమార్చే పీడకుడా !
ఇది ఎదురుపాటేగాని
బెదురుపాట గాదు.
అడవిని ఆలాపన చేస్తూ
మేఘగర్జనకి పురివిప్పిన పల్లవిని
నువ్వేం ఆపగలవ్ ?
మట్టిపొరని నిద్ర లేపుతూ

పల్లెపాదులా నర్తించే పుద్యమచరణాన్ని
నువ్వేం చూడగలవ్ ?
బొగ్గులా మాడినా
బిరి వదలని చెమ్మసుల కాంతి సందేశాన్ని
నువ్వేం నిషేధించగలవ్ ?
నువ్వు దోసిటబట్టి తాగబోతే
అరచేతిలో ఆకాశమై పురుముతుంది.
నువ్వు కాళ్ళ కిందేసి తొక్కితే
నీ మీదికే పొంటెన్లా చిమ్ముతుంది.
తుంచితే కుంగిపోటానికిది పెరటిమొక్క కాదు.
దువ్వితే పొంగిపోటానికిది పెంపుడుకుక్క కాదు.
కొలువిచ్చి కూల్చటానికిది బతుకుతెరువు కాదు
గడువిచ్చి కాల్చటానికిది అతుకుతెగువ కాదు.
పాట తెన్ను,
పాట దన్ను,
పాట జనం
పాట జవం
పాట నిలువెల్లా
పూరించిన గెరిల్లా !

# పాటంటే...

—వెన్నెల

ఎవడెన్ని కలలుగన్నా....
పాట గాయపడదు-
ఎవడెన్ని కుట్రలు చేసినా....
పాట ఆగిపోదు-
గుండె గాయాల్ని మాన్పే
ఔషదం-పాట
అంతులేని తరంగాల
సెలయేటి ప్రవాహం-పాట

బాధల బతుకును
కష్టాల కడలిలోంచి
తీరం చేర్చే చుక్కాని-పాట
కన్నీటి పొంగుతో
వెలుగుతున్న దీపం-పాట
రోహిణీ తాపాన్ని పరిహసిస్తూ
బంజరు గుండెలోంచి
మొలుస్తున్న మొక్క-పాట

లంబాడక్కల అద్దాల ఘూంఘట్‌లపై
ప్రతిఫలిస్తున్న ప్రభాత కిరణం-పాట
చెంచు గూడేల్లో వసంతాలు పూయిస్తున్న
డప్పుల మోత-పాట
దిగ్బంధనం చేసిన
నిషిద్ధ సభకు
దిక్కుల్ని వెతుక్కొని
తరలి వచ్చిన జనసముద్రం-పాట
ఒరిగిపోయిన ఉదయాల
ఓటమిలేని ఆశయాల ఆకాశం-పాట
అవును
పాటంటే మాకు ప్రాణవాయువు
మా కుండల్లో మెతుకు పాట
మా గుండెల్లో నెత్తురు పాట
సూర్యోదయాలకు సద్దులు కడుతున్నారని
మా ఊరిని వల్లకాడు చేసినోడి కుతికె
మీదికి
వెదురు వనాన్ని విల్లంబులుగా సారిస్తున్న
అడవితల్లి కంటిపాప పాట
అందుకే వాడికి పాటంటే భయం
పాట ప్రవాహమై పరుగులు తీస్తే భయం
పాట పచ్చికబయలై విచ్చుకుంటే భయం
పాట పచ్చగడ్డిమీద మంచుముత్యమై
పరావర్తన కిరణమైతే భయం
పాట పంట చేలైతే భయం
పాట కలుపుమొక్కను కదిలిస్తే భయం
పాట పూతబట్టిన మడి అయితే భయం
పాట కోతకొచ్చిన బంజరైతే భయం
పాట ఆకలితీర్చే అన్నమైతే భయం
పాట అన్నాన్నెవడూ దోయకుండా
సెంట్రీ కాస్తే భయం
పాట పోరు బిడ్డలకు
సద్దిమూటలైతే భయం
ఎందుకంటే....
పాట
ఏలెటోడ్ని వేటాడే సభ అవుతుందని
భయం వాడికి
పాట
జీవితాన్ని భగ్నం చేసేవాళ్ళకు
సమాధి కడుతుందని భయం వాడికి
పాట
ఎన్‌కౌంటర్ బూటకాల్ని చాటే
నెత్తుటి పతాక మౌతుందని
అమర గీతమై
అరుణ కిరణమై అల్లుకుపోయి
నెత్తుటి దాహం తీరకముందే
నెత్తుటి హోళీ ఆడుతుందని భయం వాడికి
పాట
మేల్కొన్న పల్లెయై
పల్లెను పోరుకు సిద్ధం చేసే
పార్టీ తల్లియై....
ఏరివేతల్ని ఎగతాళి చేస్తూ
సరిహద్దు సర్పదళాల్ని
సరిహద్దుల దాకా తరుముతూ
కోంబింగ్ క్యాంపుల్ని కుప్పకూల్చే
గెరిల్లాదళమవుతుందని భయం వాడికి
పాటా....పాటా....
మా పసిబిడ్డల నోటిమాటై....రావమ్మా
మా బతుకు సెలిమల్లో ఊటవై
మేం ఎక్కుపెట్టిన గన్నుల్లో తూటవై
వరదలెత్తి పొంగిపొరలిపోవమ్మా

కథ

# వేగుచుక్క

—ఆజాద్

శీతాకాలం సూర్యుడు అస్తమించాడు. చీకట్లు కమ్ముకుంటున్నాయి. పక్షులు తమ గూటికి చేరి తమ పిల్లలతో తాము చూసిన విన్న కబుర్లను మాట్లాడుతూ రొద చేస్తున్నాయి. వరికోత కోసి అలసిపోయిన ఉంగాల్ కేతులు (గుడిసె) చేరుకున్నాడు. అతని నల్లని కండరాలు తిరిగి బట్టలులేని శరీరానికి చలి జోరుగా తాకడంతో వణుకుతూ నిప్పు—కొర్రాయితో మంటచేసి కూర్చున్నాడు. తను కేతులులో కూర్చున్నది మరచిపోయి ఏవేవో ఆలోచనలు చేస్తున్నాడు. ఆలోచనలు అతని మెదడులో కందిరీగల్లా రొద చెయ్యసాగాయి. అంతలో అతని ఆలోచనలన్నింటిని భంగం చేస్తూ 'లాల్‌సలామ్ ఉంగాల్!' అంటూ కోసాల్ అతని ఆరుగురి సహచరులతో ఉంగాల్ ముందు ప్రత్యక్షమయ్యాడు. 'లాల్‌సలామ్ కోసదాదా' అంటూ లేచి ఉంగాల్ అందరి చేతులు కలిపాడు.

"అంతా మంచేనా ఊర్లో? పోలీసోళ్ళు ఎవరైనా వచ్చిండ్రా ?" అంటూ మళ్ళీ ప్రశ్నించాడు రేంజ్ కమిటీ కోసాల్.

"లేదు దాదా. ఎవడు రాలేదు కూర్చోండి" అని ప్రక్కనే ఉన్న చాపను నిప్పు ముందు వేశాడు ఉంగాల్.

అందరూ కూర్చున్నారు.

"మన సంఘపోళ్ళందరికీ కబురు పెడితిమి గదా! వచ్చిండ్రా ?" అని మళ్ళా కోసాల్ ప్రశ్నించాడు.

"అందరు వచ్చిండ్రు. చెలిమెకాడ బువ్వ వండుతుండ్రు." అని సమాధానం ఇచ్చాడు ఆ గ్రామ కమిటీ అధ్యక్షుడు ఉంగాల్.

పదిహేనురోజుల అజ్ఞాతవాసం గడుపుతున్న రేంజి కమిటీ కోసాల్, ఆ వూరి కమిటీ అధ్యక్షుడు గుమ్సాల్ మరో అయిదుగురు కమిటీ సభ్యులు ఊరు విడిచి ప్రక్క గ్రామాలలో తల దాచుకుంటున్నారు. తన అన్న ప్రజల చేతుల్లో కుక్కచావు చావడంతో పెత్తందారు మాసాల్ పోలీసుల సహాయంతో చుట్టుప్రక్కల గ్రామాలమీద దాడులు చేస్తూ సంఘంవాళ్ళను పట్టి చిత్రహింసలు పెట్టి పోలీసులకు

అప్పజెప్పుతున్నాడు. పెదిరె మాసాల్, పోలీసులు కలిసి చేస్తున్న గాలింపు చర్యల నుండి తప్పించుకొని వచ్చి ఉంగాల్ ఊరిలో తలదాచుకున్నారు. పగలు గుట్టకు విశ్రాంతి తీసుకుని చీకటిపడిన తరువాత ఉంగాల్ కేతుల్లో భోజనంచేసి మళ్ళీ గుట్టకు పోయి పడుకుంటున్నారు. వీరిలో 'గుమ్మాయి' ఒకడు. ఈయన రేంజి కమిటీ సెక్రెటరీ కోసాల్ యొక్క కుడిభుజం. గుమ్మాయి వచ్చి తునికాకును నిప్పుమీద కాపుతూ అన్నల జాడ ఏమైనా తెలిసిందా అనడిగాడు.

"లేదు గుమ్మాయి. మన ప్రక్క ఎక్కడ అన్నల జాడ తెలియరేదు. నాలు గూళ్ళ సంఘపోళ్ళు వచ్చింద్రు. వాళ్ళు మళ్ళ తెలవదన్నారు" అన్నాడు ఉంగాల్.

కాపిన తునికాకు చుట్టచేసి నోట్లో పెడుతూ "ఎంతమంది వచ్చింద్రు?" అని ప్రశ్నించాడు గుమ్మాయి.

"మొత్తం కొడెక్ (ఇరవై) మంది ఉండెటట్లు అనిపించింది" అని అన్నాడు ఉంగాల్.

అంతలో అందరూ భోజనాలు చేసి వచ్చి కేతులుకు చేరుకున్నారు.

'లాల్ సలామ్ దాదలోడి', 'లాల్ సలామ్ దాదా' అంటూ ఒకరికొకరు పరస్పరం కరచాలనం చేసుకున్నారు.

"మీ బువ్వకూడా తెచ్చింద్రు. తినుంద్రి కోసదాదా" అంటూ పూసునార్ గ్రామ కమిటీ అధ్యక్షుడు జోగాల్ గౌరవంగా అన్నాడు.

కోసాల్ చుట్టుప్రక్కల గ్రామాల సంఘంవారికి ప్రియనాయకుడు. పెద్దసంఘం (రేంజి కమిటీ) సభ్యులు కోసదాదా మరియు గుమ్మాయి అంటే వారికి చాలా అభిమానం. కోసాల్, గుమ్మాయి తమ చేతులలోని బర్మారులను ప్రక్కనపెట్టి చేతులు కడుక్కొని అన్నం తినడం మొదలెట్టారు.

"మీ ఊర్లె పోలీసోల్లుగాని, మాసాలుగాడు గాని వచ్చింద్రా" అంటూ అన్నం ముక్కనోట్లో పెట్టబోతూ పూసునార్ జోగాలును ప్రశ్నించాడు గుమ్మాయి.

"మొన్న మాసాల్‌గాడు, వానితోటి పదిమంది విల్లు బాణాలు పట్టుకొని వచ్చింద్రట. నేను పొలంకాడ ఉన్నా. ఊళ్ళో మనోళ్ళిద్దరిని కొట్టి, సంఘపోళ్ళను పట్టించాలి అని బెదిరించి పోయిండట గుమ్మాయి! అందుకే మేము మల్ల ఇంట్లో

పడుకోకుండ అడవిలనే పండుకుంటన్నం. ఏజేసుడు? ఎటు తోస్తలేదు" అని నెత్తి గోక్కుంటూ సమాధానం చెప్పాడు జోగాల్.

కోసాల్, గుమ్సాయి పెద్ద సంఘపోళ్ళు. మీటింగ్ పిలిచారు కాబట్టి ఒక నిర్ణయం తీసుకుని సమస్య పరిష్కరిస్తారు అని అందరు ఎదురుచూస్తున్నారు. అంతలో భోజనం ముగించుకొని ప్రక్కకు పెద్దమంటచేసి అందరూ కూర్చున్నారు.

కోసాల్ లేచి నిలబడ్డాడు. బర్మారు కుడిభుజానికి వేలాడుతోంది. 'కామ్రేడ్ దాదలోడి' అంటూ ఉపన్యాసం మొదలెట్టాడు. "ఈ పది ఇరవై రోజులనుండి పీల్ సాయిగాడు పెదిరెయాసాలును, బొర్జసాయిగాన్ని పిలిచి రోజు మీటింగులు చేసుకుంటూ మన ఊర్లమీద దాడులు చేయిస్తున్నాడు. వీళ్ళకు అండగా పోలీసోళ్ళు ఉన్నారు. మనోళ్ళను బాణాలతో కొట్టింంద్రు. పోలీసోల్లకు అప్పజెప్పింంద్రు. మొన్న బొర్జ సాయిగాడు మెట్టగూడెం ఇస్మాల్ తల పగులగొట్టిండు. కాందల్‌నార్, పాపన్ పల్రి ఊరోళ్ళకు మధ్య తగవుపెట్టించి ఒక ఊరి సంఘపోళ్ళను మరో ఊరి సంఘపోళ్ళతో తన్నిచ్చిండు. చివరికి రెండూళ్ళ సంఘపోళ్ళను తన్ని పోలీసులకు పట్టిచ్చిండు. అసలు ఇదంతా నడిపించేది 'పీల్‌సాయిగాడు.' ఈ ముగ్గురు చేయబట్టే మనం ఆకలితోటి అడవిలోబడి తిరుగుతున్నాం. పెండ్లాం, పిల్లలు ఎట్లున్నరో తెలుస్త లేదు. పంటచేన్లు ఏమైనాయో తెలియదు. మనం లేనిది చూచి ఇండ్లో మేకలను, గొడ్లను తీసుకొనిపోయి పీల్‌సాయిగాని ఇంటికాడ విందులు చేస్తుంంద్రట. మన ఊర్ల సంఘపోళ్ళ పేర్లన్నీ పోలీసులకు చెప్పింది వీళ్ళే- వీళ్ళను ఏంచేస్తే బాగుంటది. మీరే ఆలోచించి చెప్పాలి. మన "అన్నలు" చాన్రోజులైంది కనబడతలేరు. వాళ్ల వస్తే మంచిగుండు. వాళ్ళు రాకపోతిరి. ఎట్ల జేసుడు? చెప్పంంద్రి మీరే." అని ఆవేశంగా మాట్లాడాడు. ఆ మాటల్లో ఉద్రేకం పొంగి ప్రవహిస్తూ ఆవేశంతో మాట్లాడడం వలన ఎక్కువ మాట్లాడలేకపోయాడు.

అతని మాటలు విన్న సభ్యులందరి రోమాలు నిక్కబొడుచుకున్నాయి.

ఇంతలో జోగాల్ లేచి, "ఇన్ని బాధలు పెడుతున్నది పీల్‌సాయే. మన పంటలు కోసుకోకుండా జేస్తుండు. వరికుప్పలు ఎట్ల వేసినయి అట్లనే ఉన్నాయి. ఇంకా విల్లు కాడిలతో ఊర్లో సంఘపోళ్ళను చంపాలని అంటుండు. రాత్రిపూట ఊళ్ళో కాపలా ఉండి అన్నలొస్తే పోలీసోళ్ళకు కబురు చేయాలన్నడు మొన్న. గీసుంటోన్ని చంపితెనే బాగుంటది" అంటూ తన అభిప్రాయాన్ని చెప్పి కూర్చు

న్నాడు. అక్కడున్నవాళ్ళంతా తరతమ స్థాయిలో బాధలు పడ్డవారే. వారంతా ఆ తీర్మానాన్ని ఏకగ్రీవంగా ఆమోదించారు.

ఇరవై మందితో కూడిన దళం పీల్‌సాయిని చంపడానికి బయలుదేరింది. అందులో కోసాల్, గుమ్సాయి ఇద్దరివద్దనే బర్మారులున్నాయి. మిగతావారి దగ్గర విల్లు బాణాలు మాత్రమే వున్నాయి. రెండు పూటలు నడిస్తేగాని పీల్‌సాయి ఊరు రాదు. పగలంతా నడిచారు. సాయంత్రం అయింది. అడవిలో ఒక చిన్నవాగువద్ద అన్నం వండుకొని తిన్నారు.

"ఇటు రాండ్రి మీరంతా!" అని పిలిచాడు కోసాల్.

అతని ఒక్కమాటకే అందరూ సర్దుకొని అతనిచుట్టూ పోగయ్యారు.

"మీరంతా నేను చెప్పినట్లు నడవాలి. ఊరిలోకి పోయినంక అందరూ మొదట వాడి ఇంటిని చుట్టుముట్టాలి. నేను, గుమ్సాయి, వీళ్ళ ముగ్గురు - మొత్తం అయిదు గురం ఇంట్లోజొచ్చి వాణ్ణి చంపాలి. వాని ఇల్లు చుట్టుముట్టెటోల్లు జోగాల్, ఉంగాల్, బండి. ముగ్గురు మూడు దిక్కులనుండి తమవెంట మరో ముగ్గుర్ని కలుపుకొని నలు గురు నలుగురు చొప్పున రావాలి. లేకపోతే వాడు ఎటన్నా తప్పించుకుంటాడు. జాగ్రత్తగా ఉండాలి" అని తన ప్లానును వివరించాడు కోసాల్.

రాత్రి సమయం పన్నెండు గంటలు కావస్తోంది. చల్లగా చలి వారి శరీరాలను తాకుతోంది. కాని వారిలోని వేడిరక్తంతో చలి పోటీపడలేక పోతున్నది. కోసాల్ నాయకత్వంలో దళం కదులుతూ ఊరి చివరకు చేరుకుంది. కోసాల్ ముందు నడుస్తు న్నాడు. అతనివెనుక గుమ్సాయి నడుస్తున్నాడు. అందరూ వాళ్ళను వెంబడిస్తున్నారు. గ్రామంలో అడుగుపెట్టగానే కుక్కలు అరవడం మొదలెట్టాయి. అయినా వాళ్ళ లెక్కచేయకుండా గ్రామంలోకి దూరిపోయారు. చీకట్లో ఇండ్లలోని మంటలు కని పిస్తున్నాయి. ఆ మంటల చుట్టూ చెల్లాచెదురుగా బట్టలులేని రైతులు వారి కుటుం బాలు పడుకొని ఉన్నారు. బయట మనుషులు ఎవరూ కనిపించడం లేదు.

యాయో.... యాయో.... అమ్మా.... అంటూ కోసాల్ దళంలో వెనుక నడచే నలుగురు సభ్యులు పెద్దగా అరుస్తూ కుప్పకూలి పోయారు. ఏంటి? ఏం జరి గింది? అంటూ వెనుకకు తిరిగి చూశాడు కోసాల్. అప్పటికే ఆలశ్యం అయింది. పెద్ద పెద్ద కర్రలు కోసాలు దళసభ్యుల తలలపై నాట్యం చేశాయి. మరో ఏడుగురు నేలమీద పడిపోయారు. రక్తం మట్టిలో కారిపోతూంది. కోసాల్ బర్మారు తీసే సమ

యం కూడా లేకుండాపోయింది. మిగతా ముగ్గురూ పరుగులంకించుకున్నారు. కోసాల్‌కు కూడా పరుగెత్తక తప్పలేదు.

పదినిమిషాల తరువాత ఘటన స్థలానికి వచ్చిన పీల్‌సాయి ముసిముసినవ్వులు పెకిలిగా నవ్వుతూ శాభాష్.... చాల చాకచక్యంగా దాడి చేశారు మీరు అంటూ కోసాల్ దళాన్ని పట్టుకున్న తన గూండాల భుజాలు చరిచాడు పీల్‌సాయి. "ఈరోజు మీరు తాగినంత కల్లు" అని పిచ్చినన్నాసులు గీసంఘపోల్లు నన్ను చంపుతారా ? నేను నా రక్షణ వలయం తెలియదు ఈ మూర్ఖులకు అంటూ ప్రభుత్వం ఇచ్చిన 8 mm రైఫిల్‌ను పట్టుకొని మురిసిపోయాడు.

కోసాలు, గుమ్సాయి మరో ఆరుగురు అడవిలోకి పరుగెత్తి కొంతసేపటికి కలుసుకున్నారు. కోసాల్ బాగా పశ్చాత్తాపపడ్డాడు. తాము చేసిన దాడి ఫలించలేదు. పైగా కొందరు పట్టుబడ్డారు. చనిపోయారా ? బ్రతికారా ? తెలియదు.

''ఏంటి బండి ! ఏం జరిగింది ? నువ్వు వెనుక ఉన్నావుకదా ?'' అని గుమ్సాయి బండిని ప్రశ్నించాడు.

''ఆ దొంగలు ఎట్ల మనమీద దాడి చేశారో నాకేం అర్థం కాలేదు'' అన్నాడు బండి.

''లేదు గుమ్సాల్. బహుశా వాళ్ళ ప్లాను ప్రకారం ఊళ్ళో కాపలా కాస్తున్నట్టున్నారు. కుక్కలు మొరగడంతో ఎవరో వస్తున్నారని గ్రహించిన ఆ గుండాలు ఇండ్లచాటున, చెట్లచాటున మాటుకాసి మనలను దెబ్బతీసారు. మనం ముందుచూపుతోనే పోయినం గాని వెనుకవచ్చే దెబ్బను గ్రహించలేదు. గుమ్సాయి'' అని కోసాయి తన నిస్సహాయతను వ్యక్తపరచాడు.

''ఇగ అయిందేదో అయింది. ఇప్పుడేం చేసుడూ ?'' అంటూ గుమ్సాయి రేంజి కమిటీ కోసాల్ మొగం చూస్తూ అడిగాడు.

"అదే ఆలోచిస్తున్నాను" అన్నాడు కోసాల్.

"ఏం లేదు కోసదాదా! మనందరం కలిసి ఊరూరా అడుక్కు తినుకుంటూ ఎట్లన్న జేసి మన 'అన్నల'ను కలుసుకోవాలి. లేకపోతే మనకు రక్షణలేదు" అంటూ తన ప్రతిపాదనను చర్చకు తీసుకొచ్చాడు బండి.

కొంతసేపు తన గడ్డంలేని చెంపను ఎడమచేతితో రాస్తూ ఆలోచించి — "అలాగే చేద్దాం! ఇక్కడుంటే ఎట్లాగూ మనం బ్రతకం. ఎన్ని కష్టాలొచ్చినా తిప్పలు

పడి మన అన్నలను వెతికి పట్టుకుందాం. ఏమంటారు? మీరందరూ చెప్పండి కామ్రేడ్స్!" అంటూ అందరి మొగాలు చూశాడు కోసాల్.

అందరూ బియ్యం అయిపోయిన మూటలను, గిన్నెలను చూస్తూ అట్లాగే చేద్దాం కోసదాదా! నీవెట్ల జెప్పితే గట్లనే అని అందరూ తమ అభిప్రాయాన్ని వ్యక్తం చేశారు. కాని 'గుమ్సాయి' మాత్రం మౌనం వహించాడు. అతని మౌనాన్ని ఎవరూ పెద్దగా పట్టించుకోలేదు. అంతా కలిసి 'అన్నలను' వెతకటంకోసం తమ జైత్ర యాత్రను ఆరంభించారు. అలా ఒక రోజంతా ప్రయాణం చేశారు. ప్రొద్దునంతా ఉపవాసం ఉండి రోజంతా నడిచేసరికి అందరూ అలిసిపోయారు. కోసాల్ ఆ గ్రామ రైతును కలుసుకొని ఊరి సమాచారం తెలుసుకొని తనను తన దళాన్ని పరిచయం చేశాడు "కొన్ని నూకలు (బియ్యం) ఇస్తే మేమే వండుకుంటాం దాదా! నీవు ఒక్కనివే చాతనైనంత ఇవ్వు. కాని ఊర్లో మాత్రం చెప్పకు" అంటూ కోసాల్ సరిపడా బియ్యం సంపాదించి గుమ్మడికాయకూర చేయమని దళాన్ని పురమాయించాడు. మంటలు వెలుగుతున్నాయి. ఆ మంటల వెలుగులతోపాటు గుమ్సాయి మొఖంలో రంగులు మారుతున్నాయి. చడీ చప్పుడు లేకుండా కూర్చున్న గుమ్సాయిని చూస్తూ —

"ఏం మాట్లాడతలేవు గుమ్సాయి! ఏమైంది?" అంటూ కోసాల్, గుమ్సాయిని ప్రశ్నించాడు.

ప్రశ్న వింటూనే గుమ్సాయి తన మనసులోని మాటను బయటపెట్టేశాడు.

"లేదు కోసాల్! నేను ఒకసారి ఇంటికిపోయి చూసి వస్తా. మా ముసలవ్వ ఎట్లుందో! తమ్ముడు చిన్నోడు. ఒక్కసారి అట్లపోయి ఇట్లా వస్తా" అన్నాడు.

అతని మాటలు విన్న కోసాల్, మిగతా సభ్యులందరూ ఆశ్చర్యాన్ని వ్యక్తం చేసారు.

"ఏం మాట్లాడుతున్నావు గుమ్సాయి. పరిస్థితి అంతా చూస్తలేవా. వింటలేవా." అంటూ పొయిల కర్రలు ఎగతోస్తూ బండి అనేశాడు.

"ఏం కాదు. జాగ్రత్తగా పోయివస్తా. అన్నలు కలిసేవరకూ చాన్రోజులయేటట్లుంది" అంటూ తన ఆతురతను వ్యక్తం చేసాడు గుమ్సాయి.

"మొన్ననే మనం పీల్సాయిని చంపేతందుకు పోయి వస్తిమి. ఇప్పుడు మాసాల్గాడు, పోలీసోల్లు బాగా తిరుగుతుండొచ్చు. నీవు ఒక్కనివి ఎట్ల పోయి

వస్తవు. అక్కడుంటే చచ్చేటట్లున్నామనే అన్నలను కలిసేటందుకు దోడుకు (క్రిందికి) పోతున్నం. మళ్ళీ నీవు ఇంటికి పోతనంటున్నావు. మళ్ళ మన పటేలుగాడు కూడా ఎట్లున్నడో తెలియదు. నీవు అంటున్నది నాకు నచ్చలేదు గుమ్సాల్" అంటూ తన నిరసన వ్యక్తం చేశాడు కోసాల్.

చాలామంది సభ్యులు నచ్చజెప్ప చూశారు కాని గుమ్సాల్ తన మొండిపట్టును విడవలేదు.

"నీ ఇష్టం. మేం చెప్పితే వినిపించుకుంటలేవు. పోతే పోయి చూసిరా కాని జాగ్రత్తగా పోయిరా! ఎల్లుండి గుర్రుగుట్టకాడ మేం కలుస్తాం. నీకోసం ఎదురు చూస్తాం. అక్కడికి వస్తవుగదా!'' అంటూ తన చెవుమీది చుట్టను నోట్లో పెడుతూ అన్నాడు కోసాల్.

తన పంతం నెగ్గడంతో సంతోషపడ్డ గుమ్సాల్ లేచి గంతులు వేస్తూ "తప్పని సరిగా అక్కడికి వస్తా. నూకలుకూడా తీసుకొని వస్తా''నని అన్నాడు గుమ్సాయి.

అందరూ అన్నం తిన్నారు. చాలా బాధాకరంగానే అందరూ గుమ్సాయితో విడిపోయారు. గుమ్సాయి తన ఊరుపైపు ప్రయాణం విశ్రాంతి లేకుండా కొనసాగిస్తున్నాడు. రాత్రంతా ప్రయాణం చేసిన గుమ్సాయి వేగుచుక్క పొడిచి తెలతెల వారుతుండగా కొంత అంచున తనకేతులు వద్దకు చేరుకున్నాడు. చుట్టూ పరికించి చూశాడు. దూరంగా కళ్ళం తయారు చేస్తున్న తన చిన్నాయన కనిపించాడు. ఒక కూక వేశాడు. ఆ కూక విన్న చిన్నయ్య లేచి చూశాడు. ఇది తెలిసిన గొంతే గాని సందేహంగా ఉంది. మళ్ళీ కూక వేశాడు గుమ్సాయి. అప్పుడు గుమ్సాయిని చూచిన చిన్నయ్య చేతిలోని పార వదిలేసి పరుగు పరుగున గుమ్సాయిని చేరుకున్నాడు.

"ఏందిరా గుమ్మాయి. మూడు వారాలైపోయింది. ఎటు పోయినవు? ముసల్ది ఏడుస్తుంది గదరా!'' అంటూ తన చిన్నయ్య విచారాన్ని వెలిబుచ్చాడు. అసలు గుమ్సాయి ఇంటికి వచ్చింది ముఖ్యంగా ముసలి అవ్వను చూసి పోదామనే. చిన్నయ్య సూటిగా చెప్పింది కూడా అదే అని ఆలోచిస్తూ.

"నీవు పెళ్ళి అవ్వను, నీ కోడలిని పిలుచుకొనిరా. ఊక్కో ఎవరికీ చెప్పకు. తొందరగా ఉరికి పోయిరా.'' అంటూ గుమ్సాయి. ఊరి పరిస్థితి, ఇంటి పరిస్థితి ఏమీ తెలుసుకోకుండానే తన దగ్గరకు వచ్చిన చిన్నయ్యను పరుగెత్తించాడు.

"మల్లొచ్చినంక అన్నీ మాట్లాడుతా. నీవు ఇక్కడ్నే ఉండు. ఎటూ పోకు" అంటూ పరుగెత్తుతూనే చిన్నయ్య అనుకుంటూ ఊరివైపు కదిలాడు.

వేగుచుక్క మాయమైంది. సూర్యుని లేతకిరణాలు మంచుతో తుడిచిన ఆకులపై పడి మెరుస్తున్నాయి. గుమ్సాయి వెళ్ళి తన చేతుల్లో కూర్చున్నాడు. కాని తన నాటు తుపాకిని మాత్రం విడవటం లేదు. దాన్ని తన ప్రాణాన్ని ఒకలాగే చూసుకుంటున్నాడు. గుమ్సాయి దృష్టంతా తన ఊరినుండి వచ్చేదారిపైననే ఉన్నది. ఆ చెట్లపై కిరణాలను దీర్ఘంగా చూస్తూ కూర్చున్నాడు.

చిన్నయ్య ఇంటికి వెళ్ళి గుమ్సాయితల్లికి, భార్యకు విషయాన్ని చెప్పి పంపించి గుమ్సాయికి గోర్కకల్లు తీసుకపోదామని గోర్క చెట్లవద్దకు పోయాడు చిన్నయ్య. అక్కడే పటేల్ మూకాల్ అతని సహచరులు నలుగురు కల్లు త్రాగుతూ కూర్చున్నారు.

"ఏంటిరా కేశా! ఆదరాబాదరాగా వస్తున్నావు. ఎటు పోతున్నావు?" అని ప్రశ్నించాడు పటేల్.

"ఏం లేదు మామా! కొంచెం గోర్కకల్లు తీసుకొని పోదామని వచ్చిన" అన్నాడు చిన్నయ్య (కేశా).

"ఎవలికిరో" అని ప్రశ్నించాడు పటేలు.

కాని గుమ్సాయి చిన్నయ్య కేశా ఏం మాట్లాడకుండా కొంతదూరాన ఉన్న తన గోర్కచెట్టు ఎక్కడం మొదలెట్టాడు.

ఏంటి వీడు అంత గాభరాగా వున్నాడు. ఎవరికి అంటే చెపుతలేడు. అంటూ తన నలుగురి సహచరులతో పటేల్ గుసగుసలాడాడు. వాళ్ళుకూడా పటేల్‌తో ఏవో గుసగుసలాడారు. విషయం ఏందో లోతుగానే తెలుసుకుందాం అని మనసులో అనుకున్న పటేల్ కేశా గోర్కచెట్టు దిగేవరకు ఉండి మళ్ళీ ప్రశ్నించాడు. అప్పుడు కేశా ఉన్న రహస్యాన్ని బయటపెట్టాడు.

"గట్ల చెప్పవేందిరా కేసా! పాపం వాడేందిరా చెట్టు గుట్టబట్టి తిరుగుతుండు. ఏం తిప్పలు ఇవి" అని సానుభూతి ఒలకబోస్తూ "పద, నేను కూడా ఇంత కల్లు పట్టుకొస్త. నాకు గూడా చాలా రోజులైంది. పోరడు కనిపించటంలేదు. మంచీచెడ్డా మాట్లాడుదాం." అన్నాడు పటేల్.

ముందుగా కేసా నడుస్తున్నాడు. అతని వెనక నడుస్తున్న పటేల్ అతని సహచరులు ఏవేవో గుసగుసలాడుతున్నారు గాని ముందు నడుస్తున్న కేసాకు అదంతా ఏమీ తెలియదు. బాట వెంబడి నడుస్తున్నారు గుమ్సాయిని కలుసుకోవడానికి.

కొడుకు వచ్చాడనే సంబరంతో ముసలవ్వ, ఆమెతో పాటు గుమ్సాయి భార్య అయితి కేతులుకు చేరుకున్నారు. వస్తూనే ఏడుపు లంకించుకున్న ముసలవ్వ గుమ్సాయి మీదపడి ఏడ్చింది. తనివిదీర ఏడ్చి కొంత తేరుకొని, "ఏంరా గుమ్సాయి ? రెండేళ్ళ క్రింద నీ అన్న-వదనెలు అన్నలతో కలిసిపోయి తిరగబట్టిరి. వాడు బోయినంక నీవు సంఘంల జేరి అడివిబట్టి తిరుగబడితివి. మొన్న పోలీసోళ్ళు వచ్చి నన్ను, నీ భార్యనూ కొట్టి తమ్ముని పట్టుకపోయి జైల్ల బెట్టిరి. ఏం జేసుడు ఇప్పుడు ?' అని ముసలవ్వ తన కొంగుతో కన్నీళ్ళు తుడుచుకొని, ముక్కుచీది దుఃఖం నుండి తేరుకుంది. తమ్ముని జైలుకు తీసుకుపోయింద్రని విన్న గుమ్సాయికి చెంపమీద చెళ్ళున చరిచినట్లైంది. "తమ్మున్ని ఎందుకు పట్టుక పోయింద్రవ్వా ?" అని గుమ్సాయి తల్లిని ప్రశ్నించాడు.

"అన్నలతోటి పోయిన సోమాల్‌నూ, నిన్నూ పట్టియ్యాలనంట. మిమ్ముల్ని పట్టిస్తేనే వాన్ని వదలిపెడతామన్నరు."

తల్లి మాటలు విన్న గుమ్సాయి ఆవేశం కట్టలు తెంచుకుంది. కాని ఏమీ చేయలేని నిస్సహాయ స్థితిలో తానున్నాడు.

"ఏం జేసుడురా గుమ్సాయి ! మీ అన్న అచేపామె. నీవు మల్ల అట్లనే అయితివి. వరిచేను ఎక్కడిది అక్కడనే వుంది. వెదిరె మాసాల్‌గాడు రోజూ ఇంటికి వొచ్చిపోతుండు. నువ్వు ఎక్కడ దొరికినా చంపుతానంటుండు'' అంటూ తన ఆందోళన వ్యక్తం చేస్తూ రవికలేని తన ఛాతిని తెల్లని చీరకొంగుతో కప్పుకుంది.

"నువ్వు ఊళ్ళో కెల్లిపోయినంక వెదిరె మాసాల్ వచ్చి మనయి రెండు గొడ్లు, మూడు మేకలు తరిమి తీసుకొని పోయిండు" అంటూ అత్త మరిచిన విషయాన్ని గుర్తుచేస్తూ గుంజ పట్టుకొని నేలకు చూపులు పారించింది గుమ్సాయి భార్య.

గుమ్సాయి కండ్లు కోపంతో ఎరుపెక్కాయి. నల్లటి మొగానికి ఎర్రని కండ్లు భయంకరంగా కనిపిస్తున్నాయి. నోటమాట పెగలలేదు గుమ్సాయికి. బర్మారు పట్టుకొని లేవబోయాడు గాని మనసు 'వద్దు కూర్చో' అని కూర్చోబెట్టింది. అవ్వకు ఏమని సమాధానం చెప్పాలో తోచలేదు గుమ్సాయికి.

"ఏం కాదులే అవ్వ ! ఎంతకాలం ఇట్ల జేస్తరో చూద్దాం. అన్నలొస్తే వీళ్ళ పని అయితది. ముందు జంగలాతోళ్ళతోటి తిప్పలు పడ్డాం. పట్వార్లతోటి తిప్పలు బడ్డం. అన్నలొచ్చినంక వాళ్ళు ఉరికిండ్రు. ఊరిపెద్దలు లంచం తినుడు బంద్ అయింది. పెద్దమనుషులు, షావుకార్లు అందరూ వంగిండ్లుగాని ఈ పోలీసోళ్ళు వంగ లేదు. పోలీసోళ్ళ బలంతోటే మళ్ళీ పెద్దమనుషులు లేచిండ్రు. ఈ పోలీసోళ్ళనీ, పెద్దమనుషుల్నీ మట్టి గరిపిస్తేగాని మన రాజ్యం రాదు. మన రాజ్యం వస్తే అప్పుడు మనకీ తిప్పలు ఉండవు. మనం చల్లగా బతుకుతాం అవ్వా ! ఏడ్వకు" అని ఓదార్చాడు గుమ్మాయి.

"లేదు బిడ్డా ! ఇటు పోలీసోళ్ళు, అటు వెదిరె మాసాల్, పీల్‌సాయి ఇల్లంతా సోదాచేసి కొట్టిపోబట్టిరి. తమ్మున్ని తీసుకపోయిరి. నిన్న కబురొచ్చింది. ఏందంటే సంతలనంట ఏదో పెద్ద మీటింగ్ ఉన్నదట. అన్ని ఊర్లోల్లు మీటింగుకు రావాలనట. ఎవ్వడు రాడో వాళ్ళకు ఒక మేక, 50 రూపాయలు జుర్మానా ఇచ్చుడట. ఇంత పాపం ఎక్కడ జూడలేదు. ఇన్ని బాధలు ఎవడు బడతడు. అన్నలు వొస్తే ఒక బాంబు అడుక్కుంటం. ఆ బాంబుని గాకుక్కల కొడుకుల మీద విసిరేసి నేను మల్లి సస్తా !" అని తన బాధకు, కోపానికి పరిష్కారమార్గంగా గుమ్మాయికి చెప్పింది.

ఆ మాట విన్న గుమ్మాయి ఆనందంగా తల్లి మొఖంలోకి చూశాడు. తన తల్లి కూడా లడాయి చేయటానికి బాంబు అడుగుతున్నది అని మనసులో నవ్వుకున్నాడు. అంతలో కేతులుకు వచ్చేదారి వెంబడి అరుగురు వ్యక్తులు రావడం చూచి టక్కున ప్రక్కకు పెట్టిన తుపాకి అందుకున్నాడు. వస్తున్నవాళ్ళను పరీక్షగా చూశాడు. వాళ్ళు తమ గ్రామస్తులే. వీళ్ళను ఎందుకు పిలుచుకొస్తుండు చిన్నయ్య అని మనసులో సందేహిస్తుండగానే ఆ వ్యక్తులు కేతులు వద్దకు చేరుకున్నారు. వచ్చిన చిన్నయ్య, పటేల్ సహచరులు తమ చేతుల్లోని కల్లు బుర్రలను కింద పెట్టారు. కల్లు పుల్లని వాసనతో నురుగులు పొంగుతోంది. గుమ్మాయి కండ్లు కల్లు బుర్కల మీద పడ్డాయి. తనకు తెలియకుండానే గుటకలు మ్రింగాడు.

"ఏందిరా గుమ్మాయి ! ఇల్లిడిసిపెట్టి ఏం తిరుగుడురా అది. గట్ల తిరిగితే బువ్వ దొర్కుతదా" అంటూ గుమ్మాయి ముందు కూర్చున్నాడు పటేల్.

"ఏం జేసుడు చెప్పు. పీల్‌సాయిగాడు, మాసాల్‌గాడు, పోలీసోల్లు తిరగబట్టిరి ఇంటికొస్తే ఎట్ల బతుకుడు" అంటూ గుమ్మాయి సమాధానమిచ్చాడు.

"చూడు బిడ్డా ! నువ్వింటనంటే సేనొక మాట సెపుతా"నంటూ చుట్టముట్టించి పొగ వదిలాడు పటేల్.

"ఏంటిదో చెప్పు" అన్నాడు గుమ్మాయి.

"చెప్పుతగాని ముందుగాల కల్లు తెచ్చినం రెండు గుటకలు తాగు బిడ్డా" అంటూ "అల్లెటురా ! ఆకు తెచ్చి కల్లు వంచుండ్రి" అని తన సహచరులను కల్లు పోయడానికి పురమాయించాడు పటేల్. కల్లు చూచిన గుమ్మాయికి నోరూరింది. పటేల్ మనుషులు కల్లు వంచుతూ పోతున్నారు. గుమ్మాయి ఆగకుండా కల్లు తాగుతూ పోతున్నాడు. ఒక బుర్ర అయిపోయింది. "మరో బుర్ర వంచండిరా చూస్తా రేంటి" అన్న పటేల్ ఆజ్ఞలో మరో బుర్ర కల్లు వంపారు. తృప్తిగా కల్లు సేవించిన గుమ్మాయి ఆనందభరితుడైనాడు.

"చూడు బిడ్డా ! నేను ఎట్లన్నజేసి పెదిరెమాసాల్, పీల్సాయితో మాట కలిపి పోలీసులు ఏం జేయకుండ జూస్త. నీవు ఇంటికాడనే ఉండుకుంట సంఘంల పని జెయ్యనని మాటిస్తే ఎట్లనన్న నిన్ను రక్షిస్త చెప్పు ఆలోచించుకొని. ఎన్నాళ్ళు ఈ అడివిల తిరుగుతవు. ముసలిదాన్ని ఎవ్వడు సాదాలి చెప్పు. నీకు ఏదో సాయం చేద్దామని వచ్చిన. నీవు ఎట్ల జెప్పితే గట్లనే బిడ్డా!'' అని తన సానుభూతిని వెళ్ళబోశాడు పటేల్.

అప్పటికే గుమ్మాయి పూర్తిగా కల్లు నిషాలో మునిగిపోయాడు. అతని కండ్లు గిర్రున తిరుగుతున్నాయి. పటేల్ మాటలు కొన్ని అర్థమవుతున్నాయి. కొన్ని అర్థమౌవుతలేవు. తన మెదడును స్వాధీనంలో ఉంచుకోవటానికి ప్రయత్నం చేస్తున్నాడు. ఏదో మాట్లాడబోతున్నాడు గమ్మాయి తత్తర....తత్తరగా. గుమ్మాయి అశ్రద్ధగా ప్రక్కకు పడేసిన తుపాకిని చూశాడు పటేల్. ఇదే అదను అని తన మనుషులకు కనుసైగచేసి బర్మారును హఠాత్తుగా తన చేతిలోకి తీసుకున్నాడు. సయ్....సయ్....సయ్....మంటూ మూడు బాణాలు గుమ్మాయి గొంతునూ, ఛాతీనీ చీల్చుకుంటూ బయటికి వెళ్ళిపోయాయి. వేడి రక్తం సర్రున ఎగజిమ్మింది. గుమ్మాయి ప్రాణాలు అనంత వాయువుల్లో కలిసిపోయాయి.

ఈ హఠాత్పరిణామాన్ని చూసిన గుమ్మాయి తల్లి నిశ్చేష్ఠురాలై కొంత సేపటికి తేరుకొని గుమ్మాయి మీద బోర్లాపడి ఏడ్వసాగింది. ఆమె కట్టుకున్న తెల్లటి

చీర గుమ్సాయి రక్తంలో తడిసి ఎరుపెక్కింది. ముసలవ్వ కన్నీరు రక్తంతో కలిసి ఎర్రగా మారుతోంది.

"నా భూమిని పంచుతావురా! నా వద్దు ఊరోళ్ళకు పంచుతావురా! అన్ని పంచాతులు నీవే జేస్తవు. కానును అంతా నీదే కాదురా! ఫో నాకొడకా! అని గుమ్సాయి శవాన్ని కాలుతో తన్ని "వీని పీడ విరగడయ్యింది. ఇంక అసలోడు కోసాల్ గాడున్నడు. వాని పత్త లేదు. వాడు ఎటో పారిపోయిండు. ఇప్పుడిక కానూనంతా మనదే పదరా!" అంటూ పెద్ద పెద్ద అంగలు వేస్తూ తన సహచరులతో వెళ్ళిపోయాడు. పదిరె మాసాలు పన్నిన కుట్ర ఫలించింది.

ఈ వార్త దావానలంలా అడవంతా వ్యాపించింది. వార్త విన్న బస్తర్ అడవి అల్లాడిపోయింది. అన్నలతో కలిసివచ్చిన కోసాల్ మరియు గుమ్సాయి అన్న సోమాల్ ఒకనాడు ముసలవ్వను కలిసారు. ఆ తల్లి వీళ్ళను చూసి కన్నీరు మున్నీరుగా విలపిస్తూ గుమ్సాయి రక్తంతో తడిసి ఎరుపెక్కిన తన చీరను తెచ్చి వాళ్ళకిచ్చింది. దాన్ని కోసాల్ వెదురుబొంగుకు కట్టి ఎర్రజండాగా ఎగురవేశాడు. అక్కడ చేరిన వారంతా 'గుమ్సాయి అమర్ హై!' 'గుమ్సాయి ఆశయాలను కొనసాగిస్తాం!' 'అమర వీరుల ఆశయాలను కొనసాగిస్తాం!' 'బస్తర్ వేగుచుక్క గుమ్సాయి అమర్ హై!' అంటూ దిక్కులు పిక్కటిల్లేలా నినాదాలు చేశారు.

(బస్తర్ జిల్లాలో పెత్తందార్ల చేతుల్లో అమరుడైన 'గుమ్సదాదా' అమర స్మృతిలో.)

---

# సార్థకత

అతని మొఖం కష్టజీవి కండరాల మీద మెరిసే చమట చుక్క
అతని చూపులు నిండు వర్గప్రేమతో ప్రజా హృదయాల్లోకి ప్రవహించే నదులు
అతని మాటలు వర్గ చైతన్యంతో తొణికిసలాడే స్వాతిముత్యాలు
అతని గుండె ప్రపంచంలోని కన్నీళ్ళన్నీ ఘనీభవించిన ప్రదేశం
అతని మెదడు వర్గపోరాటానికి లాబొరేటరీ
అతని ఆచరణ ప్రజాయుద్ధంలో గురి తప్పని ఆయుధం
అతని త్యాగంలో విప్లవం వర్ధిల్లుతోంది—

(ఏప్రిల్ నాలుగవ తేది పటాన్‌చెరు బూటకపు ఎన్‌కౌంటర్‌లో అమరుడయిన కామ్రేడ్ ఐలయ్య (కార్తీక్) గురించి....)

—యం. కరుణాకర్

సమీక్షా వ్యాసం :

# కనిపించని కథలు

— ఎన్. వేణుగోపాల్

"ఇతిహాసపు చీకటికోణం
అట్టడుగున పడి కాన్పించని
కథలన్నీ కావాలిప్పుడు
ధాచేస్తే దాగని సత్యం".

దోపిడీ పీడనల మీద ఆధారపడిన సమాజాలలో శ్రమ దోపిడీ ఎంతో కొంత కనబడే రూపాలలో ఉంటుంది. కాని జాగ్రత్తగా పరిశీలిస్తే తప్ప అర్థం కానిది సృజనాత్మకతను అణచివేయడం. మానవ మేధ సహజంగా సృజనాత్మకమైనది గనుక, సాంఘిక సంబంధాల వల్ల అది మరిన్ని అద్భుత విజయాలు సాధిస్తుంది గనుక మనిషి సృజనాత్మకతను అణచి వేయడానికి, సామాజిక సంబంధాలలో అంతరాల, వ్యత్యాసాల వ్యవస్థను కాపాడడానికి పాలక వర్గాలు ప్రయత్నిస్తాయి. బహుశా, అంతరాల వ్యవస్థలో పై మెట్టు మీద ఉన్న ప్రతి బృందమూ, కింది మెట్టుమీద ఉన్న బృందం పైన ఈ విధి నిషేధాలను విధిస్తుంది.

ఈ పని ఒక్క రోజులోనో, ఒక్క పద్ధతిలోనో జరిగినది కాదు. అలా జరగడం సాధ్యమూ కాదు. కొన్ని వందల ఏళ్ళుగా, వేల ఏళ్ళుగా మానవ సమాజంలోని కొన్ని వర్గాల మీద, బృందాల మీద ఇటువంటి అణచివేత అమలవుతోంది. అది కూడ అనేక పద్ధతులలో అమలవుతోంది.

మొట్టమొదట, సృజనాత్మకతకు నిర్వచనం మారిపోతుంది. శ్రమ అంటే సృజనాత్మకత లేని బండ చాకిరీ అని నిర్వచించి మొత్తం శ్రమ క్రమాన్ని, శ్రామిక జనాభా సమస్తాన్ని సృజనాత్మకత లేని, యాంత్రిక క్రమాలలో మాత్రమే పాల్గొనే వాళ్ళుగా మారుస్తారు. నిజానికి శ్రమ దానికదిగా గొప్ప సృజనాత్మక ప్రక్రియ. అతి మామూలు శ్రమక్రమం నుంచి, సంక్లిష్ట శ్రమక్రమం దాకా ప్రతి శ్రమక్రమంలోనూ సృజనాత్మకత ఇమిడి ఉంది. గింజను పంటగా మార్చడంగాని, ముడి ఖనిజాన్ని యంత్ర భాగంగా మార్చడంగాని, ప్రకృతిని భౌతిక అవసరాలు తీర్చే వస్తు సంపదగా మార్చడంగాని సృజన శక్తికి వ్యక్తీకరణలే. మరి ఈ భౌతిక వస్తూత్పత్తినంతా మనం ఇవాళ ఎక్కువలో ఎక్కువ యాంత్రికక్రమంగానే గుర్తిస్తున్నాం. యాంత్రికతకూ, సృజనాత్మకతకూ మధ్య ఇటువంటి విభజన రేఖను గీసి,

సృజనాత్మకతకు తప్పుడు నిర్వచనం ఇవ్వడంలో శ్రమను చిన్నచూపు చూసే పాలక వర్గాల కుట్ర ఉంది.

ఇంకా కొంచెం ముందుకు వెళితే, సృజనాత్మకత అంటే వ్యక్తీకరణ శక్తి మాత్రమే అనే మరొక నిర్వచనం వస్తుంది. రచన, చిత్రలేఖనం, సంగీతం, శిల్పం మొదలైన కళలు మాత్రమే సృజనాత్మక మేధో వ్యాపారాలనే నిర్వచనం వస్తుంది. నిజానికి మేధోవ్యాపారమంతా సృజనాత్మకమే. కాని, సమాజంలో మిగిలిన వాళ్ళందరికీ లేని శక్తులేవో కొందరికే ఉన్నాయనీ, కొందరు కొన్ని పనులు చేయడానికే పుట్టారనీ, అసమానత, అంతరాలు సహజమైనవనీ వాదించే చోట, సృజనాత్మకతకు ఇటువంటి సంకుచిత నిర్వచనం ఇవ్వక తప్పదు. అందువల్లనే ఇప్పటికీ సమాజంలో కొందరే సృజనాత్మక వ్యక్తులుంటారనీ, మిగతా వారంతా వారిని అనుసరించవలసిన, లేదా యాంత్రికమైన పనులు చేయవలసిన వారని ఒక తప్పుడు అభిప్రాయం వ్యాప్తిలో ఉంది. (నిజానికి కంప్యూటర్‌ను కనిపెట్టిన తర్వాత, అది కూడ యాంత్రికమైన పనులు మాత్రమే చేస్తుంది గనుక ఈ "యాంత్రికమైన పనులు మాత్రమే చేయగలిగిన" అత్యధిక ప్రజానీకం ఉపాధిని పోగొట్టుకుంటున్నారు. మరో అర్థంలో వాళ్ళు సృజనాత్మక రంగంలోకి, నిజమైన మానవ శక్తులు ఆచరణలోకి వచ్చే రంగంలోకి బదిలీ కావలసిన స్థితి ఏర్పడుతున్నదన్న మాట. కాని వాళ్ళను అక్కడ స్వీకరించకుండా ఉండడానికి పైన చెప్పిన తరతరాల దురభిప్రాయపు అడ్డుగోడ ఉండనే ఉంది).

సృజన శక్తిని ఇంత సంకుచితంగా నిర్వచించిన తర్వాత, ఆ సృజన శక్తి కూడ పాలక వర్గాలకు, ఆధిపత్య వర్గాలకు మాత్రమే ఉంటుందని, ఉండాలని అనడానికి ఎన్నో ప్రయత్నాలు జరిగాయి. జరుగుతున్నాయి. సృజనాత్మకత అంటే ఈ అర్థంలో అక్షరాల గురించి, రంగుల గురించి, ధ్వనుల గురించి, దృశ్యాల గురించి జ్ఞానం ఉండడం మాత్రమే. ఆ జ్ఞానాన్ని ఆలోచనా ప్రేరకంగానో, ఉద్వేగభరితంగానో కూర్చడం మాత్రమే. ఈ పనులు సహజాతాలు గదా. అందరూ చేయగలుగుతారు గదా. మరి ఆ "అందరి" పనుల్లోంచి కొందరి పనులకు మాత్రమే సృజనాత్మకతను ఆపాదించడం ఎట్లా వీలవుతుంది?

ఇక్కడ పాలక వర్గాల కుట్ర మరింత దుర్మార్గంగా సాగింది. సృజనాత్మకత ఆ స్థానానికి ఉంటుంది. ప్రజలకు ఉండదు. లిఖిత సాంప్రదాయానికి ఉంటుంది,

మౌఖిక సాంప్రదాయానికి ఉండదు. సంస్కృతానికి ఉంటుంది, ప్రాకృతానికి, తదితర అనేక ప్రజల భాషలకు ఉండదు (ఇవాల్టికీ దేశంలోని 845 భాషల్లో ఏ కొన్ని భాషల్లోనో ఉన్న సృజనాత్మకతకే గుర్తింపు ఉంటున్నది). బ్రాహ్మణులకు మాత్రమే ఉంటుంది, దళితులకు, అణగారిన కులాలకు ఉండదు. వలస పాలకులకు మాత్రమే ఉంటుంది, వలస ప్రజలకు ఉండదు. పురుషులకు మాత్రమే ఉంటుంది, స్త్రీలకు ఉండదు. ఇట్లా మొత్తం సమాజంలో సృజనాత్మకత ఉండే, సృజనాత్మకత ఉండని రెండు బృందాలు తయారయ్యాయి. ఈ స్థితిని సమర్థించే స్మృతులు, శాసనాలు తయారయ్యాయి. ఈ విభజనను అన్ని సమయాల్లోనూ వర్గ విభజనతో సమానం చేయడానికి సాధ్యం కాకపోవచ్చు గాని, ఈ విభజనల్లో శ్రమదోపిడీ, సృజనాత్మకతను అణచివేయడం మాత్రం సాధారణ అంశాలు.

ఈ ప్రమాణాల లోపలి నుంచే చూసినప్పటికీ, అంటే సృజనాత్మకతకు ఈ సంకుచిత నిర్వచనాన్నే కాసేపటి కోసం అంగీకరించినప్పటికీ, స్త్రీలకు సృజనాత్మకత ఉంటుందా ? లేదా ? స్త్రీ మేధకు ఏమైనా ప్రత్యేక ఆటంకాలున్నాయా ? "ముదితల్ నేర్వగరాని విద్య గలదె ముద్దార నేర్పించినన్" అని పురుషులు తమకు తాము ఆపాదించుకునే దాతృత్వం కూడ వద్దు. ముద్దార నేర్పించక పోయినా, స్త్రీ మాటలు నేర్చుకోగలదా లేదా ? ఆ మాటలను ఉద్వేగప్రేరకమైన వాక్యాలుగా అల్లగలదా లేదా ? ఇవేవీ అసాధ్యమైన విద్యలు కావు. మానవ సహజ మేధో వ్యాపారాలు.

ఇటువంటి సహజ మేధో వ్యాపారాలన్నీ అణచి వేయబడ్డాయి. స్త్రీలు తపకంటె తక్కువ శక్తివంతులని చెప్పడానికి, 'అబల' అన్నట్టుగానే, భౌతిక వస్తూత్పత్తి క్రమం నుంచి విడదీసి ఇంటి చాకిరీకి పరిమితం చేసినట్టుగానే, వాళ్ళ సృజన శక్తిని గుర్తించక పోవడం, చిన్న చూపు చూడడం, అణచివేయడం జరిగాయి. ఈ క్రమం వల్ల సగం జనాభా సృష్టించిన బౌద్ధిక ఉత్పత్తులు సమాజానికి వినియోగంలోకి రాకుండా పోయాయి. ఆ బౌద్ధిక ఉత్పత్తుల సృష్టికర్తలు నిరాదరణకు గురయ్యారు, అవమానించబడ్డారు, విస్మరించబడ్డారు. ఒక సమాజపు బౌద్ధిక సాంప్రదాయం నిజానికి వైవిధ్యం వల్ల, సంఘర్షణ వల్ల అభివృద్ధి చెందుతుంది. కాని సగం జనాభా సృష్టించిన బౌద్ధిక ఉత్పత్తులు జాతీయ బౌద్ధిక సంపదలో భాగం కాకపోవడం వల్ల ఆ మేరకు మొత్తం బౌద్ధిక సాంప్రదాయమే నష్టపోయింది.

ఈ సామాజిక, సాహిత్య నష్టాన్ని పూరించడానికి విశేషకృషి చేసినందుకు సుజీథారు, కె. లలితలను అభినందించాలి (Women writing in India, 600 B. C. To the Present, Volume 1 600 B. C. to the Early Twentieth Century, Edited by Susie Tharu and K. Lalitha). రెండున్నర వేల సంవత్సరాల భారత సాహిత్య చరిత్రలో స్త్రీలకు జరిగిన, జరుగుతూ వచ్చిన అన్యాయానికి పరిహారం చెల్లించే కృషిని ఈ పుస్తకం సమర్థంగా నిర్వహించింది. ఈ పుస్తకం చదువుతుంటే ఎంత సంపన్నమైన, ఎంత ఉద్వేగభరితమైన, ఎంత ఆలోచనా స్ఫోరకమైన సాహిత్య సాంప్రదాయాలకు, అనుభవాల వ్యక్తీకరణలకు భారతీయ మహిళా రచయితలు దారులు వేశారో చూసి ఆశ్చర్యం కలుగుతుంది. ఈ రచనలలో కొన్ని విడివిడిగా అనువాదాలలో దొరుకుతున్నప్పటికీ, ఆ రచనలన్నిటినీ కూడ ఒక నేపథ్యంలో పెట్టి, ఒక సమాహారంగా అందించడం సంపాదకులు చేసిన అపూర్వమైన, మంచి ప్రయత్నం. గతంలో కూడ మహిళల రచనల, మహిళావాద రచనల సంకలనాలు కొన్ని వచ్చి ఉన్నప్పటికీ ఈ పుస్తకం వాటన్నిటికన్న మేలైన ప్రయత్నమని నిస్సందేహంగా చెప్పవచ్చు. ఒక కారణం, ఈ పుస్తకం విస్తృతమైనది (ప్రాచీన, మధ్యయుగాల, జాతీయ, సంస్కరణ ఉద్యమాల కాలపు రచనలను సంకలనం చేసిన మొదటి సంపుటమే 568 పేజీలు, రెండో సంపుటం ఇంకా వెలువడలేదు). కాగా అంతకన్న ముఖ్యమైన కారణం, సంపాదకులు ఒక్కొక్క రచనకూ, మొత్తం కాలానికీ, మొత్తం సంకలనానికీ సాంఘిక నేపథ్యాలు ఇవ్వడానికి రాసిన ఉపోద్ఘాతాలలో చూపిన శ్రద్ధ. ఈ ఉపోద్ఘాతాలలో చారిత్రక, సామాజిక, ఆర్థిక, రాజకీయ, సాంస్కృతిక పూర్వరంగం ఉంది. సాహిత్య విమర్శ చర్చ ఉంది. రచనల పట్ల, రచయితల పట్ల గౌరవం ఉంది ఈ సంకలనాన్ని ఎంత జాగ్రత్తగా తయారు చేశారంటే, భారతీయ నామవాచకాలను పలకడంలో (రాయడంలో) పాశ్చాత్య, ఇంగ్లిషు రచయితలు సాధారణంగా చేసే తప్పులను పరిహరించడం మాత్రమేకాక, పాఠకులకు ఉపయోగపడే ఉచ్చారణ సూచిక కూడ ఇచ్చారు. ఒక్క ధర విషయంలో మినహాయిస్తే మిగిలిన అన్ని విషయాలలోనూ (అక్కడక్కడ అభిప్రాయ భేదాలున్నప్పటికీ) సగౌరవంగా, సవినయంగా ఆహ్వానించవలసిన కృషి ఇది.

"విమర్శనాత్మక ప్రాతిపదికలు, చారిత్రక సందర్భం, భావజాలాలు సాధారణంగా స్త్రీల సాహిత్యకృషి పట్ల వ్యతిరేక వైఖరి తీసుకున్నాయనే, ఆ కృషిని మనం

చదివి, అభినందించే శక్తిని దెబ్బతీశాయనే అవగాహనతో మేం ఈ సంకలనాల పని చేపట్టాం. రెండు సంపుటాల విమెన్ రైటింగ్ ఇన్ ఇండియా అనే ఈ పుస్తకంలో మేం సేకరించిన రచనలు స్త్రీలు ఏ పరిస్థితుల్లో రచించారో తెలియజేస్తాయి. ప్రధానమైన మహిళా రచనలను వెలుగులోకి తెస్తాయి. తగినంతగా ప్రచారంలోకి వచ్చినప్పటికీ అపార్థం పాలయిన, కొట్టివేయబడిన రచయితలను మళ్ళీ అంచనా వేయడంలో సహకరిస్తాయి. మహిళలు స్వీకరించిన, వినియోగించుకున్న ఇతివృత్తాల గురించీ, సాహిత్య పద్ధతుల గురించీ మనకు అవగాహన కల్పిస్తాయి. స్వీయ కార్యాచరణలోనైనా, సంస్థాగతమైన ఆచరణలోనైనా ఎదురయ్యే సవాళ్ళేమిటో తెలియజేస్తాయి, పితృస్వామ్యాన్ని, సామ్రాజ్యాన్ని, జాతిని ప్రశ్నించే అంచులలో ఏ కథనాలు ఆవిర్భవిస్తాయో చూపుతాయి'' అని సంపాదకులు ఈ పుస్తకం గురించి తెలిపారు.

ఇందుకోసం ఈ రెండు సంపుటాలలోను కలిపి 600 కు పైగా రచయితల జాబితాలోంచి 140 మంది రచయితలను ఎంచుకున్నారు. బెంగాలీ,గుజరాతీ, ఇంగ్లీషు, హిందీ, కన్నడం, మలయాళం, మరాఠీ, ఒరియా, తమిళం, తెలుగు, ఉర్దూ - ఈ పదకొండు భాషల్లో విడివిడిగా పరిశోధకులు రచనలను, రచయితల జీవిత వివరాలను సేకరించారు. ఈ సేకరణ క్రమంలో ఆ యా భాషా సంపాదకులు పొందిన అనుభవాలు ఆసక్తికరమైనవి. అభినివేశం ఉన్న పురాతత్వశాస్త్రజ్ఞులు గతకాలపు అస్పష్ట చిహ్నాలనుంచి సమగ్ర చరిత్ర కథనాన్ని రూపొందించినట్టుగా ఈ పని సాగింది.

రచనల అనువాదం గురించి కూడ సంపాదకులకు స్పష్టమైన అవగాహన ఉంది. తమిళ, ఒరియా వంటి మూలభాషలకూ, ఇంగ్లీషువంటి లక్ష్యభాషకూ మధ్య ఉండే అధికార సంబంధం అనువాదంలోకి కూడ రాక తప్పదనీ, దాన్ని గుర్తించాలనీ సంపాదకులు ముందుమాటలో హెచ్చరించారు. అంతకన్న ముఖ్యంగా ఈ పుస్తక పాఠకులు కేవలం వీటిని చదివితే సరిపోదనీ, ''ఒక జీవన విధానాన్ని జీవించాలని'', అంటే, కాలక్రమంలో స్త్రీలు జీవించిన లోకాల లక్ష్యాలను, ఆలోచనలను, తర్కాన్ని అర్థం చేసుకోవాలని సంపాదకులు కోరారు. అందుకు సహకరించడానికే నేపథ్యాలు సమకూర్చారు.

## 2

ఈ పుస్తకం మొత్తానికి కలిపి ఒక ముందుమాట ఉంది. నాలుగు భాగాలుగా ఉన్న ఈ ముందుమాట మహిళల సాహిత్య కృషికీ, మహిళావాద సాహిత్య విమర్శకూ

సంబంధించిన ఆలోచనలనెన్నిటినో రేకెత్తిస్తుంది. మొదటిభాగం భారతీయమహిళా వాద సాహిత్య విమర్శ ఏ ప్రశ్నలను ఎదుర్కోవలసి ఉన్నదో ముద్దుపళని 'రాధికా సాంత్వనం' ప్రచురణ ఆధారంగా వివరిస్తుంది. రెండో భాగం బ్రిటిష్ మహిళావాద సాహిత్య విమర్శ గురించి, మూడోభాగం అమెరికన్ మహిళావాద సాహిత్య విమర్శ గురించి చర్చిస్తాయి నాలుగోభాగం రెండు సంపుటాల మీద సంపాదకుల స్థూల అవగాహనను ప్రకటిస్తుంది.

సర్వసాధారణంగా ఒక సైద్ధాంతిక ప్రతిపాదనకు పూనుకునేటప్పుడు, ఆ ప్రతిపాదనను రూపొందించే కృషిలో మనకన్న ముందు ప్రయత్నాలు చేసినవాళ్ళను సంస్మరించుకుంటాం. సంపాదకులు అట్లా బెంగుళూరు నాగరత్నమ్మను తలచు కుంటారు. బెంగుళూరు నాగరత్నమ్మ 1910 లో 'రాధికా సాంత్వనము' ను ప్రచురించింది. ముద్దుపళని రాసిన ఈ కావ్యాన్ని సాధారణంగా క్షీణ సాహిత్యంగా కొట్టి వేయడం జరుగుతూ వచ్చింది. ఈ కావ్యం గురించి కందుకూరి వీరేశలింగం "ఇది జారత్వమే కులవృత్తిగా గల వేశ్య యగుటచే స్త్రీజన స్వాభావికమైన సిగ్గును విడచి శృంగార రసమను పేర సంభోగ వర్ణనలను పుస్తకమునిండా మిక్కిలి పచ్చిగా చేసినది" అనీ, "ఈ గ్రంథములోని భాగములనేకములు స్త్రీలు వినదగినవియు, స్త్రీ నోటి నుండి రాదగినవియు గాక దూష్యములైయున్నవి" అనీ రాశారు.

నాగరత్నమ్మ ఈ పుస్తకం సంపాదించి, చదివి, పుస్తకాన్ని విపరీతంగా అభిమానించి, తన వ్యాఖ్యానంతో అచ్చు వేయించింది. "సిగ్గనునది స్త్రీ జనమునకే గాని, పురుషులకు మాత్రము స్వాభావికము కాదు కాబోలును. ఇక్కవయిత్రి వేశ్య గనుక సిగ్గులేని, సంభోగాది వర్ణనములు పచ్చిగా వ్రాసిన వ్రాయవచ్చును, కాని శిష్టులనిపించుకొన్న పురుషులట్లు వ్రాయగూడదు గదా! శ్రీ పంతులువారే .... తమ స్వహస్తముతో సరిచూచి యచ్చొత్తింపనిచ్చిన 'వైజయంతీ విలాసము'లోని పచ్చవిల్తుని పచ్చిక పట్టు కన్నను, వీరే స్వయముగా రచించిన 'రసికజన మనోరంజనము'లోని బూతులకన్నను నిందు పచ్చిబూతులు కన్పట్టుచున్నవా?" అని నాగరత్నమ్మ వీరేశలింగానికి జవాబు చెప్పింది.

ఈ రెండు సంపుటాల సంపాదకత్వంలో తాము చూపిన విమర్శనాత్మక కృషికి నాగరత్నమ్మే ఆద్యురాలని, మార్గదర్శకురాలని సంపాదకులు అంటారు.

ముద్దుపళని మీద ఎన్ని విమర్శలున్నప్పటికీ, ఆమె ప్రధానంగా ఒక మహి

శగా 'రాధికా సాంత్వనం' రచన చేసిందనేది ముఖ్యమైన విషయం. ఆమె అవతారికలో తనకు సాహిత్య వారసత్వం తన నాయనమ్మ నుంచి, తల్లి నుంచి, అత్త నుంచి వచ్చిందని ప్రకటించింది. ముద్దుపళని అప్పటికి ఉన్న సాహిత్య రూపాన్ని కూడ గణనీయంగా మార్చింది. తలకిందులు చేసింది. మామూలుగా అప్పటికి ప్రబంధాలలో పురుషుడు ప్రియుడుగా, స్త్రీ ప్రేమించబడేదిగా ఉండేది. పురుషుడి ఆనందమే, సంతృప్తే ముఖ్యమైనదై, స్త్రీ వాటిని తీర్చవలసిన వస్తువుగా ఉండేది. కృష్ణుడు రాధను ఆకర్షిస్తాడు. ప్రేమిస్తాడు. రాధ కృష్ణుడికోసం నిరీక్షిస్తున్నట్టుగా చూపినప్పటికీ, కథనానికి కేంద్ర బిందువుగా ఉండేది కృష్ణుడి ఆనందమే. కాని రాధికా సాంత్వనం ఈ నలిగిన దారిని తిరస్కరించింది. ఇక్కడ స్త్రీ ఆకాంక్ష, స్త్రీ అనుభవం, స్త్రీ ఆనందం కేంద్రస్థానంలో ఉంటుంది. ఆమె చొరవ తీసుకుంటుంది. ఆమె సంతృప్తితో, ఆనందంతో కావ్యం అంతమవుతుంది.

పద్దెనిమిదో శతాబ్దపు ద్వితీయార్థంలో ముద్దుపళని రాసిన ఈ పుస్తకాన్ని సి.పి. బ్రౌన్ ప్రోత్సాహంతో వెంకట నరసు 1887లో చాల కత్తిరింపులతో ప్రచురించాడు. దాన్ని ఇరవయో శతాబ్దపు ప్రథమార్థంలో, సంపూర్ణంగా ప్రచురించడంలో నాగరత్నమ్మ ఎన్నో ఇబ్బందులను ఎదుర్కొంది. ఈ మధ్యలో పంతొమ్మిదో శతాబ్దపు దేశ సామాజిక, సాంస్కృతిక చరిత్రలో సాంఘిక సంస్కర్తలకూ, సాంప్రదాయిక వాదులకూ మధ్య భీషణ సమరాలు జరిగాయి. సంస్కర్తలు సమాజాన్ని ఆధునికీకరించదలిచారని, మహిళల ప్రయోజనాల పరిరక్షకులని పేరు పొందారు. సాంప్రదాయికవాదులు సంస్కరణ ఉద్యమాలను వ్యతిరేకిస్తారని, పాత విలువలను సమర్థిస్తారనీ పేరు పొందారు. కాని నాగరత్నమ్మ వంటి వ్యక్తులు గాని, ఆమె ప్రాతినిధ్యం వహించిన సాంస్కృతిక శక్తులుగాని ఈ విభజనలో అటో ఇటో చేరే అవకాశం లేకపోయింది. మొత్తంగా నాగరత్నమ్మ చేసిన ప్రయత్నంలో ఇమిడి ఉన్న సంక్లిష్ట, విభిన్న అంశాలను అట్లా ఏదో ఒక వర్గీకరణలోకి కుదించడం సాధ్యం కాదు.

రాధికా సాంత్వనం ద్వారా ముద్దుపళని ప్రకటించదలచిన అంశాలు ఎటువంటివైనా, వాటి సామాజిక, రాజకీయ నేపథ్యాలేవైనా, ఆ తరువాతి కాలంలో ఆ పుస్తకం పొందిన ఆదరణ, నిరాదరణలు తీవ్రంగా ఆలోచించవలసినవి. తంజావూరు నాయకరాజుల పాలనాకాలంలో భోగలాలసతే ప్రధానమైపోయి, ఆస్థాన సాహిత్య

మంతా ఆ విలువలనే ప్రతిబింబించిన కాలంలో ముద్దుపళని తన రచన సాగించి ఉండవచ్చు. కాని ఇంతకు ముందే చెప్పినట్టు ఆమె వస్తువులో ముఖ్యమైన మార్పులు చేసింది. రూపంలో తనవైన కొత్త అంశాలను ప్రవేశపెట్టింది. (చూ. పరిష్కరణము - పాఠనిర్ణయము - రాధికా సాంత్వనము ఎమెస్కో సాంప్రదాయ సాహితి, 1972, 1990). అవతారికలో సాంప్రదాయానికి భిన్నంగా ప్రవర్తించింది. ఒక్క మాటలో చెప్పాలంటే, పద్దెనిమిదో శతాబ్దంలో ఉండడానికి వీలైన మహిళా వాద దృక్పథాన్ని ఆమె ఎంతోకొంత అనుసరించింది.

రాధికా సాంత్వనం గురించి ఆలోచించేటప్పుడు, ముద్దుపళని కన్న ముఖ్యంగా నాగరత్నమ్మ ప్రయత్నం గురించి చెప్పుకోవాలి. ఆమె పుస్తకం ప్రచురించేనాటికి బ్రౌన్ ప్రోత్సాహం ద్వారా వెంకట నరసు అచ్చు వేసిన ప్రతి మాత్రమే అందుబాటులో ఉంది. ఆ పుస్తకానికి ఇంకా మేలైన పరిష్కరణ అవసరమని ఆమె భావించింది. తానే పరిష్కరించి, వ్యాఖ్య రాసి అచ్చు వేయించింది. వెంటనే బ్రిటిష్ ప్రభుత్వం ఈ పుస్తకంలోని 24 పద్యాలను నిషేధించింది. పండితులు, సాహితీ పరులు ఈ పుస్తక నిషేధాన్ని ఎత్తివేయాలని ప్రభుత్వాన్ని కోరారు. సాంప్రదాయిక ప్రచురణకర్త అయిన వావిళ్ళ రామస్వామి శాస్త్రులు నిషేధాన్ని ఎత్తివేయించేందుకు కోర్టులో పోరాడారు. చిట్టచివరికి 1947లో టంగుటూరి ప్రకాశం ప్రభుత్వకాలంలో ఈ నిషేధం రద్దయింది. సంపూర్ణ ప్రతి 1952లో అచ్చయింది. 1972లో వచ్చిన ఎమెస్కో ఎడిషన్ మినహాయిస్తే, ఎన్నిచోట్ల వెతికినా, ఈ ప్రతి తమకు దొరకలేదని, ఈ పుస్తకం ఇట్లా ఎందుకు విస్మరణకు గురయిందో ఆలోచించవలసి ఉందని సంపాదకులు అంటారు.

ఈ చరిత్రంతా చూసినప్పుడు కొన్ని విచిత్రమైన విషయాలు కనబడతాయి. ఆధునిక దృక్పథానికి ప్రాతినిధ్యం వహిస్తున్నదని చెప్పుకునే బ్రిటిష ప్రభుత్వం ఈ పుస్తకాన్ని నిషేధించింది. సంఘసంస్కర్త వీరేశలింగం ఈ పుస్తకాన్ని అనవసరమైన కోపంతో విమర్శించారు. స్త్రీ పురుష సమానత్వాన్ని వాంఛించే వాళ్ళనుంచి కూడ ఈ పుస్తకం సానుభూతి పొందలేదు. మరోవైపు వేశ్యగా బతికిన నాగరత్నమ్మ, సాంప్రదాయిక కవి పండితులు, సాంప్రదాయిక ప్రచురణకర్తలు పుస్తకాన్ని సమర్థించారు. స్త్రీలపట్ల దృక్పథం విషయంలో మాత్రమే కాదు, మొత్తంగా జాతీయోద్యమ రాజకీయాలలోనే, అంతగా ప్రగతిశీల భావాలు లేనివాడిగా పేరుబడ్డ

టంగుటూరి ప్రకాశం నిషేధాన్ని ఎత్తివేశాడు. ఆ తర్వాతి కాలంలో ఈ పుస్తకంపట్ల ఆదరణో నిరాదరణో తెలియని మౌనం అమలయింది. సంపాదకుల మాటల్లో చెప్పాలంటే "సాహిత్య నిర్మాణాల గురించి, స్త్రీ పురుష సంబంధాల గురించి, వర్గం గురించి ఈ పుస్తకం, దీని చరిత్ర లేవనెత్తిన సమస్యలు ఇప్పటికీ అక్రమమైనవి (ఇల్లెజిటిమేట్) గానే ఉండిపోయాయి". భారతదేశంలో మహిళావాద సాహిత్య విమర్శకు సంబంధించిన రాయబడని చరిత్రలో ఒక ముఖ్య ఘట్టాన్ని నాగరత్నమ్మ ప్రయత్నంలో చూస్తామని, ఇప్పటివరకూ కనబడకుండా ఉండిపోయిన మహిళా పాఠకురాలి ప్రశ్నలనూ అవసరాలనూ ఈ ప్రయత్నం వెలుగులోకి తెచ్చిందని సంపాదకులు అన్నారు.

ముందు మాటలో రెండోభాగం, మూడోభాగం మహిళావాద సాహిత్య విమర్శకు సంబంధించి సైద్ధాంతిక స్థాయిలో చాల విలువైనవి. (చాల ఆలోచనా స్ఫోరకమైన ఈ భాగాల గురించి వివరంగా చర్చించవలసి ఉందిగాని ఇక్కడ స్థలాభావం దృష్ట్యా ఆ పనికి పూనుకోవడం లేదు.)

నాలుగో భాగంలో మొత్తం పుస్తకం మీద సంపాదకులు విహంగ వీక్షణం లాంటిది చేశారు. తమ పరిధులు, పరిమితులు చెప్పుకున్నారు. "ఈ రచనలు కేవలం స్త్రీల రచనలయినందువల్ల స్త్రీల నిజమైన అనుభవాలను చిత్రిస్తాయని గాని, నిజమైన స్త్రీలను వ్యక్తీకరిస్తాయనిగాని మేం చెప్పడంలేదు. పితృస్వామ్య పీడనకు విశ్వవ్యాప్త స్వభావం ఉన్నదనీ, స్త్రీలకు ఉమ్మడి అనుభవం ఉన్నదనీ ఇతర కాలాలలో, ఇతర స్థలాలలో, ఇతర సాంఘిక స్థితుల్లో ఉన్న స్త్రీలు ఈ రచనల ద్వారా గుర్తించగలరని గాని మేం అనుకోవడం లేదు. తమ కాలపు భావజాలాలలో పురుషులెంతగా మునిగి ఉంటారో, స్త్రీ రచయితలు కూడ - విమర్శకులు, సంకలనాల సంపాదకులతో సహా - అంతగా మునిగి ఉంటారు. పితృస్వామ్యాలు నిర్దిష్ట చారిత్రక పరిస్థితుల్లో రూపొందుతాయి, మారుతాయి. మహిళలు రాసిన సాహిత్యమంతా మహిళావాద సాహిత్యం కాదు. మహిళల గురించీ కానక్కరలేదు." అని సంపాదకులు ప్రధానమైన పరిమితిని గుర్తించారు. కనుక ఈ సంకలనాల్లోని మహిళల రచనల్లో అన్ని రకాల దోపిడీ పీడనలు, కుల, వర్గ, జాతి, మత వైరుధ్యాలు వ్యక్తం అవుతాయని కూడ సంపాదకులు అన్నారు. మనం ఇవాళ నివసిస్తూ ఉన్న ఈ ప్రపంచాలను ఈ రకంగా రూపొందించడంలో ఆ పాతతరాల కృషి ఎటువంటిది? అంటే,

ఆధిపత్యపు చరిత్ర కాకుండా, సంఘర్షణల చరిత్ర, భాగస్వామ్యాల చరిత్ర, మన దని చెప్పుకునే చరిత్ర ఏమిటి ? ఈ చరిత్రను నిర్మించడంలో వాళ్ళు చెల్లించిన మూల్యం ఏమిటి ? వాళ్ళు పొందిన అవకాశాలు ఏమిటి ? ఆ మూల్యాలు, ఆ రాయి తీలు మన వారసత్వంమీద ఎటువంటి ప్రభావాన్ని వేశాయి ? ఈ ప్రశ్నలకు జవా బులు వెతుక్కునేందుకు, చాల శక్తివంతమైన, సంక్లిష్టమైన మహిళావాద వార సత్వాన్ని అవగాహన చేసుకునేందుకు సంపాదకులు మనను ఈ పుస్తకంలోకి ఆహ్వా నిస్తారు.

## 3

ఈ పుస్తకంలో మొదటి భాగం ప్రాచీన, మధ్యయుగాల సాహిత్యానికి సంబం ధించినది. ఈ భాగానికి ముందుమాట శీర్షికలోనే చెప్పినట్టు ఈ కాలపు సాహిత్యాన్ని ఓరియంటలిస్టుల దృక్పథానికి భిన్నంగా చదవడానికి సంపాదకులు ప్రయత్నించారు.

యూరపియన్-అమెరికన్ మహిళా వాద సిద్ధాంతం మహిళల వ్యక్తీకరణ లను ఆక్రమించే పితృస్వామిక భావజాలాన్ని వివరించడంపైనే కేంద్రీకరించిందని సంపాదకులు అంటారు. జాతిని, వర్గాన్ని, అప్పుడప్పుడు సామ్రాజ్యవాదాన్ని కూడ పరిగణనలోకి తీసుకోవాలని ఈ సిద్ధాంతాలు అన్నప్పటికీ, పితృస్వామ్యాన్ని వేరు చేసి చూడడం జరుగుతుంది. స్త్రీల అణచివేతకు బాధ్యత వహించే వ్యవస్థగా దాన్ని వేరు చేయొచ్చునని ఈ మహిళావాద సిద్ధాంతకర్తలు అనుకుంటారు. ఒక ప్రత్యేక సమాజంలో ఆధిపత్యం ఎట్లా పనిచేస్తుందో ఇంకా వివరంగా విశ్లేషించడానికి జాతి, వర్గ అణచివేతలను కూడ "కలపవచ్చునని" వాళ్ళు అనుకుంటారు. కాని ఇందుకు భిన్నంగా సంపాదకుల అభిప్రాయంలో "పితృస్వామ్యాలు స్పష్టంగా చారిత్రక క్రమాల ద్వారా రూపొందాయి. వలసవాదం, వర్గం, కులం వంటి ఇతర ఆధిపత్య భావజాలాలు పితృస్వామ్యాన్ని బలపరిచాయి. పితృస్వామ్యం వాటిని బలపరిచింది".

ఈ అవగాహనతో రచనలను సంకలనం చేయదలచుకున్నందువల్ల సంపాద కులు రెండు పనులు చేయవలసి వచ్చింది. ఒకటి- ఇంతవరకూ మహిళావాద పరి శోధన అంటూ ఏమీ జరగని వలస పూర్వకాలపు సాహిత్యాన్ని పరిచయం చేయడం. రెండు, వలస పూర్వకాలపు సాహిత్యాన్ని మహిళావాద దృక్పథం నుంచి పరిశీలించి నందువల్ల, గతం గురించిన బలమైన అంచనాలన్నిటినీ, నిర్ధారణలన్నిటినీ ఎదుర్కో-

వలసి వచ్చింది. అందుకే ఈ అవగాహన ప్రాచీన భారతదేశం గురించి, ప్రాచీన భారతంలో మహిళ గురించి ఉండిన ఓరియంటలిస్టు అవగాహనను తీవ్రంగా విమర్శి స్తుంది.

ప్రాచీన కాలపు మహిళా రచనలను చూసినప్పుడు కొట్టవచ్చినట్టు కనిపించే విషయం అవి ఆర్యుల ప్రవేశానికి ముందువో, ఆర్యేతరులవో కావడం. ఆర్యుల, లేదా బ్రాహ్మణుల ఆధిపత్యాన్ని ప్రశ్నించిన బలమైన చారిత్రక ఉద్యమాలు సాగి నప్పుడుగాని, ప్రత్యర్థి రాజకీయ బృందాల, తలెత్తుతున్న సాంఘిక వర్గాల ఆకాంక్ష లను ప్రతిబింబించిన ఉద్యమాలు నడిచినప్పుడుగాని స్త్రీలు సాహిత్య సృజనలో పాలు పంచుకునే అవకాశం వచ్చింది. అట్లాగే, ప్రతి ప్రాంతంలోను స్త్రీల జానపద పాటలు ప్రధానంగా వ్యవసాయ సంవత్సర చక్రాన్ని వర్ణించే ఆర్యేతర సంస్కృతులకు చెందినవే.

వేదకాలంలో స్త్రీలు కొన్ని రచనలు చేశారని చెప్పబడుతున్నప్పటికీ, వేద సంస్కృతంలోగాని, ఆ తర్వాతి కావ్యాల సంస్కృతంలో గాని సాహిత్యంలో స్త్రీల రచనలు ఎక్కువగా కనబడడం లేదు. ఈ పుస్తకంలో కూడ క్రీ. శ. మూడో శతాబ్దం నుంచి పన్నెండో శతాబ్దం మధ్యభాగంలోంచి రచనలు లేవు.

మధ్యయుగ సాహిత్యంలో ప్రధానమైన ఉద్యమం భక్తి ఉద్యమం. (ఈ ఉద్యమం మీద వివరమైన అవగాహనకు, చూ. మానుషి భక్తి ఉద్యమ సంచిక, 19). దేశంలోని అన్ని ప్రాంతాలలోను ఎనిమిదో శతాబ్దం నుంచి ప్రారంభించి పదహారో శతాబ్దం దాకా ఈ భక్తి ఉద్యమం విస్తరించింది. ఈ ఉద్యమాలు స్వతం త్రంగానే వెల్లువికాయి. తమకు తామే ప్రత్యేక నుడికారాన్ని సృష్టించుకున్నాయి. కాని వాటన్నిటిలోను కొన్ని సాధారణ లక్షణాలు కూడ ఉన్నాయి. దాదాపు ప్రతిచోట చేతి వృత్తుల బృందాల నాయకత్వంలో ప్రజల తిరుగుబాట్లు సాగాయి. ఈ తిరుగుబాట్లు అగ్రకులాల ఆధిపత్యాన్ని వ్యతిరేకించాయి. బ్రాహ్మణ పూజారులు ఆచరించే వైదిక హిందూత్వపు జీవం లేని తతంగంపైన నిరసన ఈ తిరుగుబాట్లలో వ్యక్తమైంది. ఈ ఉద్యమాలలో సాధారణంగా "కింది కులాల" వాళ్ళు పాల్గొన్నారు. ఈ ఉద్యమాలు ప్రచారం చేసిన భక్తికి కుల, లింగ భేదం లేదు. మతం సాంప్రదాయికంగా స్త్రీకి ఇచ్చే స్థానం కోసం భక్తి ఉద్యమపు మహిళా కవులు ప్రయత్నించ నవసరం లేక పోయింది. స్త్రీల కవిత్వం ఆస్థానం నుంచి, దేవాలయం నుంచీ వెలుపడి, పొలాల్లో,

పని స్థలాల్లో, వంటిళ్ళలో వ్యక్తిగత ఆరాధనను తన వస్తువుగా మార్చుకుంది. అట్లాగే భక్తి ఉద్యమ కవులు ఉద్దేశపూర్వకంగానే సంస్కృత భాష విధించే సాహిత్య, మత సంకెళ్ళను తెంచివేశారు. స్థానిక భాషలలో రచనలు చేశారు.

ఈ రెండు యుగాల సాహిత్యాన్ని అర్థం చేసుకోవడానికి స్థూలంగా పునాది అవగాహనను కలిగించే ఈ ముందుమాట తర్వాత 26 మంది కవుల రచనలను, జానపద గీతాలను సంకలనర చేశారు. బౌద్ధ సన్యాసినులు రాసిన తేరిగాథ (పాళీ-క్రీ.పూ. 6వ శతాబ్దం) నుంచి నాలుగు రచనలు, సంగం కవుల (తమిళం-క్రీ.పూ. 100-క్రీ.శ. 250) నుంచి ఎనిమిది రచనలు, అక్క మహాదేవి (కన్నడం-12వ శతాబ్దం) రాసిన నాలుగు వచనాలు, సూలె సంకవ్వ (కన్నడం-12వ శతాబ్దం) రాసిన ఒక రచన, జానాబాయి (మరాఠీ-1298-1350) రాసిన రెండు రచనలు, రామి (బెంగాలీ, 1440 ప్రాంతాలు) రాసిన రెండు రచనలు, గంగాసతి (గుజరాతీ, 12-14 శతాబ్దాలు) రచన ఒకటి, రతన్‌బాయి (గుజరాతీ, 12-14 శతాబ్దాలు) రచన ఒకటి, మీరాబాయి (గుజరాతీ, హిందీ-1498-1565) రచనలు నాలుగు, ఆతుకూరి మొల్ల (తెలుగు-16వ శతాబ్దం) పద్యాలు ఆరు, గుల్‌బదన్ బేగమ్ (పర్షియన్-1523-1603) రాసిన హుమాయూన్ నామా నుంచి కొంత భాగం, చంద్రావతి (బెంగాలీ, 1550-1600) రాసిన కావ్యం నుంచి రెండు భాగాలు, బహినాబాయి (మరాఠీ-1628-1700) రాసిన ఆత్మ నివేదన నుంచి ఎనిమిది భాగాలు, సంచియ హొన్నమ్మ (కన్నడం-17వ శతాబ్దం) రచన ఒకటి, ముద్దు పళని (తెలుగు, 1730-1790) పద్యాలు మూడు, మహ్లాఖాబాయిచందా (ఉర్దూ, 1767-1824) రచన ఒకటి, తరిగొండ వెంకమాంబ (తెలుగు, 1800-1866) రాసిన విష్ణు పారిజాతంలోంచి కొంత భాగం, ఇరవై జానపద గీతాలు ఈ భాగంలో ఉన్నాయి.

ఈ రచనలలోని సాహిత్యాంశాల గురించయినా, సామాజికాంశాల గురించయినా వివరంగా చర్చించడానికి స్థలం సరిపోదు. దాదాపు రెండున్నరవేల ఏళ్ళ కాలంలో, వివిధ భాషా సంస్కృతులలో స్వచ్ఛంగా, స్వతంత్రంగా వికసించిన ఈ రచనలు ఇతివృత్తాలలో, పదచిత్రాలలో, వర్ణనలలో ఆశ్చర్యం కలిగిస్తాయి. రచయితల దృష్టి ఎంత విస్తృతంగా ఉండిందో, ప్రకృతి నుంచీ వాళ్ళు ఎంచుకున్న అలంకారాలు ఎంతటి అర్థస్ఫూర్తిని కలిగి ఉన్నాయో గుర్తించడం ఆసక్తికరంగా ఉంటుంది.

కూతురు జీవా మరణం గురించి విలపిస్తున్న తల్లి ఉబ్బిరికి 'ఈ మరుభూమి నిండా టీవాలాంటి జీవం తొణికిసలాడే కూతుళ్ళెందరో దహనమైపోయారు. ఏ కూతురి కోసమని విలపిస్తావు' అని వినబడి, గుండెల్లోంచి కనబడని బాణం తీసేసి నట్టనిపించిందంట. (ఉబ్బిరి, క్రీ. పూ. 6 శతాబ్దం).

కొడుకెక్కడున్నాడు అనే ప్రశ్నకు కవర్ పెంటు (క్రీ.పూ. 150-క్రీ.శ. 250) "ఎక్కడున్నాడో తెలియదు. ఈ గర్భంలో వాణ్ణి మోశాను. పులి కొన్నాళ్ళు జీవించి వదిలేసిన కొండగుహ ఈ గర్భం. నా కొడుకు నీకు యుద్ధరంగం మీద కనబడతాడు" అని జవాబిస్తుంది.

"ఆకాశంలో గిరికీలు కొట్టే గద్దకు/ చంద్రుడికి తెలిసినన్ని/ ఆకాశపు లోతులు తెలుస్తాయా ?/ నది ఒడ్డున పెరిగే కలుపు మొక్కకు/ తామరకాడకు తెలిసినన్ని/ నీటి లోతులు తెలుస్తాయా ?/ గబగబా తిరిగే ఈగకు/ తుమ్మెదకు తెలిసినన్ని/ పూల వాసనలు తెలుస్తాయా ?/ ఓ చెన్నమల్లికార్జునా/ నీ భక్తుల తోవలు నీకే తెలుసు/ ఈ దున్నపోతు చర్మంపై దోమలకేం తెలుసు ?" అంటుంది అక్క మహాదేవి (క్రీ. శ. 12వ శతాబ్దం).

"ఈ లోకంలో నేను స్త్రీనయి పుట్టినందుకు విచారపడను: ఇట్లా ఎందరో మహాత్ములు కష్టపడతారు" అంటుంది జానాబాయి (1298-1350).

"ఒకనాటికి పువ్వుగా వికసిస్తానని
ప్రతిమొగ్గా తన పిడికిట్లో ఆత్మను పట్టుకుని కూచుంటుంది.
వేటగాడి భయానికీ రానున్న వసంతానికీ మధ్య
బుల్ బుల్ జీవితం దారం మీద వేలాడుతుంది.
బాణం కన్న, కరవాలం కన్న ప్రమాదకరం నీ ఓరచూపు
ఎందరో ప్రేమికుల నెత్తురు కార్చిందది.
వెలిగే నీ చెంపను కొవ్వొత్తితో ఎట్లా పోల్చను ?
కళ్ళనిండా కొవ్వుతో కొవ్వొత్తి గుడ్డిదైపోయింది.
స్వర్గ మధువు నందించే సాకీ, చందా పెదవులారిపోతాయా ?

నీ ప్రేమ చషకాన్ని ఖాళీ చేసింది గదా చందా !" అంటుంది మహ్లాఖాబాయి చందా (1767-1824).

ఇట్లా ఇక్కడి ప్రతి ఖండికలోనూ ఇతివృత్తంలోగాని, చిత్రణలోగాని నవ్యత కనబడుతూనే ఉంటుంది.

(మిగతాది వచ్చే సంచికలో)

శ్రీకాకుళ పోరాట పాటలు

# కదిలింది యువతరం

—సేకరణ : మానేపల్లి

కదిలింది కదిలింది యువతరం
ఎదురులేని బెదురులేని నవతరం
కాగడాలుగా కదిలే ఈ చైతన్యం
కారుచీకటులను చీల్చు కాంతిసైన్య
మదే కాంతిసైన్యం కాంతిసైన్యం ॥ కదిలింది ॥

విద్యార్థులు పుస్తకాల పురుగులు కారు
పెద్దల పీఠాలకు బలిపశువులు కారు
ఆత్మవికాసం కోసం పాఠాలను చదువుతారు
అవసరమైతే గుణపాఠాలను చెబుతారు ॥ కదిలింది ॥

బానిసత్వమును నేర్పు బడులు బడులు కావు
పిరికిమందు పోసె ఆ గుడులు గుడులు కావు
ఆత్మశక్తి దీపించే అభ్యుదయం చూపించే
పాఠశాలలే మంచిని పలికించే మందిరాలు
మానవతా మందిరాలు మానవతా గోపురాలు ॥ కదిలింది ॥

అడుగడుగున డిటెన్షన్ల ఆటలింక సాగవులే
మొగ్గలోనె తుంచేసే మూర్ఖత్వం చెల్లదులే
త్యాగాలకు వెనుకాడక లాఠీలకు తలవంచక
తుదిదాకా పోరాటం సాగిస్తాం
మా హక్కులు సాధిస్తాం సాధిస్తాం

॥ కదిలింది కదిలింది యువతరం....॥

(ఈ పాట 1970 ప్రాంతాల్లో వెలువడిన-ఆ దరిమిలా వెలువడిన తదితర-సంకలనాల్లో కూడా లేదు. శ్రీకాకుళం జిల్లా విప్లవ కార్యకర్తలు పాడేవారట. రచయిత పేరు తెలియదు. దుప్పల గోవిందరావుగారి నోట్సులో పొరబాటున దీని శీర్షిక 'స్త్రీ' అని వుంది. పాటలోని అంశాలు శీర్షికకు తగిన విధంగా లేవు. యువతరాన్ని చైతన్యవంతం చెయ్యడానికి ఈ పాటను ఇప్పుడయినా ఉపయోగించుకోవచ్చును).

# పీడిత ప్రజలారా

పీడిత ప్రజలంతా లేవండోయ
పౌరుషంబున పోరు సలపండోయ్

మాయమాటలు జెప్పి మోసగించీ నేడు
గద్దెనెక్కి నేడు కాంగ్రేసు పాలకులు
టాటాబిర్లాలంద చేరారోయ్
తగని ప్లానులు వేయనున్నారోయ్

బానిసత్వము పెట్టివాకిరీ నంతటిని
బాపుకొనుటకు ప్రజలు నడుము బిగియించగా
రైఫిళ్ళతో రంగ మెక్కారోయ్
రామరాజ్యం బిదేనంటారోయ్

కలకత్త బొంబాయి మలబారు మద్రాసు
కార్మికుల రక్తాలు కాల్వలై పారంగ
పిచ్చిపిచ్చిగ కాల్చి వేశారోయ్
ఫాసిస్టులను మించిపోయారోయ్

విద్యార్థి యువజనులు వీరవనితలు గలిసి
దోపిడీ దొంగలను నడిరోడ్లో నిలబెట్టి
బడితెలతో క్రూరంగ బాదారోయ్
బాష్పవాయువు బాంబు వేశారోయ్

శాంతి రక్షణయంచు కనబడ్డవారినీ
పట్టుకొని బంధించి జైళ్ళలో కుక్కారు
తల్లిపిల్లలు తల్లడిల్లారోయ్
తప్పు జూపామంటే తన్నారోయ్

భర్తలను బంధించ భార్యపిల్లాలంత
ఇది యేమిన్యాయమని ప్రజలంత అడగగా
ప్రాణాలు వీధుల్లో తీశారోయ్
పిల్ల లేడ్వగ తల్లులొాదిగారోయ్

సామ్రాజ్యవాదులా తొత్తులై నేడు
పొరుగుదేశాలకు విస్తరించకపోతు
యుద్ధ కూటమి కండ జేరారోయ్
శాంతికిప్పుడు ముప్పు తెచ్చారోయ్
ప్రజాస్వామిక బాట వదలి కామన్‌వెల్తు
పాలకులతోచేరి బర్మ, మలయా ప్రజల
పోరునాపగ సాయపడినారోయ్
ఫాసిస్టులా కండ జేరారోయ్
కోట్లకొలదీ డబ్బు రాజభరణాలిచ్చి
కాపాడె జాగీరు దొంగలందరినీ
తమ పాలనలో కలుపుకున్నారోయ్
తగిన స్థానాలిచ్చుకున్నారోయ్
దేశ బడ్జెట్ ఇబ్బడికి ముబ్బడికి
హెచ్చించె మిలటరీ ఖర్చులన్నింటినీ
సేనాలెన్నో పెంచుతున్నారోయ్
సత్యాహింసల పాలనంటారోయ్
నీటి వనరులు విద్యవైద్యానికెప్పుడో
నీళ్ళు నువ్వులు వదిలివేసీ నేడు
పాతబాటను త్రొక్కుతున్నారోయ్
ప్రజల మేలుకి సున్న చుట్టారోయ్
నిరుద్యోగులై నేడు కోట్లాది ప్రజలంత
నిల్వ నీడాలేక అలమటించుతు వుండ
స్వాతంత్ర్యమని పిలుస్తున్నారోయ్
గాంధియిజమని కులుకుతున్నారోయ్
సేలమూ కడలూరు దమ్‌దమూ నాసిక్
నిలువుగా జైళ్ళలో గుండ్లెన్నో వరుసగా
నిరపరాధులపైకి పేల్చారోయ్
నిరాయుధుల పట్టి చంపారోయ్

భారతావనికంత బాట చూపినయట్టి
తెలుగువీరుల బట్టి తలక్రిందులాజేసి
చెట్లకిరిచీ కట్టి కొట్టారోయ్
చేతుల్లో సీలలా నాటారోయ్

పీడిత ప్రజలంత పౌరుషంబుగ లేచి
పట్టువిడువాకుండ పోరు సల్పాతుంటె
పల్లెలెన్నో పీకివేశారోయ్
పరమ దుర్మార్గాలు చేశారోయ్

నరక కూపముచేసి దేశపాలననంత
మర తుపాకులతోన పాలించుతున్నారు
'కాజి, హిట్లరు' పాలనా మించిందోయ్
మోసాన్ని గుర్తించి లేవండోయ్

ప్రాచ్యయూరపు రష్య-చైనా దేశాలలో
ప్రజల పాలనకొరకు సాయుధంబుగ పోరి
యమకింకరుల సాగనంపారోయ్
తామె పాలన చేతబట్టారోయ్

మధ్యయుగములనాటి బానిసత్వము బాపి
భూతలా స్వర్గాన్ని నిర్మించుకొన్నారు
బాట యిదియే మనకు లేవండోయ్
పౌరుషంబుగ పోరు సలపండోయ్

[ఈ సుదీర్ఘమైన పాటలో దేశీయ, అంతర్జాతీయ సంఘటనల వివరణ, ఆ సంఘటనల వెలుగులో శ్రీకాకుళ ప్రాంతంలోని విప్లవకారులు కూడా ముందంజ వెయ్యమనే సందేశం యిమిడి వున్నాయి. 1967 జూన్‌లో ప్రజ్వరిల్లిన నక్సల్బరీ పోరాట ప్రభావంతో ఈ పాట కూర్చి వుండొచ్చు. కా॥ దుప్పల గోవిందరావుగారి నోట్సులో తప్ప అచ్చుపడిన పాటల సంకలనాలు వేటిలోనూ ఇది కనపడదు. రచయిత తెలియదు. కాని శైలినిబట్టి చూడగా కా॥ వెంపటాపు సత్యనారాయణగారి రచనకు సన్నిహితంగా కనపడుతుంది.]

బొంబాయి - 1940 నాటి కార్మికుల సమ్మె - ఇది ఆ తదనంతరం ఇతర ప్రాంతాలకు కూడా వ్యాపించే ప్రమాదం ఏర్పడింది. బ్రిటిష్‌వారి కనుసన్నల్లో నడిచే కాంగ్రెసు మంత్రివర్గం సమ్మెను వ్యతిరేకించింది.

కలకత్తా - 1966 ప్రాంతాలనుంచీ కలకత్తాలో కాలేజీ, యూనివర్సిటీ యాజమాన్యపు అక్రమాలకు విద్యార్థులు తిరుగుబాట్లు ప్రారంభించారు. స్నాతకోత్సవాల్లో- మాకు డిగ్రీలు వద్దు ఉద్యోగం కావాలన్నారు - నక్సల్బరీ పోరాటకాలానికి కొంత ముందుగానే - మార్క్సిస్టు లెనినిస్టు మిలిటెంట్ పోరాటాల్లోకి ఆకర్షితులయ్యారు.

1968 నాటికి దేశవ్యాప్తంగా నిరుద్యోగులుగా నమోదయిన విద్యావంతులయిన యువకుల సంఖ్య 30.1 లక్షలుకాగా, 1969 నాటికి 34.3 లక్షలకు పెరిగింది. 1968 జులై నాటికి 83 వేల ఇంజనీరింగ్ పట్టభద్రులు నిరుద్యోగులుగా వున్నారు.

ఇటువంటి పరిస్థితులే యువతరం తిరుగుబాటుకు దారితీశాయి.

కార్మికులు - 1966-67 లలో (ఇందిరపాలన తొలి సంవత్సరాలు) పరిశ్రమలలో స్తబ్దత ఏర్పడింది. 1967-68 పూర్వార్ధానికి రైలువేగన్లు వాహనాల ఉత్పత్తి వరుసగా 23 వేలు, 36.6 వేలు పూర్వస్థాయినుంచి - 15 వేలు, 25.6 వేల యూనిట్లకు దిగజారిపోయింది. 1967 జనవరి 1 నుంచి - మార్చి 15 లోగా 95 సంస్థలలో 23 వేలమంది కార్మికులు పని పోగొట్టుకున్నారు. 8 సంస్థలు పూర్తిగా మూతపడగా 700 మంది నిరుద్యోగులయ్యారు. ఈ పరిస్థితులే బొంబాయి, కలకత్తా, మద్రాసువంటి పారిశ్రామిక నగరాల్లో కార్మికుల తిరుగుబాట్లకు దారితీసింది.

పొరుగుదేశాలు - 1968 నాటికే రష్యా (బ్రెజ్నెవ్‌పాలన) పొరుగుదేశాల ఆంతరంగిక వ్యవహారాల్లో జోక్యం కలిగించుకుని సోషల్ సామ్రాజ్యవాద దేశంగా మారుతున్నది. భారతదేశం - చైనాకు వ్యతిరేకంగా రష్యాకు సన్నిహిత మౌతున్నది. మరొకపక్క కామన్‌వెల్తు దేశాలతో చేరి బర్మా మలయా ప్రజాపోరాటాల్ని వ్యతిరేకించింది.

రాజభరణాలు - 1947కు ముందు భారతదేశంలో సుమారు 560 సంస్థానాలుండేవి. పాలన బ్రిటిష్‌వారినుండి స్వదేశీ పాలనకు మారాక అవన్నీ ఇండియన్ యూనియన్‌లో విలీనమయ్యాయి. నైజాం, తిరువాన్కూరు, కాశ్మీరు సంస్థానాల విలీనం ఆలస్యంగా 1949లో జరిగింది. ఆ యా సంస్థానాల మహారాజులకు కాంగ్రెసు

ప్రభుత్వం పెద్దమొత్తంలో 'రాజభరణాలు' యిస్తానని ఒప్పుకుని యిచ్చింది. (ఇందిర పాలనలో అవి రద్దయ్యాయి) కాని సంస్థానాలు పోగొట్టుకున్నవారిలో అనేకులు ఎం.ఎల్.ఏలుగా, ఎం.పీలుగా, మంత్రులుగా, గవర్నర్లుగా - కాస్త తక్కువ పలుకు బడిగలవారయితే జిల్లా పరిషత్‌కు చైర్మన్‌లుగా, బ్యాంకు డైరక్టర్లుగా పదవులు సంపాదించుకున్నారు. కాగా 'దేవాదాయ ధర్మాదాయ' పరిధిలో వారి 'వ్యక్తిగత ఆస్తుల'కు యిప్పటికీ రక్షణవుంది.

మిలటరీ ఖర్చులు - 1962-63 చైనా సరిహద్దు యుద్ధకాలం నుంచీ (నెహ్రూ పాలనలోనే) భారతదేశపు బడ్జెట్టులో - మిలటరీకి, సరిహద్దు దళాలకీ, ఆయుధాల దిగుమతికి, స్వదేశీ ఆయుధాల తయారీకి పెద్ద మొత్తాలు కేటాయించడం ప్రారంభమయింది. విద్య, వైద్యం మొ॥ రంగాల్లోని నిధుల్ని సైతం - 'దేశరక్షణ' యంత్రాంగానికి తరలించడం ఇప్పటికీ కొనసాగుతూనే వున్నది.

సేలం, కడలూరు (తమిళనాడు) డమ్‌డమ్ (కలకత్తా సమీపం), నాసిక్ మహారాష్ట్ర) - ఇవన్నీ బ్రిటిష్ పాలనాకాలంలోనే నిర్మితమైన పెద్ద జైళ్ళు.

[శ్రీకాకుళ పోరాట పాటల్ని - వీలయినన్ని అముద్రితాల్ని - సేకరించి సంక్షిప్త వివరాలివ్వడమే చేస్తున్నాను. ఈ పాటలన్నీ ఒక పుస్తకరూపంలో తీసుకొచ్చేటప్పుడు- 'విశ్లేషణ' చేదామని వాయిదా వేశాను. అయితే నేనిచ్చిన వివరణలలో లోపాలున్నా, అదనపు సమాచారం వున్నా పాఠకులు పరిశోధకులు కార్యకర్తలు 'అరుణతార' ద్వారా తెలియపరుస్తారని ఆశిస్తాను ]

---

# విరసం విశేషాలు

## 29-3-92న విజయవాడలో సమావేశమైన విరసం కార్య వర్గం చేసిన తీర్మానాలు

## 1. తెలంగాణాలో కొనసాగుతున్న దుర్మార్గమైన నిర్బంధాన్ని ఖండించండి

నేడు తెలంగాణా తల్లడిల్లుతున్నది. అను నిత్యం BSF ఉక్కు బూట్ల పద ఘట్టనల కింద, పారా మిలిటరీ రాక్షసత్వం కింద, గ్రేహౌండ్స్ లాంటి ప్రత్యేక శిక్షణ పొందిన నరరూప రాక్షసుల క్రూర విన్యాసాల కింద తెలంగాణ ప్రజల లేలేత చిగురుటాకుల జీవితాలు విలవిల్లాడి పోతున్నాయి. పూళ్ళకూళ్ళమీద దాడులు చేసి, వృద్ధులనక, పసిపిల్లలనక ప్రజలను గొడ్లకన్నా హీనంగా బాది, పీడిత ప్రజానీకాని కున్న కొద్దిపాటి ఆస్తులనూ, రెక్కల ఫలితాన్నీ ధ్వంసం చేసి నానాబీభత్సం సృష్టి స్తోన్న రాజ్య హింస కిరాతకత్వం రోజురోజుకూ పెచ్చరిల్లిపోతున్నది. యువత గ్రామాల నొదలి పారిపోవాల్సిన పరిస్థితి, కుటుంబాలకు కుటుంబాలే ఇళ్ళు ఖాళీచేసి, నిరుద్యోగమూ, దారిద్ర్యమూ, ఆకలికి తోడుగా రాజ్యహింస క్రూరత్వానికి తట్టుకో లేక, వలస పోతున్న పరిస్థితి. నక్సలైట్ల హింస అనే సాకుతో ప్రజాస్వామిక వాదుల్నీ, మధ్యతరగతి బుద్ధిజీవుల్నీ మభ్యపెడుతూ ప్రభుత్వం, నక్సలైట్లతో ఏ మాత్రం సంబంధంలేనివారినీ ఊచకోత కోస్తున్నది. పౌరుల కనీస హక్కుల్ని కాలరాచి వేస్తున్నది. రోజుకొక 'ఎన్‌కౌంటర్' చొప్పున వందలాది నవ యువతను బలి తీసుకొంటున్నది. తెలంగాణను నెత్తుటి మడుగు చేస్తున్నది.

ఈ బూటకపు ఎన్‌కౌంటర్లకు తాజా ఉదాహరణ హైద్రాబాద్ నగరం నడి బొడ్డున సంజీవరెడ్డి నగర్‌లో జరిగిన 'ఎన్‌కౌంటర్' ప్రవాహం.

కాస్త ఆలోచించగల సత్తా వున్న ఎవరికైనా ఇది ముమ్మాటికీ హత్యే - 'పచ్చి నెత్తురు తాగే పోలీసుల ఘాతుకమే' అన్పించే ఈ ఎన్‌కౌంటర్ గురించి ఒక నేతాళ కథనల్లి దానికి పలు అబద్ధాలు నిస్సిగ్గుగా జోడించి తన చేతుల కంటిన నెత్తురు మరకల్ని దాచుకోవాలని చూస్తున్నది. ఆ పారిశ్రామికవేత్త ఎవరో, చని పోయిన నక్సలైట్లెవరో ఇప్పటికీ అంతుపట్టని రహస్యం. పోలీసులు మృతులని

ప్రకటించిన నక్సలైట్లు తాము సజీవంగానే ఉన్నామని పత్రికా ప్రకటన చేయటం చూస్తుంటే, ఎవరో అమాయకులను పట్టుకొని కాల్చి పారేయడం, దాన్ని ఓ సాహసోపేతమైన చర్యగా కథలల్లుకోవటం పోలీసులకు కరతలామలకమైపోయింది. అట్లే శ్రీకాకుళం జిల్లా కాశీబుగ్గలో మూడు వేర్వేరు సంఘటనలని, ఒకే సంఘటనగా కట్టుకథలల్లి ప్రజలని మభ్యపెట్ట జూస్తున్నారు. ఇట్లా 'బూటకపు ఎన్‌కౌంటర్లు' ఆ వెంటనే కట్టుకథలు. రోజూ రక్తసిక్తమై ఇంటి గుమ్మంముందు రాలే వార్తాపత్రిక పావురాన్ని చూస్తే తెలుస్తుంది - ఎంత అమానుషత్వం ప్రజల గుండెలపై కరాళ నృత్యం చేస్తుందో !

ప్రభుత్వం, ఈ క్రమంలోనే 'ఎన్‌కౌంటర్' కట్టుకథల వాస్తవాల్ని వెలికి తీస్తున్న APCLC ప్రధాన కార్యదర్శి డా॥ బాలగోపాల్‌పై కిరాయి గూండాలతో దాడి చేయించే సీచత్వాని కొడిగట్టింది. అట్లే, మా కార్యదర్శి కా॥ చెంచయ్యపై దాడుల ప్రయత్నం చేస్తూ తీవ్రమైన వేధింపులకు గురి చేస్తోంది. తద్వారా మధ్యతరగతి బుద్ధిజీవులనూ, మేధావులనూ, రచయితలనూ, కళాకారులనూ ప్రభుత్వం హెచ్చరించదలుచుకున్నది, ప్రజల పక్షం వహిస్తే ప్రభుత్వ క్రోధాగ్నికి గురికాక తప్పదని.

ఇదంతా కేవలం ప్రజలు తమ హక్కుల కోసం నిలబడ్డందుకూ, దున్నేవాడిదే భూమి అని నినాద మిచ్చినందుకూ, సారా వ్యతిరేక పోరాటం చేస్తున్నందుకూ, దోపిడిని ప్రశ్నించి, నిలదీసి, ప్రతిఘటించి పోరాడుతున్నందుకూ దోపిడీ వర్గానికి కొమ్ముకాసే ప్రభుత్వం విరుచుకుపడింది — ధనార్జనే ధ్యేయంగల జనార్ధనుడు ప్రజల కుత్తుకలపై కత్తులు దూసి శాంతి భద్రతలు కాపాడాలనుకుంటున్నాడు.

ఈ అమానుషమైన, దుర్మార్గమైన రాజ్యహింసను విరసం తీవ్రంగా ఖండిస్తున్నది. ప్రజల పక్షాన నిలచిన కళాకారుల మీదా, రచయితల మీదా, ప్రభుత్వం నిస్సిగ్గుగా చేస్తున్న దాడులనూ, అమాయకులను చంపేసి ఎన్‌కౌంటర్ అని కట్టుకథలల్లే క్రూరత్వాన్నీ విరసం నిర్ద్వంద్వంగా వ్యతిరేకిస్తున్నది. ఇప్పటిదాకా జరిగిన 'ఎన్‌కౌంటర్ల'న్నిటిపైనా న్యాయవిచారణ జరిపి, దోషులైన పోలీసు అధికారులను శిక్షించాలనీ, ప్రజల న్యాయమైన సమస్యల్ని పరిష్కరించాలనీ, ప్రజల పౌరహక్కులను పునరుద్ధరించాలనీ విరసం డిమాండ్ చేస్తున్నది.

# 2. ప్రజావ్యతిరేక బడ్జెట్‌ను నిరసించండి

పి. వి. నరసింహారావు ప్రభుత్వం ప్రవేశపెట్టిన బడ్జెట్‌ను గత కొద్ది సం॥లుగా అమలుజరుపుతున్న ఆర్థిక విధానాలలో భాగంగా చూడాలి.

1991 నవంబర్ నెలలోనే మన్మోహన్‌సింగ్ ప్రెస్టన్‌కు వ్రాసిన లేఖలో రాబోయే కాలంలో అమలుజరుప తలపెట్టిన కార్యక్రమాల చిట్టాను పేర్కొన్నాడు. జనవరి నెలలో రాష్ట్రపతి వెంకట్రామన్ "ఉత్పత్తిని దెబ్బతీసే సమ్మెలు, ఆందోళనలు, బంద్‌లు వంటివాటిపై కనీసం రెండు సం॥లపాటు స్వచ్ఛంద నిషేధం అమలు జరపాలన్నాడు. పనిలో పనిగా దళారీ, పెట్టుబడిదారీ కుటుంబాలలో ప్రముఖుడైన టాటాని భారతరత్నగా ప్రకటించాడు.

ఆర్థిక రంగంలో ఎదుర్కొంటున్న సంక్షోభానికి ఐ. యం. యఫ్. అప్పే మార్గమని చెబుతూ స్ట్రక్చరల్ అడ్‌జస్ట్‌మెంట్ లోన్ కోసం దేబిరిస్తున్న ప్రభుత్వం ఈ బడ్జెట్ సందర్భంగా రూపాయిని పాక్షికంగా మారకం చేసుకోవచ్చని ప్రకటించింది. ఇది ఇంకోమాటలో చెప్పాలంటే రూపాయి విలువను తగ్గించటమే. ఫలితంగా పి. వి. ప్రభుత్వం గద్దెనెక్కిన తర్వాత ఇప్పటికి రూపాయి విలువ 50-60% పడిపోయింది. ఈలాంటి షరతులనే అమలు జరిపిన 70 దేశాలలోనూ ఏ ఒక్కదానిలోనైనా ఐ. ఎం. ఎఫ్ వైద్యం ఫలించింది లేదు. విదేశీ పెట్టుబడికి అన్ని విధాలైన అవకాశాలు, లాభాలవేటకి అదనపు సౌకర్యాలు కల్పించే కృషిలో మునిగిపోయిన ప్రభుత్వం అనుసరిస్తున్న విధానాల ఫలితాలు దేశప్రజల జీవితాలను మరింత ఇబ్బందుల పాల్జేస్తున్నాయి. ప్రపంచ బ్యాంకు ప్రధాన ఆర్థిక సలహాదారు లారెన్స్ సమ్మర్ పేదదేశాలు అభివృద్ధి చెందాలంటే కాలుష్యాన్ని భరించక తప్పదని ప్రకటించాడు. ఆర్థిక విధానాల ఇతర పర్యావసానాలతోపాటు మరోవైపునుండి కూడా సమస్య తీవ్రం కానున్నదనటానికి ఇదొక సూచన.

ఐ. ఎం. ఎఫ్., ప్రపంచ బ్యాంక్ తదితర సామ్రాజ్యవాద ద్రవ్య సంస్థల షరతుల అమలులో భాగంగా కొనసాగుతున్న ఆర్థిక విధానాలను విరసం నిరసిస్తున్నది. ఈ షరతుల అమలులో భాగంగా ప్రవేశపెట్టిన బడ్జెట్‌కు విరసం తన నిరసనను తెలియజేస్తున్నది.

## 3. దివాళాకోరు కాంగ్రేస్ మేళా

దేశాన్ని అప్పులపాలు జేసి వందల కోట్ల రూపాయలతో తిరుపతి పండుగ చేసుకొంటున్న కాంగ్రేస్ పార్టీ ప్రజా వ్యతిరేక దివాలాకోరు చేష్టలను తీవ్రంగా ఖండిస్తున్నాం. గాలికి పోయే పేలపిండిని కృష్ణార్పణం అన్నట్టు, ఎలాగూ అంబేద్కర్ పుట్టినరోజు కలిసి వచ్చింది కదా అని ప్లీనరీ సదస్సును ఏప్రిల్ 14కు జరిపి లక్షన్నర ఖర్చుతో అంబేద్కర్ కాంస్య విగ్రహం చేయించటం దళితులను తప్పుదారి పట్టించడానికే. మూన్నాళ్ళ ముచ్చటకే హెలీపాడ్‌లూ, రైల్వేస్టేషన్‌లూ, ఉపగ్రహ సమాచార వ్యవస్థల ఏర్పాట్లూ చేసుకొంటూ కాంగ్రేస్ అధికార దుర్వి నియోగానికి పాల్పడుతున్నది. దేశంలో ఆమ్నెస్టీ ఇంటర్‌నేషనల్‌ను నిషేధించిన కాంగ్రేస్ దేశ ప్రజల ప్రాథమిక హక్కులను బలప్రయోగంతో నొక్కి తమ అరాచకాలు విదేశాలలో ప్రచారం కాకుండా చూడటానికే 45 దేశాల నాయకులను ఈ సభలకు పిలిచింది. ఈ జాతర సందర్భంగా గాలింపు చర్యల పేరిట పదివేలమంది పోలీసులను దింపి చిత్తూరు జిల్లా సాధారణ ప్రజా జీవనాన్ని కల్లోలం చేస్తూ ప్లీనరీని ప్రజల పీడకలగా చేస్తున్నారు. ఈ ప్రజాస్వామ్య ప్రహసనాన్ని తీవ్రంగా ప్రతి ఘటించవలసిందిగా ప్రజలకు విజ్ఞప్తి చేస్తున్నాం.

## 4. రామజన్మభూమి - బాబ్రీమసీదు వివాదంపై పాలకవర్గాల కుట్రను గుర్తించాలి

అయోధ్యలో బాబ్రీమసీదు చుట్టుపక్కల వున్న దేవాలయాలన్నింటినీ పడ గొట్టి, ఆ ప్రాంతాన్నంతటినీ చదును చేయించే కార్యక్రమం BJP, VHPల ఆధ్వ ర్యంలో ముమ్మరంగా సాగుతోంది. కోర్టు ఉత్తర్వుల్ని ఉల్లంఘించి కూడా ఉత్తర ప్రదేశ్ రాష్ట్రప్రభుత్వం ఈ చర్యకు పాల్పడింది. రాష్ట్ర ప్రజలు తమకు ఓట్లువేసి గెలిపించింది రామాలయ నిర్మాణం కోసమేననీ, ఆ బాధ్యతని నిర్వర్తించడం తమ పార్టీ ప్రధాన కర్తవ్యమనీ BJP నాయకులు అంటున్నారు. ఉత్తరప్రదేశ్‌లో ప్రజల పేదరికం, నిరుద్యోగం వంటి ప్రాణాంతక సమస్యలేవీ ఆ రాష్ట్ర ప్రభుత్వానికి తక్షణ సమస్యలుగా అనిపించటం లేదు.

విధ్వంసక కార్యక్రమం ప్రారంభమై వారంరోజులు పైగా గడిచిపోయినా, ఇప్పటికీ కేంద్ర ప్రభుత్వం పట్టీపట్టనట్టుగా ఊరకుండి పోవడం కాంగ్రెస్, BJPల పొత్తుకు బహిరంగ నిదర్శనం.

తక్షణ ఆర్థిక సమస్యలనించి ప్రజల దృష్టిని మళ్ళించడానికి పాలకవర్గాలు చేస్తున్న ఈ కుట్రను ప్రజలు గుర్తించాలని విరసం కోరుతోంది.

## 5. చిరస్మరణీయ మృత్యుంజయుడు కామ్రేడ్ నిరంజనకు విరసం జోహార్లు

విమోచన, చిరస్మరణ, మృత్యుంజయుడు నవలానువాదాల ద్వారా తెలుగు పాఠకుల హృదయాలమీద చెరగని ముద్ర వేసిన కన్నడ రచయిత 'నిరంజన' మార్చి 13న హైదరాబాద్‌లో మరణించారు.

1967లో మొదటిసారి పక్షవాతానికి గురైన 'నిరంజన' మాట, నడక కోల్పోయి చివరి రోజుల్లో కోమాలోకి వెళ్ళిపోయారు. విచిత్రమేంటంటే మొదటి సారి ఆయన పక్షవాతానికి గురైనాకనే ఆయన పిల్లలకోసం బృహత్తరమైన కన్నడ విజ్ఞాన కోశ సంపుటాలను వెలువరించారు. 'మృత్యుంజయుడు' నవలకు ప్రాతిపదిక అయిన విశ్వమానవ పేతిహాస రచనకు పూనుకొన్నారు.

'నిరంజన' కర్నాటకలో తొలి కమ్యూనిస్టులలో ఒకరు. ప్రగతిపర రచయితల సంఘాన్ని, 'సముదాయ' ప్రజా నాటక రంగాన్ని ప్రారంభించినవారిలో ఒకరు. కయ్యూరు కామ్రేడ్స్ ఉరిశిక్ష ఆధారంగా ఆయన వ్రాసిన కాసర్‌గాడ్ ప్రాంత రైతాంగ ఉద్యమ చరిత్ర ప్రతిఫలన నవలయే చిరస్మరణ. దాదాపు భారతీయ భాషలన్నిటిలోకీ అనువదించబడిన ఈ నవల కన్నడంలో కన్నా మలయాళం, తెలుగులలో విశేష ప్రచారాన్ని పొందింది.

రాజకీయ నిబద్ధత అరుదైన ఆధునిక కన్నడ సాహిత్య రంగంలో 'నిరంజన' ఒంటరి పోరాటం చేశాడు. ఎక్కువకాలం పార్టీలోనూ కొనసాగలేక పోయాడు. సుప్రసిద్ధ కన్నడ నవలా రచయిత్రీ, 'మాధవి' నవల ద్వారా తెలుగు పాఠకులకు చిరపరిచితురాలు అనుపమ ఆయన భార్య. ఆమె కూడా ఇటీవలే మరణించింది. కూతుళ్ళిద్దరూ సాహిత్య, సాంస్కృతికోద్యమాలలో నిమగ్నులు. మరణించే నాటికి ఆయన వయస్సు 67 సంవత్సరాలు.

'నిరంజన' కుటుంబ సభ్యులకు విరసం తన ప్రగాఢ సానుతాపాన్ని తెలియ జేస్తున్నది.

'నిరంజన' అసలు పేరు శివరావు. శివరావు భౌతికంగా మనకు లేడు కాని చిరస్మరణీయ రచయిత, సాహిత్యోద్యమశీలి కామ్రేడ్ 'నిరంజన' మృత్యుంజయుడు.

## 6. విరసం కార్యదర్శిపై పోలీస్‌దాడి ప్రయత్నాన్ని ఖండించండి

సంస్థ కార్యకలాపాల నిమిత్తం ఫిబ్రవరి 25వ తేదీ రాత్రి గుంటూరు వెళ్ళిన విరసం కార్యదర్శి కా॥ చెంచయ్యగారిని, గుర్తు తెలియని ఇద్దరు వ్యక్తులు రెండు రోజులపాటు వెంబడించి వేధించారు. ఈ విషయం పట్టణ డి. యస్. పి కి తెలియచేసి ఆ ఇద్దరి వ్యక్తులలో ఒక వ్యక్తిని పోలీసులకు పట్టిచ్చినా, పోలీసులు వారిపై ఎలాంటి చర్య తీసుకోకపోగా, తమకు కత్తులు చూపించి పారిపోయాలని కట్టుకథలల్లారు. ఆ ఇద్దరు వ్యక్తులు తెలంగాణాకు చెందిన పోలీసులని నిర్ధారణ అయ్యింది.

పీడిత ప్రజల పక్షం వహించి, సాహిత్య కృషిచేస్తున్న విరసంపై, పోలీసుల ఉక్కుపాదం ఏనాడో పడింది. అయినా, నిర్బంధాలకు దడవక ప్రజలతో భుజం కలిపి నడుస్తున్న రచయితల్ని, భౌతికంగా సైతం హతమార్చాలని కుట్రలు పన్ను తున్న ప్రభుత్వ దుర్మార్గాన్ని ప్రతిఘటించాలని ప్రజలకు విరసం విజ్ఞప్తి చేస్తున్నది. రచయితలు, కళాకారులు, మేధావులపై వేధింపుల నాపాలనీ, కా॥ చెంచయ్యపై దాడికి ప్రయత్నించిన పోలీసులను శిక్షించాలనీ విరసం డిమాండ్ చేస్తున్నది.

## "కు విమర్శ విమర్శగా చలామణి కావడం ప్రమాదకరం"

1-3-92 తేదీన విశాఖపట్నం జిల్లా గ్రంథాలయం ఆవరణలో, విశాఖ విరసం ఆధ్వర్యంలో ఉదయం 9 గంటల నుండీ 12 గంటల వరకూ 'సాహిత్య పరిశోధ నలో సాధక బాధకాలు' అన్న అంశంపై సభ జరిగింది.

పై సభలో సాహితీ విమర్శకుడూ, పరిశోధకుడూ శ్రీ వేల్చేరు నారాయణ రావు మాట్లాడుతూ "ఇవాళ సాహిత్య విమర్శలో పరిశోధనలలో విషయం అప్రధాన మవుతూ, ఎదుటివ్యక్తి సత్తాని పరీక్షించటం, అవతలి వ్యక్తిని హేళనచేసి, అవమా

నించటం ప్రధానమవుతుంది" అంటూ, వ్యక్తి అభిప్రాయాల్ని సాహితీ విమర్శగా ప్రచారం చేయటం ప్రమాదకరం అన్నారు.

శ్రీ గూటాల కృష్ణమూర్తి మాట్లాడుతూ ఈ శతాబ్దారంభం నుండీ ఇంగ్లాండు ఆంగ్ల సాహితి సాంస్కృతిక రంగాలలో కొత్త మార్పులకు వేదిక అయ్యింది. అంతకుముందులా పండితులేగాక, సామాన్యులూ, స్త్రీలూ, సాంస్కృతిక రంగంలో పాల్గొనడం పెద్దఎత్తున మొదలైంది" అంటూ - ఈ మార్పుకు పునాదివేసిన వివిధ సాంస్కృతిక కళాకారులపై పరిశోధనకు ఎన్నుకొని వాటిని 5 volumesగా తీసుకు రావటం జరుగుతుందని తెలియజేస్తూ, ఈ పరిశోధనలోని ఇబ్బందులను వివరించారు.

శ్రీ రావిశాస్త్రి తన ప్రసంగంలో "పరిశోధన అనేది రచయిత ఎందుకు ఈ రచన చేశాడు ? ఏ ఉద్దేశంతో చేశాడు ? అప్పటి కాలపరిస్థితులూ, రాజకీయ పరిస్థితులూ ఏమిటీ ? ఇలా అన్ని కోణాలనుండీ విషయాన్ని పరిశీలించి, పరిశోధిస్తే బాగుంటుంది" అని అభిప్రాయపడ్డారు.

కా॥ చలసాని ప్రసాద్ తన అధ్యక్షోపన్యాసంలో 'సాహిత్య పరిశోధన అవసరాన్ని గురించి, తెలుగుసాహిత్య పరిశోధన చరిత్ర' గురించీ వివరించారు.

---

# సత్యందారే సిసలైన దారి

యమ్మెన్

నేటి ఉషోదయం నీ అమరత్వాన్ని మోసుకొచ్చింది
కృష్ణానదీ జలాలు నీ రక్తాన్ని పులుముకు వచ్చాయి
రోజువారీ బూటకపు ఎన్‌కౌంటర్ హత్యల కాలంలో నీపేరు అచ్చయ్యింది
అబద్ధాన్ని అసత్యమన్నందుకు, నిజాన్ని సత్యమన్నందుకు
చివరకు సత్యమే లేదన్నాడు వాడు
నిన్న నీ గళాన్ని తూట్లుపొడిచి నొక్కేశాడు
మూగబోయిన నీ గళం నేడు వేలాది పీడిత జనహృదయాలను మేల్కొలిపి
పోరాడే వీరుల గాథలను ఆలపిస్తున్నది
సామాజిక చైతన్యతంత్రులను మీటుతున్నది
నీ అమరత్వం మిగిల్చి వెళ్ళిన కర్తవ్యాన్ని వేగిరం చేస్తున్నాం
నిన్న నీ గుండె స్పందనను ఆపాడువాడు
నేడు నీ స్పందన మా హృదయాంతరాళాలనుండి
పెల్లుబుకుతున్నది. ప్రజ్వరిల్లుతున్నది
సత్యం దారే సిసలైన దారని

# కలం లొంగిపోదు

## కవిత :

తమ్ముడూ.... తమ్మారావ్ !
నిజమే- 'లొంగిపోయినోళ్ళంతా' కృంగిపోతున్నారురా !
అయితే వాళ్ళు కుంగిపోయేది
నీకు దక్కిన నెత్తుటికూడు వాళ్ళకు దక్కలేదని మాత్రం కాదు.
పట్టుబడ్డవార్త ప్రపంచానికి తెలపక,
లొంగిపోయినవాళ్ళ 'లిస్టు'లో తమనూ చేర్చినందుకు
నిజంగానే వాళ్ళు కృంగిపోతున్నారు
'కృంగి'పోతున్న వాళ్ళెప్పుడూ లొంగిపోరు

## కవమావీసు :

ఈరోజు(11-4-92) నావద్దకు ఒక వ్యక్తి వచ్చి, 'నువ్వే గ్రూపు' అని అడిగినాడు. 'నాకు గ్రూపులేమీలేవు - నేను 'విరసం' సభ్యుడ్ని, రచయితని' అని చెప్పినాను. 'విరసంలో ఏ ముఠా' అని వాడు తిరిగి ప్రశ్నించాడు. నేను కొంచెం 'సీరియస్' అయ్యి 'నువ్వెవడవు' అన్నాను. "నేనూ ఒకప్పుడు నీ మిత్రుడనే, కానీ ఇప్పుడు 'స్వేచ్ఛ'గా బతుకుతున్నాను" అన్నాడు. "నన్ను విరసానికి రాజీనామా చేయమనీ, అలాచేసినట్టు పత్రికా ప్రకటన ఇస్తే, నా అర్హతకు తగ్గ చక్కని ఉద్యోగమిప్పిస్తాననీ చెప్పాడు. తన పేరు 'తమ్మారావు' అనీ, పార్టీలోనూ, విరసంలోనూ రకరకాల పోకడలుంటాయనీ, నువ్వు చిన్నవాడివీ, నీకు తెలియదూ" అంటూ ఎన్నో చెప్పబోయాడు. వాడిమాటల్ని మధ్యలో కట్ చేస్తూ 'ఇక మీరు వెళ్ళిరండి' అన్నాను. ఇక చేసేదిలేక కుర్చీలోంచి లేచాడు. వెళ్ళిపోతుండగా మళ్ళీ పిలిచి 'నీపేరేంటి ?' అన్నాను 'తమ్మారావు' అన్నాడు.

తమ్మారావుకు తలవుంది, తలలో మెదడూ వుంది. మెదడులో 'బుద్ధి' వుంది. అయితే ఆ బుద్ధి "కుక్క" బుద్ధి అని నా మనస్సుకు అర్థమై, నా కలం అలా కదిలింది........

— గూడూరు గంగాధరరావు

కరపత్రాలు :

— ప్రభుత్వ బలగాలు ప్రజలమీద క్రూర నిర్బంధాన్ని ప్రారంభించిన నేపథ్యంలో

— పారా మిలిటరీ, పోలీసుల ఇనుప బూట్లక్రింద ప్రజా స్వామ్యం, ప్రజల ప్రాణాలు గిలగిలా కొట్టుకుంటున్న విషాద క్షణాల్లో

# రచయితలారా ! కళాకారులారా !

# మీ రే పక్షం

## దోపిడీ సంస్కృతి పక్షమా ? ప్రజల సంస్కృతి పక్షమా ?

**తేల్చుకోవలసిన సమయం ఆసన్నమైంది, అనివార్యమైంది.**

**ఆలోచించండి.**

ప్రియమైన కళాకారులారా ! రచయితలారా !

ఆంధ్రనాటక కళాపరిషత్ ఉత్సవాల్లో భాగం పంచుకోవడానికి రాష్ట్రం నలు మూలల నుంచి మీరు వచ్చారు. మీలో గొప్ప రచయితలున్నారు. గొప్ప నటు లున్నారు. గొప్ప దర్శకులున్నారు. ఆరితేరిన సాంకేతిక నిపుణులున్నారు. మీ శక్తి సామర్థ్యాల్ని మేం తక్కువగా అనుకోవడం లేదు. మీలో వున్న కళా తపస్సును మేం కించపరచడం లేదు. నాటక రంగానికి మీ వొంతుగా మీకు తెలిసిన పరిధిలో మీరు చేస్తున్న కృషికి మొదటగా మేం విప్లవాభినందనలు తెలుపుతున్నాం.

మీ కోసం ఏర్పరచబడ్డ రంగస్థలం మీద మీరు మీ ప్రదర్శనలు ప్రదర్శించ బోయే ముందు, బహుమతులు అందుకోబోయేముందు, సన్మానాలు చేయించుకోబోయే ముందు ఈ రాష్ట్రంలో "రక్తసిక్తమైన రంగ స్థలం" మీద ఈ రాష్ట్ర ప్రభుత్వం సారథ్యంలో ప్రదర్శించబడుతున్న "నిర్బంధకాండ" అనే క్రూర విషాద భయానక రాక్షస రచన నిజ రూపాన్ని మీ ముందు వుంచడం మా కర్తవ్యంగా భావిస్తున్నాం. మీకు తెలియని సన్నివేశాలని కాదు. తెలిసిన సన్నివేశాల్నే "రివ్యూ" చేస్తున్నాం. చూస్తున్న దృశ్యాన్నే మరోసారి చూడమని ప్రార్థిస్తున్నాం.

నిన్నటి విషయం వదిలేద్దాం. ఈ రోజు ఏం జరుగుతుందో చూద్దాం. జనార్ధనరెడ్డి ప్రభుత్వం అధికారంలోకి వచ్చాక ఈ రోజు వరకు దాదాపు 160 మంది బూటకపు ఎన్‌కౌంటర్ల పేరుతో చంపబడ్డారు. ఈ బూటకపు ఎదురుకాల్పుల మారణకాండ కేవలం అడవులకు, పల్లెలకి మాత్రమే పరిమితం కాలేదు. పట్టణాలకి, నగరాలకి విస్తరించింది. వరంగల్‌లో APCLC నాయకుడు ప్రభాకర్‌రెడ్డిని కాల్చి చంపారు. హైద్రాబాద్‌లో జర్నలిస్టు రసూల్‌ని, అతని మిత్రుణ్ణి కాల్చి చంపారు. విప్లవ రచయితల యిళ్ళ మీద, ప్రజా కళాకారుల ఉనికి మీద నిఘా వుంచారు. హాస్పిటల్‌లో వున్న ప్రజా కళాకారుడు సంజీవిని అరెస్టు చేశారు. APCLC కార్యదర్శి బాలగోపాల్ మీద తీవ్రమైన దాడి చేశారు. APSP, స్పెషల్ టాస్క్‌ఫోర్సు, CRPF, BSF, CISF, గ్రేహౌండ్సు లాంటి అనేక రకాల పోలీసుల్ని, పారా మిలటరీ బలగాల్ని తెలంగాణా గ్రామ ప్రాంతాల్లోకి వేల సంఖ్యలో దింపి, విదేశీ సేనల మీద మోహరించి దాడులు జరిపే విధంగా ఈ రోజు తెలంగాణా అన్ని జిల్లాల్లో క్రూర నిర్బంధం విలయతాండవం చేస్తోంది. ఆ నిర్బంధకాండ ఆంధ్రకోస్తా, రాయలసీమ జిల్లాల్లో కొన్ని చోట్ల తీవ్రంగా, మరికొన్ని చోట్ల చెదురుమదురుగా జరుగుతూనే వుంది. ఈ నిర్బంధకాండని ఖండిస్తూ ప్రదర్శనలు జరపరాదు. సభలు పెట్టకోరాదు. కవిత్వం రాయకూడదు నాటకంగా ప్రదర్శనలు యివ్వకూడదు. అంతా నిశ్శబ్దం. కాకుంటే మారణహోమం. ఈ వాస్తవాలు మీకు తెలియనివికాదు. అనుభవంలోకి రానివికాదు. మీ యింటి ప్రక్క జరుగుతున్నవే నిన్నటిదాకా మీతో కలసి తిరిగి కబుర్లు చెప్పిన మీ మిత్రుల్లోనే కొందరు ఈ రోజు కన్పించక పోవడమో, కాల్చి చంపబడడమో, అజ్ఞాతంలో వుండిపోవడమో మీ అనుభవంలోకి రాని విషయాలు కాదు. నిన్నటిదాకా పచ్చగా వున్న పల్లె, పొలం ఈ రోజు స్మశానంగా, రక్తసిక్తంగా మారి వుండడం మీరు చూడని దృశ్యం కాదు. చదవని వార్త కాదు. అంతేకాదు ఈ క్రూర నిర్బంధకాండ అంతా ప్రజాస్వామ్యాన్ని రక్షించడం, శాంతి భద్రతల్ని రక్షించడం పేరిట పోలీసు ఉన్నతాధికారులు ప్రభుత్వం కలిసి అమలు చేస్తున్నారని మీకు తెలియందికాదు. మరో వైపు నిప్పులు చెరుగుతున్న నిర్బంధంలో కూడా ప్రజలు వీరోచితంగా ప్రాణాలకు తెగించి ఎందుకు పోరాడుతున్నారో మీరు అర్థం చేసుకోగలరు.

నిజానికి ప్రజలు ఎందుకు పోరాడుతున్నారు? ఎవరికి వ్యతిరేకంగా పోరాడు

తున్నారు? ఎందుకు ప్రాణాలు యిస్తున్నారు? ఈ దేశంలో సెంటు పొలం లేని వ్యవసాయ కూలీలున్నారు. వాళ్ళు కూలిరేట్లు పెంచమని, నెత్తిమీద యింత నీడ చూపమని పోరాడుతున్నారు. భూస్వాముల అక్రమ ఆక్రమణలో వున్న బంజర్ల కోసం, పోరంబోకుల కోసం, బినామీ భూములకోసం పోరాడుతున్నారు. పోరాటం అక్రమవడ్డీమీద, పిచ్చికౌలతలమీద, షావుకార్ల పీడనమీద జరుగుతోంది. అడవి భూమి హక్కుకోసం పోరాటం జరుగుతోంది. తునికాకు రేటు పెంపుకోసం జరుగుతోంది. బొగ్గుగనుల్లో, ఫ్యాక్టరీల్లో యాజమాన్యం నిరంకుశ దోపిడికి, పీడనకి వ్యతిరేకంగా పోరాటం జరుగుతోంది. కోట్లాది కుటుంబాల్ని కాల్చివేస్తున్న సారాని నిషేధించమని పోరాటం జరుగుతోంది. అక్రమంగా కోట్లాది రూపాయలు గడిస్తున్న కాంట్రాక్టర్లమీద, వందల వేల ఎకరాలు సొంతం చేసుకొన్న భూస్వాములమీద, దౌర్జన్యాలు చేస్తున్న పెత్తందార్లమీద, అవినీతిపరులైన మంత్రులమీద, శాసనసభ్యులమీద, ఉన్నతాధికారులమీద పోరాటం జరుగుతోంది. దున్నేవాడికి భూమి కావాలనే ప్రాథమిక అవసరంకోసం నేలతల్లి విముక్తికోసం, శ్రామిక జనరాజ్యం కోసం ఈ రోజు పోరాటం జరుగుతోంది. పోరాటం జీవితంలో భాగమై పోరాడుతోంది. జీవితం పోరాటంతో పోరాడుతోంది. సహనం నశించిన ప్రజలు సంఘటితం అవుతున్నారు. తమ న్యాయమైన హక్కులకోసం పోరాటం ప్రారంభించారు. ఈ పోరాటంతో దోపిడీదారులకు శాంతిభద్రతలు కరువన్యాయి. ప్రజల న్యాయమైన పోరాటం ప్రభువుల దృష్టిలో అరాచకమైంది. ఈ పోరాటాన్ని అణచడానికి ప్రభుత్వం పోలీసు బలగాన్ని ఉసికొల్పింది. అరెస్టులు, వేధింపులు, చిత్రహింసలు, బూటకపు ఎదురుకాల్పులు ప్రారంభించింది. రక్తసిక్తమైన రంగస్థలంమీద 'నిర్బంధకాండ' ప్రదర్శన జరుగుతోంది. పోలీసు దిగ్బంధనలో భయంగా బతుకుతున్న గ్రామాలు, బిడ్డల్ని పోగొట్టుకున్న తల్లులు, భర్తల్ని పోగొట్టుకున్న భార్యలు, తల్లిదండ్రులను పోగొట్టుకున్న చిన్నారి బాబులు, పాపలు, అక్రమ కష్టడీల్లో మానప్రాణాల్ని పోగొట్టుకుంటున్న అక్కలు, చెల్లెళ్ళు, చెట్లకు కట్టివేయబడి కాల్చబడ్డ నేలతల్లి ముద్దుబిడ్డలు "కళాకారులారా! మీరెవైపు?" అని ప్రశ్నిస్తున్నారు. మా వైపేనా అని ఆశగా అడుగుతున్నారు. మీ కోసం ఎంతో విలువైన కథావస్తువుని వదిలేస్తూ చరిత్రలో భాగం అవుతున్నారు. చరిత్రని రాస్తున్నారు. ప్రియమైన కళాకారులారా! మహోన్నత త్యాగాలకి వారసులైన రచయితలారా! ఏది చేస్తారు? ఈ నిర్బంధకాండని చూస్తూ ప్రేక్షకుల్లా మిగిలిపోతారా! ప్రజల్లో

భాగమై ప్రజల పక్షాన నిలబడతారా ? ఏది చేస్తారు? ఓ క్షణం ఆలోచించండి. ఉద్రేక పడటానికి అలవాటుపడ్డ మీ నరాలు, నెత్తురు, ఓ క్షణం ఆలోచిస్తే ఎంతో గొప్ప అద్భుతం జరుగుతుంది. ఎంతో గొప్ప సజీవ రచనకు మీరు మూలకర్తలౌతారు. హక్కుదారులౌతారు.

ప్రియమైన మిత్రులారా!

విప్లవాలయుగం యిది. దేశాలు స్వాతంత్ర్యం కోసం, జాతులు విమోచన కోసం, ప్రజలు విప్లవాల కోసం పోరాడుతున్న ప్రస్తుత చారిత్రక దశలో, రచయితలు, మేధావులు, కళాకారులు తటస్థులుగా వుండలేరు. తెలిసిగాని, తెలియకగాని, చారిత్రక శక్తులపట్ల పాక్షికవైఖరి తమ రచనల్లో, కళారూపాల్లో ప్రదర్శిస్తారు. కళాకారులకు ప్రజలే పాఠకులు, శ్రోతలు, ప్రేక్షకులు అయినప్పుడు కళాకారులకి ప్రజలకి అన్యోన్యం తప్పనిసరి. కళ ప్రజలకే చెందాలి. కళాకారుడు ప్రజావాణి కావాలి. ఇందుకు ప్రజా పోరాటాల్లో కళాకారుడు ప్రత్యక్షంగానో, పరోక్షంగానో భాగస్వామి కావాలి. కళ మొత్తం జీవితంలో భాగం. వేయిరేకుల తామరపువ్వులో ఒక రేకు. ఆ పువ్వు విప్పారినప్పుడే కళకు రాణింపు. అందుకే ఈనాటి దోపిడీ వ్యవస్థతో రాజీలేని వైఖరి, నిజాయితీ గల ప్రతి కళాకారుడికి తప్పనిసరి. నిజాన్ని వెల్లడించడంలో భయ సంకోచాలు విడిచి ప్రజలకు బాసట కావాలి. ఇప్పుడు ప్రజలకి, ప్రజా వ్యతిరేకులకి మధ్య యుద్ధం జరుగుతోంది. యుద్ధానికి పిలుపు వచ్చినప్పుడు ఏ పక్షం వహించాలో తేల్చుకోక తప్పదు. ఒడ్డున కూర్చోలేం ఒడ్డు కూడా యుద్ధ రంగమే. అందుకని సాంస్కృతిక యోధులారా ! రచయితలారా ! కళాకారులారా ! ఏ పక్షం వహించాలో నిర్ణయించుకోండి. ప్రజలు తమ పక్షాన్ని గెల్పించి తీరుతారు. ఇది చరిత్ర సత్యం.

* ప్రభుత్వ నిర్బంధకాండని నిరసించండి.
* పారామిలటరీ దళాలను రాష్ట్రం నుండి తొలగించాలని డిమాండ్ చెయ్యండి.
* ప్రజల న్యాయమైన పోరాటాలను బలపరచండి
* ప్రజల సాహిత్యం, ప్రజల కళలు, ప్రజాసంస్కృతి వర్ధిల్లాలి -

విప్లవాభినందనలతో
విప్లవ రచయితల సంఘం
ప్రకాశం జిల్లా

# హలో వెంకటేశం ఓ షైవుంటే సర్దు

అప్పు చేసినా నిప్పంటి సారా తాగాలన్నాడోయ్ శాస్త్రకారుడు. చుట్టుపక్కల అయొక్క నక్సలెట్లు యెవరూ లేరు గదా. యేవిటో వీళ్ళు కూడా యీ మధ్య గాంధీగారి మాయలో పడి మధ్య నిషేధం అని గట్టిగా పట్టుక్కూచున్నారు. అందుకే యెమర్జెన్సీ నుండి పటాన్ చెరు దాకా ఈ గాంధీబాబుల్ని లెక్కబెట్టి మరీ మర్డర్లు చేశారు మన గాడ్సేగారి గ్రాండ్ సన్స్. దాన్సిగదరగ! గాడ్సే అనగానే యెందుకో గాని మన సి.యం.గారే గుర్తుకొస్తాడు. యేమాటకామాటే చెప్పుకోవాలి, భలే సరసు డోయ్ మనిషి. మొన్నా మధ్య ఆయనతో బాటు పార్టీలో వున్నప్పుడు .... .... అదిగో యేమిటో సస్పీషియస్ లుక్కూ మీ నాన్న అగ్నిహోత్రావధానుల్లా! గిరీశం గారేమిటీ అలాంటి పెధవ పార్టీలో జేరడమేమిటా అనా, డామిట్! యిటీజ్ గ్రేస్ ఇన్‌గ్రాటిట్యూడ్ మైడియర్ వెంకటేశం. వర్స్‌దాన్ సెల్లిం బోయ్స్ ఫర్ ది డౌరీ! పార్టీ అంటే పార్టీయేనన్నమాట. కొనకంటా విను.

"తుపాకీ పట్టను - పట్టనివ్వం" అన్నాడోయ్ భళ్ళున ముండాకొడుకు. నాకిక నవ్వాగింది కాదు. సెకండ్ రౌండ్‌లోనె ఢబుతెగిరిపోయిందనుకో "వున్న తుపాకులు చాలక బోర్డరు సెక్యూరిటీ ఫోర్స్‌ను కూడా తెలంగాణాలో దించి యీ బొబ్బలేరు ముక్కలనడం యేం సబబు? అయినా తమరు యెన్ని హత్యలు చేయించి ముఖ్య మంత్రి అయ్యారో పాతబస్తీ మరిచి పోయిందనుకుంటున్నావా జనార్ధనా?" అని అడిగేశా. గిక్కురుమిక్కురు మనలా అంతలావు జెంటిల్మేనున్నూ. యింతలో యెక్కడున్నాడో యేమోగాని దూసుకొచ్చాడోయ్ హోమ్ మినిష్టరు మైసూరారెడ్డి. ఈయన జిత్తులకు జాకాల్ తెలివికి బిగ్‌యాస్. మొన్నా మధ్య హైద్రాబేద్‌లో జర్న లిస్టు రసూల్‌భాయిని లాగించేశాల్లే. యే దౌర్భాగ్య క్షణంలో ఆ హవానా చుట్టలు విసర్జించి యీ హవాయి చెప్పుల్లోకి దిగానోగాని ప్రతి వెధవా యేకవచన ప్రయోగం చేస్తున్నాడోయ్. నోర్మూయ్! అ, అలా వులికిపడకు, నిన్నుకాదు - నన్నే, అలా అన్నది హోమ్మినిష్టర్. "తుపాకులతో అధికారం చలాయించడానికి ప్రయత్నించే ముఠాలను బతకనివ్వం" అని తూలుకుంటూ డైలాగ్ కొట్టాడు. పిడుగుబడినా అడుగు తొణకం కదా మనం. అ యొక్క బెనారసీ యూనివర్శిటీలో వేద పండి తులు పీలకలు తెంపుకొని జంపు చేసినప్పటి ఘనాపాటీ లెక్చరు వొకటి కొట్టా."

"చాలా మంచి నిర్ణయమండీ. ఇది కడప జిల్లాలోని తమవారి ముఠాలకు కూడా వర్తిస్తుందా హోమ్మంత్రిగారూ? రాజశేఖరరెడ్డి, దివాకరరెడ్డి, వెంగళరెడ్డి, శివారెడ్డి, శేషశయనరెడ్డి, రామకృష్ణారెడ్డి, ప్రతాపరెడ్డి అదిగా గల రాయలసీమ కాంగ్రెస్,

తెలుగుదేశం నాయకుల ముఖాలకు కూడా వర్తిస్తుందాండీ? అనేసరికి ఆ యొక్క విట్రగుంట ప్యాసింజరు బోగి చుండూరు దగ్గర లేచినట్లు లేచి విరుచుకు పడిపోయాడు పూర్ క్రీచర్? అయినా నిప్పంటీ సారా గనుక నిషా దిగలేదనుకో. అవునూ టాక్ ట్రాక్ తప్పి యింతదూరం వచ్చిందేమిటి చెప్మా! యివాళ నిప్పంటి సారా మీద కదా లెక్చరు, నోట్ బుక్కు తీసో్కు. అప్పుచేసి కొంప గుల్లయినా నిప్పంటి సారా తాగాలోయ్. అది యెట్లనన్ -

"అడ్డదిడ్డముగా అప్పులు చేసి
ఆలిండియానే తాకట్టు పెట్టి
అమెరికా బ్యాంకిలో బిచ్చమెత్తి
పౌరుల హక్కులపై తుపాకులెత్తి వందకోట్ల ప్రజా
ధనంతో సిగ్గులేకుండా పార్టీ చేసుకుంటూ
దేశాన్ని తిరుపతిలో తిరుక్షవరం చేస్తున్న పీవి
నరసింహారావు ప్లీనరీ పీడరీతిన్"

దీని ఛందస్సు పీకందం. యిది "త్రివర్ణ రహస్యగాథ" కిష్కింధ కాండలో ఆరున్నొకటో పద్యం. వ్యాస మహాముని రాశాడోయ్. యేమిటీ రాయలేదంటావా? నీ అనుమానం పిగ్గోపిరి. రాయకపోతే రాసి వుండాల్సిందోయ్ గుంటడూ. మరి మన కళ్ళముందే యింతమంది కలెక్టర్లూ, బడాబడా ఆఫీసర్లూ నాయకుల కోసం లాడ్జీల బుకింగూ క్లీనింగ్ పనుల్లో మునిగి తేలుతూ వుంటే, ఆ యొక్క యూనివర్శిటీ కులపతి యిల్లు పీకి ప్రధానికి పందిరేస్తుంటే, ఆ యొక్క రూయా ఆస్పత్రిలో ప్లీనరీ రోగులకోసం బెడ్లు ఖాళీ చేయించేస్తుంటే, వచ్చే వి ఐ.పిల కోసం ఫారిన్ విస్కీల యేర్పాట్లకు ఎక్సైయిజు పోలీసులు కిందుమీదులవుతుంటే, ఆ యొక్క పత్రికలు రెక్కలు విప్పుకొని ప్లీనరీ ఆకాశంలో పెంపుడు పక్షుల్లా యెగురుతుంటే, 1500 సమ్మర్ ట్రయిన్స్, లోకల్‌గా 400 బస్సు సర్వీసులు, హెలిపాడ్‌లూ, శాటిలైట్ సిస్టమ్సూ, పాతిక వేలమంది పోలీసులూ, వంద ఏనుగులూ, ఛప్పన్నారు లొట్ట పిటలూ, పద్దానుగు వందల గాడిదలూ .... .... ఎవరా నవ్వేది? మధురం కాదు గదా! మైడియర్ షేక్స్పియర్ - చప్పుడు చేయకుండా గబుక్కున గ్రీన్ రూమ్‌లోకి వెళ్ళి ఆ నవ్వేదెవరో ఆనవాలు పట్టు. లైటు వేయకుమీ, నీ రంగు చూచి ఎల్‌టిటిఇ వాడివనుకొని జడుసుకోగలదు. అసలే ప్లీనరీ పీడలో ప్రతివాడినీ తీవ్రవాదిగానే చూస్తున్నారు.

యేమన్నావ్! మధురవాణి కాదా? కనీసం అపోజిషన్ వాడుకూడా కాదా! ఆ నవ్వింది మనోడేనా డామ్‌షేమోయ్. యేవిటీ దేశప్రజలను అమెరికాకు తాకట్టు

పెట్టినా, కోటానుకోట్ల అధికార దుర్వినియోగం చేసినా దేశం దిమాగుడిసిపోయినా తిరుపతి రోడ్లు బాగుపడి పోతున్నాయంటావా ?

బావుంచోయ్. వెనకటికొకడు అయ్యచస్తే చచ్చాడుగానీ గూని చక్కగా వచ్చిందని సంతోషించాట్ట. అమ్మవారొచ్చి బిడ్డపోతే పోయిందిగానీ ఆరోగ్యశాఖ వెయ్యి రూపాయిలిచ్చింద ? డామిట్ ! సంతోషించాట్ట. అంతో ఇంతో తెలిసినవాళ్ళు కూడా యిట్లా అఘోరిస్తే యెట్లాని ఇప్పుడేసిన రోడ్లమీద ఇవాళ దేశాన్ని యేలుతున్న దొంగలు, హంతకులు, ప్రజాస్వామ్యంలో అధికారం చేపట్టడానికి కనీస అర్హత లేనివాళ్ళు, దేశాన్ని కుక్కలు చింపిన విస్తరిగా చేసినవాళ్ళు వస్తున్నారు. ఈ దేశద్రోహులను కాపాడేనెపం మీద ప్రజలను నొక్కడానికి పాతికవేలమంది పోలీసులను దించారు. మరి రోడ్లమీద నీకు తిరిగే సందు కూడా వుండదు మూడురోజులూ. అపునూ గవర్మెంటులో పనులు జరగవని అన్న వెధవాయి యెవడోయ్. ఆ రాజీవ్ నగర్‌ని వొక్కసారి చూసి అక్కడ వాయువేగమనో వేగాలతో కోట్లకోట్ల పనులు జరగడంలేదని నాతో అన్నాట్టాయెనా, ఈ చెయ్యివాచి నా గూబ నేనే కదపాయించుకుంటాను. యింకా డెమాక్రసీలోని తమాషా ఏమిటంటే కొన్నిరకాల హత్యలు, దొంగతనాలు చేసినవాళ్ళు మటుకే జెయిలుకు పోతారు. తక్కినవాళ్ళు అసెంబ్లీకి పార్లమెంటుకు పోతారు. ఈ హంతకులు పంపకాల్లో గొడవపడితే "అసమ్మతి రాజకీయం" అని అందమైన పేర్లు పెట్టి వార్తలు వ్యాఖ్యలు రాస్తారు. యిక ఈ యొక్క పోలీసుల ఘనకార్యాలను తిరుమల పుణ్యక్షేత్రం ఎస్సయి గురుమూర్తి మాత్రమే చెప్పగలడు. యేమిటో మళ్ళీ వేదకాలం దాపురించినట్టుందోయ్. అసలే ప్లీనరీ ఆ పైన పదివేలమంది పోలీసులు. యిదిగో కనిస్టేబులు, హెడ్డులూ, పేదపోలీసులు: మనతిట్లు వీళ్ళమీద కాదు. పోలీసుల్లోనూ పుణ్యాత్ములుంటారు కదా. పుణ్యాత్ములనగానే హోమ్మంత్రి చవాన్ గుర్తురావట్లేదూ ?" పోలీసులు గురుతరమైన బాధ్యత నిర్వహించుతున్నారు. వాళ్ళను ఎక్కువగా విమర్శించవద్దు. మొదటి తప్పులను క్షమించండి అని ఈ మధ్య యితగాడు అఘోరించాడు. ఈ ప్లీనరీలో కూడా పోలీసులు ఏమన్నాచేస్తే ఈ మహానుబావులు యిదేమాట అంటారు కదా అనేదే నా దిగులు యేమంటావ్ మైడియర్ షేక్స్పియర్ ?

వెంకటేశం : యిందాకట్నుంచి చూస్తున్నా మీ వరస. మీరే ప్రశ్నలు వేసుకొని మీరే చెప్పేసొక్కవడమేగాని నన్నొక్కమాట మాట్లాడనిచ్చారూ ?

గిరీశం : వార్నీ, నాకూ యిదే అనుమానం వచ్చింది స్మీ. చూసావా నా కొచ్చిన అయిడియానే నీకూ వచ్చింది. నువ్వూ నా అంతటి వాడవై పోతు

న్నావ్. మరి మనతో మాటలాడదవే ఎడ్యుకేషన్ గదోయ్. నువ్వు నా మాటవింటే నిన్ను సురేన్....

వెంకటేశం : సరేగాని అసలు యిలా దేశాన్ని అమెరికాకి అమ్మేస్తూ, అధికార దుర్వినియోగంతో వందకోట్ల ప్రజాధనాన్ని పోసి ప్లీనరీ జరపడాన్ని యేమంటారండీ ?

గిరీశం : దేశద్రోహులు జరుపుతున్న కుట్ర-అంటారు.

వెంకటేశం : ఉద్యమాలనూ త్యాగాలనూ అడవిలో వదలి, కె.జి.బి. నిధులతో కులాసాగా గడుపుతూ ఈ ఉభయ భ్రష్టత్వం పొందిన ఉభయ కమ్యూనిస్టు పార్టీలను కూడా దేశద్రోహులుగా లెక్కేయొచ్చునాండీ ?

గిరీశం : వో భేషుగ్గా.

వెంకటేశం : ది "యిలెవెన్" పాయింట్స్ ఫర్ ది అప్‌హోల్డింగ్ ఆఫ్ ది డెమోక్రసీ అని చాలా కాలంగా చెబుతానని అంటూనే వస్తున్నారు. యిప్పుడు చెబుతారాండీ ?

గిరీశం : వెంకటేశం ! యిప్పుడు చెప్పేవి ఆ రెడ్‌బుక్‌లో నోట్‌చెయ్. ఐ. ఎం. ఎఫ్ కబంధహస్తాన్ని ఖండిద్దాం. సామ్రాజ్యవాదంతో పోరాడుదాం. నూతన ఆర్థిక విధానంలోని దివాళా కోరుతనాన్ని ఎండగడదాం. ధరల పెరుగుదలా లాకౌట్లూ, ద్రవ్యోల్బణం సృష్టించే ఐ.ఎం.ఎఫ్. కుట్రను బయట పెడదాం జాతివిముక్తి పోరాటాలపై, ప్రజాస్వామ్య ఉద్యమాలపై ప్రభుత్వ దమనకాండను ప్రతిఘటిద్దాం. "అఖండ భారతం" అనే బి.జె.పి. మతోన్మాద హిందూనినాదం భారత దేశంలో సామ్రాజ్యవాదుల మార్కెట్ బలపడడానికే పనికొస్తుందని నలుగురికీ తెలుపుదాం. ఆంధ్ర దండకారణ్య బీహార్ రైతాంగ పోరాటాలపై రాజ్యహింసను ఎదుర్కొందాం. మార్క్సిజం, లెనినిజం మావో ఆలోచనా విధానాన్ని సమున్నతంగా నిలబెడదాం. విప్లవం వర్ధిల్లాలి. విప్లవం వర్ధిల్లాలి.

14-4-92 విప్లవ రచయితల సంఘం
తిరుపతి చిత్తూరు జిల్లా యూనిట్

మహాకవి గురజాడ "కన్యాశుల్కం"
వందేళ్ళ వేడుకలకు జేజేలు

# స్వీకారం

1) భారత వ్యవసాయరంగపు అర్థ భూస్వామిక స్వభావం. విమోచన ప్రచురణలు. 58 పేజీలు. వెల : 3రూ. ప్రతులకు : విమోచన, నల్లకుంట, హైదరాబాద్-44.

2) ఇంకానా ఇకపై చెల్లదు.... : విదేశీ కబంధ హస్తాలలో దేశం. ప్రచురణ : భారత కార్మిక సంఘాల సమాఖ్య (IFTU), వర్కర్స్ సాలిడారిటీ. 48 పేజీలు. వెల : 2 రూ. ప్రతులకు : 168, న్యూ ఎం.ఎల్.ఎ. క్వార్టర్స్, బషీర్‌బాగ్, హైదరాబాద్.

3) ధ్వని (ఆధునిక సాహిత్య వేదిక) బులెటిన్-1. నిర్వహణ : సాహితీ మిత్రులు, సంగారెడ్డి. వెల : 3 రూ. వివరాలకు : ముళ్ళపూడి శర్మ, 1-5-28, బ్రాహ్మణవాడ, సంగారెడ్డి-520 001.

4) SHELLEY AND HIS IDEOLOGY OF SOCIAL JUSTICE- by M.P.R. Published by CLIO BOOK CLUB, KAVALI-524 202.

5) ఎరుపు స్పెషల్ బులెటిన్ మార్చ్ 1992. వెల : 2 రూ. ప్రతులకు : తాడూరి సత్యనారాయణ, ఘణపురం, ములుగు తాలూకా, వరంగల్ జిల్లా-506 345.

6) పాష్ కవిత (ఎంపిక చేసిన కవితలు) : సంపాదకుడు : నిర్మలానంద. జన సాహితి ప్రచురణ. 14+48 పేజీలు. వెల : 6 రూ. ప్రతులకు : మైత్రి బుక్‌హౌస్, మసీదు వీధి, కారల్‌మార్క్స్ రోడ్, విజయవాడ-520 002.

7) పానుగోటి కృష్ణారెడ్డి కథలు. 8+104 పేజీలు. వెల : 10 రూ. ప్రతులకు : పల్లవి పబ్లికేషన్స్, ఏలూరు రోడ్, విజయవాడ - 2.

## ఆమె అస్తమించలేదని ......

చల్లగా నవ్వే అగ్నిపర్వతం గురించి
స్నేహంగా చుట్టుముట్టే పెనుగాలి గురించి
ఓదార్పుగా పలకరించే ప్రళయకడలి గురించి
సర్వాంగాలూ తెగిపోతున్నా సృజనాత్మకంగా పులకరించే జీవితంగురించి
గడ్డిపోచంత దేహంమీద అనంత విశ్వ ఆలోచనల భారాన్ని మోసిన
అస్తిత్వం గురించి
చావుపడకమీదకూడ మందహాసం చేసిన ఆత్మవిశ్వాసం గురించి

## వెరసి

'సావిత్రి' గారి గురించి ఓ జ్ఞాపకాన్ని, అనుభూతిని
కవితాగానో, వ్యాసంగానో పంపండి
ఆమె స్మృతికోసం! ఆమె ఆశయాలకోసం !!
మా సంకల్పానికి 'చేయూత' ని కోరుతూ ....

—మిత్రులు

చిరునామా :

కె. యస్. కృష్ణమూర్తి, పోస్టుమాస్టర్ జనరల్స్ ఆఫీస్,

విశాఖపట్నం - 530 003

# నిలువుదోపిడి
## (స్ట్రీట్ ప్లే)

జాగోరే జాగోరే జాగో జాగో
దునియాకే.... మజ్దూర్ యేక్‌హో యేక్‌హో
దునియాకే దుష్మన్‌హై అమెరిక జాపాన్, అమెరిక జాపాన్
వున్‌కే దలాల్‌హై టాటా బిర్లా, టాటా బిర్లా
వున్‌కే గులామ్‌హై దేశ్‌కి నేతా, దేశ్‌కి నేతా
వున్‌కే చంచేహై గాఁవ్‌కే జాలిమ్, గాఁవ్‌కే జాలిమ్
వున్‌సే లడనాహై జాగోరే జాగోరే జాగో జాగో॥

(యీ పాటను వలయాకారంగా తిరుగుతూ పాత్రధారులందరూ పాడాలి. తర్వాత ప్రేక్షకుల్లో కలిసిపోవాలి).

ఉదయం ఆరుగంటలు. రోడ్డుమీది హోటల్లో ఇద్దరు వ్యక్తులు కూచుని వుంటారు. ఒకడు పేపర్ చదువుతూ వుంటాడు. రెండోవాడు టీ తాగుతూ వుంటాడు.

ఒకడు : ఆహా యేమిటీ చిత్రం ? ఈ రోజు పేపర్లో ఒక్క హత్యావార్తా లేదు. దోపిడీ వార్త లేదు. రేప వార్త లేదు. మతకలహాలూ లేవు. యెన్‌కౌంటర్లూ లేవు. దేశంలో ఇంత ప్రశాంతత యెక్కడినుంచి వొచ్చింది. (పక్కవాడితో) మేస్టారూ, ఈ దొంగలూ హంతకులూ పోలీసులూ యేమయ్యారంటారు ?

రెండోవ్యక్తి : తెలీదా అక్కడికే వెళ్ళారు.

ఒకడు : (పేపర్ మడిచి ఆసక్తిగా చూస్తూ) అక్కడికా !

రెండోవ్యక్తి : అవును అక్కడికే.

ఒకడు : అక్కడికే అంటే ?

రెండోవ్యక్తి : అక్కడికేనయ్యా. దొంగలూ, హంతకులూ, పోలీసులూ, రేపిస్టులూ అందరూ అక్కడికే వెళ్ళారు.

ఒకడు : (పేపర్ విసురుగా మడిచేస్తూ) అక్కడికే అక్కడికే అంటారు. యెక్కడికో చెప్పిచావరేం ?

రెండోవ్యక్తి : తిరుపతికి.

ఒకడు : తిరుపతికా ? దొంగలూ, హంతకులూ, పోలీసులూ, మోసగాళ్ళూ, రేపిస్టులూ అందరూ తిరుపతికి వెళ్ళారా ? చిత్రంగా వుందే. తెల్లారే సరికి అందరూ భక్తులై పోయారా ?

రెండోవ్యక్తి : వోరి పిచ్చినాయనా తిరుపతికి వెళ్ళింది భక్తితో కాదు. ప్లీనరీ ప్లీనరీ దర్శనానికి.

ఒకడు : ప్లీనరీకా ? అంటే ఏంది మేస్టారూ.

రెండోవ్యక్తి : కాంగ్రెస్ పార్టీ వాళ్ళ మహాసభలు యేవో జరుపుకుంటున్నారు కదా. అక్కడికి.

ఒకడు : తస్సాదియ్యా. యిదేదో బావుందే. యేడాది పొడవునా ఆ ప్లీనరీ యేదో జరుగుతూనే వుంటే యెంత బావుండేది ! జనానికి యేడేడు జన్మల పీడ విరగడయ్యేది.

రెండోవ్యక్తి : పాపం. తిరుపతి ప్రజలను ఆ భగవంతుడే రక్షించాలి.

నేపథ్యగానం : రఘుపతి రాఘవ రాజారాం
హంకో పైసే దే భగవాన్
అమెరిక జపాన్ తేరేనామ్
బుష్‌కో సమ్మతి దేభగవాన్.

(ఇంతలో ఒక బిచ్చగాడు ప్రవేశిస్తాడు. ఒక చేతిలో చిప్ప, మరో చేతిలో కర్రా వుంటాయి. ఒంటిమీద చొక్కా వుండదు. కర్రని జెండా కర్రలా పైకి పట్టుకుని వుంటాడు. ప్యాంటు ఒకవైపు మోకాటిదాకా వుంటుంది. ఇద్దరు వ్యక్తులు డైలాగులు చెప్పేవరకు నేపథ్యగానం సాగుతూనే వుంటుంది. బిచ్చగాడు ఇద్దరి మధ్యలోంచి దూరి వెళ్ళి పోతాడు. మళ్ళీ వెనక్కి వచ్చి ఇద్దరి మధ్యలోంచి దూరిపోతాడు. మళ్ళీ మళ్ళీ అలాగే చేస్తాడు. బిచ్చగాడి వింత ప్రవర్తనకి చిరెత్తిన ఆ ఇద్దరూ వాడిని వదిలించుకోవడానికి డబ్బులు వేస్తారు. బిచ్చగాడు వెళ్ళిపోతాడు.)

ఒక : (అనుమానంగా చూస్తూ) చూడు చూడు మేస్టారూ. ఈ మనిషిని యెక్కడో చూసినట్టు లేదూ.

రెండో : అవును. నాకూ అట్లాగే అనిపిస్తోంది.

ఒక : యెక్కడ చూశానబ్బా. బస్టాండులో రైల్వేస్టేషన్ ఫొటోల్లో యేమైనా....

రెండో : (ఒకటవవాడి సంకలో వున్న పేపర్ లాగి) స్టేషన్లో గాదు తమ్ముడూ.... ఇదిగో ఈ పేపర్లోనే. ఫస్ట్ పేజీలో ఫొటో చూడు. ఇద్దరూ ఒక్కలాగే లేరూ !

ఒక : అవునండోయ్. అచ్చుగుద్దినట్టు ఒకే పోలిక. ఆహాఁ! బిచ్చమెత్తడంలో రికార్డు బద్దలు కొట్టాడేమో. అరే బిచ్చగాడు కాదు. మన ఆర్థికమంత్రి మన్‌మోహన్ సింగ్‌లా వున్నాడు. ఇక్కడ స్పష్టంగా రాయను కూడా రాశారు.

రెండో : అయితే ఈ వేషమేంది ? ఒంటినిండా గుడ్డలు సరిగ్గాలేవు. ఒక చేతిలో కర్రా, ఒక చేతిలో చిప్పా. అడిగి డౌట్ తీర్చేసుకుంటే పోలా. ఏమండీ !

(బిచ్చగాడు రాజసంగా వెనక్కి తిరిగి చూస్తాడు.)

మీరూ మా ఆర్థికమంత్రి మన్‌మోహన్ సింగ్‌గారేనా ?

బిచ్చ : (గద్దించినట్టుగా) జవాబ్ చాహియేతో పైసే దేనా హై.

(చిప్పలో డబ్బులు పడతాయి. వాటివైపు సంతృప్తిగా చూసి) హాఁ! మై మన్‌మోహన్ సింగ్ హూఁ! (అని వెళ్ళిపోతూ వుంటాడు.)

ఒకటో, రెండో : ఆఁ! (అని ఆశ్చర్యపోతారు.)

ఒకటో : మరి.... ఆ తలపాగా, గడ్డం, కళ్ళజోడు, షైం, ప్యాంటు, బూట్లు.... ఏమీ లేకుండా - యెక్కడినుంచి వస్తున్నట్టు ?

రెండో : (ఆత్రంగా) గౌరవనీయులైన ఆర్థికమంత్రిగారూ తమరు యెక్కడి నుంచి వస్తున్నారో సెలవిస్తారా ?

మన్ : పహలే పైసా.... (చిప్పలో పైసలు పడతాయి. వాటివైపు మన్‌మోహన్ సంతృప్తిగా చూస్తాడు) అమెరికాసే ఆ రహా హూఁ!

ఇద్దరూ : అమెరికా నుంచా ? (అని ఆశ్చర్యపోయేలోగా)

మన్ : వరల్డ్ బ్యాంక్‌సే.

ఇద్దరూ ; వరల్డ్ బ్యాంక్‌నుంచా ?

ఒకరితో ఒకరు : అమెరికా ? వరల్డ్ బ్యాంక్ ఈ దిగంబర వేషంతోనా ?

రెండోవాడు : సార్. మన్‌మోహన్ సింగ్‌గారూ అమెరికానుంచి వస్తున్నామంటు న్నారు. మరీ, మీ కోటేమయింది !

మన్ : పైసా....

ఒక : (నాలుక్కరుచుకుని చిప్పలో పైసలు వేస్తాడు. వాటివైపు మన్ సంతృప్తిగా చూస్తాడు.)

మన్ : ఉస్‌కో దియా ?

(రెండోవ్యక్తి అర్థం కానట్టుగా మొదటి వ్యక్తిని చూస్తాడు. అప్పుడే స్ఫురించినట్టుగా మొదటి వ్యక్తి అరుస్తాడు.)

ఒక : బుష్‌కోదియా -

(ఇక్కడినుంచి ప్రతి ప్రశ్నకీ మన్‌మోహన్ 'పైసా' అన్నట్టు చూడడం, ప్రశ్నించినవాడు డబ్బులు వేయడం సాగులోనే వుంటుంది.)

రెండో : మరి ప్యాంటు ?

మన్ : ఉస్‌కో దియా

ఒక : బుష్‌కో దియా

రెండో : మీ బూట్లో ?

మన్ : అరే ఉల్లూకే పట్ఠే యేభీ ఉస్‌కో దియా.

ఒక : అరే వెర్రి వెంగళప్పా. యేభీ బుష్‌కో దియా.

రెండో : మీ తలపాగా, అద్దాలు ?

ఒక : (మన్‌మోహన్ చెప్పేలోగా అందుకుని) తలపాగా బుష్‌కిచ్చేశాడు, తల లోపలి మెదడూ బుష్‌కిచ్చేశాడు. చూస్తుంటే అర్థంకాలా?

(మన్‌మోహన్ వెళ్ళిపోతుంటాడు.)

రెండో : మాన్య విత్తమంత్రీజీ. మీ చేతిలో కర్ర యేమిటండీ అలా పైకి పట్టుకున్నారు.

మన్ : యే హమారే దేశ్‌కి జెండాహై.

ఇద్దరూ : (ఆశ్చర్యపోయి) జెండానా - కనిపించడం లేదే. నీకేమయినా కనిపిస్తోందా ?

రెండు : మన్‌మోహన్ సాబ్. మీ చేతిలో ముష్టికర్ర తప్ప మరేం కనిపించడం లేదు. మరి జెండా యేమైంది ?

(ఇది కూడా బుష్‌కే ఇచ్చేశాడు అనే అర్థంలో ఇద్దరూ సైగలు చేసుకుంటూ వుండగా ఒక వీరుడి పోజులో రాజసంగా మన్‌మోహన్ మాట్లాడతాడు.)

మన్ : యే జెండాతో ఉస్కో మైనే నైదియా.

ఇద్దరూ : జెండా బుష్‌కో నహీదియా ?

మన్ : ఇస్ లియే కీ మై దేశ్ భక్త్ హూ. (ఇద్దరూ ఒకర్నొకరు కౌగిలించుకుని అభినందించుకుని ఆనందభాష్పాలు తుడుచుకుంటారు).

ఇద్దరూ : మన ఆర్థికమంత్రి మన్‌మోహన్‌సింగ్ మహా దేశభక్తుడు. తన సర్వస్వం బుష్‌కి నిలువు దోపిడి ఇచ్చినా జెండా మాత్రం ఇవ్వలేదు. ఇంతటి దేశభక్తుడైన మంత్రి వున్నందుకు మనం గర్వపడాలి. (ఇద్దరూ పరవశంతో మంత్రి ముందు వినయంగా వంగుతారు).

రెండో : మాన్య మహామంత్రీజీ మరి మన జెండా ఏమైంది ?

మన్ : వుస్‌నే లేలియా.

(రెండో వ్యక్తి అర్థంకానట్టు చూస్తుంటే ఒకటవ వ్యక్తి చెబుతాడు).

ఒక : బుష్‌నే లేలియా. బుష్‌గారు తీసుకున్నారు. వోహ్. అమెరికా మన బడా దోస్త్ కదా. మన ఆర్థికమంత్రిగారి ముఖం చూసి అమెరికా కూడా మన దేశభక్తురాలై పోయి మన జెండా తీసేసుకుంది. ఇంకా రాను రాను మిగతా దేశాల జెండాలుకూడా అమెరికా తీసుకునే శుభగడియలు రానున్నాయన్నమాట.

(ఇందాకటి 'రఘుపతి రాఘవ రాజారాం....' పాట నేపథ్యంలో వినిపిస్తుండగా మన్‌మోహన్ వెళిపోతుంటే ఇద్దరూ మళ్ళీ పిలుస్తారు. మన్‌మోహన్ ఆగిపోతాడు. పాట ఆగిపోతుంది).

రెండో : మన్‌మోహన్‌జీ అమెరికా నుంచి మీరు ఇప్పుడే దిగి ఇటు వచ్చారు. మరి ఇప్పుడు యెక్కడికి వెళ్తున్నారు ?

మన్ : పహలే పసా....

(ఇద్దరూ జేబులు తడుముకుని బిక్కమొఖాలు పెడతారు. జేబులు ఖాళీ అయ్యాయని సైగ చేస్తారు).

మన్ : ఫర్వానహీ. కల్ దీజియే. తిరుపతి ప్లీనరీ కేలియే జా రహా హూ !

రెండో : హంతకులు, రేపిస్టులు, దోపిడీదొంగలు, కన్నపు దొంగలు, పిక్‌ప్యాకెటర్లు మొత్తం తొట్టిగ్యాంగ్ అంతా వెళ్ళిన ఆ ప్లీనరీకే ఈ ప్రబుద్ధుడూ వెళ్తున్నట్టున్నాడు.

ఒక : మన్‌మోహన్‌జీ తిరుపతి ప్లీనరీకి యెందుకు వెళ్తున్నారు ?

మన్ : చర్చా కర్నే కేలియే.

రెండో : చర్చించడానికా ? దేన్ని గురించి చర్చించడానికి ?

మన్ : (చేతిలో చిప్ప చూపిస్తూ) ఇస్‌కే బారేమే చర్చాకర్‌నే కేలియే.
(ఇందాకటి పాట "అమెరికా రషియా తేరేనాం బుష్‌కో సమ్మతి దే భగ వాన్' వస్తుండగా మన్‌మోహన్ నిష్క్రమిస్తాడు).

రెండో : బిచ్చమెత్తుకునే చిప్ప-గురించి చర్చ. దాని సైజు గురించి చర్చ. లొట్ట పీసు గురించి తొట్టిగ్యాంగ్ చర్చ. నలభై ఏళ్ళుగా ఇలాంటి పనికిమాలిన చర్చలే- దేశాన్ని తాకట్టుపెట్టి సామ్రాజ్యవాదులకు లొంగి దేశపౌరుల్ని ఉక్కుపాదం కింద నలిపేస్తున్న ఈ దళారీ ప్రభుత్వాలు ఇంకా ఎంత కాలం అప్రజాస్వామిక రాక్షస పాలన సాగిస్తాయి. అసలు ఈ భారత దేశాన్ని గురించి చర్చించేవారు లేరా ?

(ఇంతలో ఇద్దరు పోలీసులు ఆగ్రహోదగ్రంగ రంగప్రవేశం)

పోలీస్ : దేశం గురించి చర్చించే వాళ్ళెవర్రా యిక్కడ ? (ఇద్దరినీ చుట్టు ముట తారు)

యస్.ఐ. : భారత ప్రధాని పి.వి. నరసింహారావు దేశం గురించి చర్చించడం లేదు. జయలలిత దేశం గురించి చర్చించడం లేదు. మార్క్సిస్టు ముఖ్యమంత్రి జ్యోతిబసు చర్చించటంలేదు. జనార్ధనరెడ్డి చర్చించడంలేదు. మరి మరి మీరెవర్రా. తెలిసింది బిడ్డా. ఖచ్చితంగా మీరు నక్సలైట్లెరా. పట్ట పగలు నడిబజార్లో నిలబడి దేశం గురించి మాట్లాడుతున్నారంటే ఖచ్చితంగా మీరు నక్సలైట్లేరా. (తుపాకులు పట్టుకొని వికటాట్టహాసం చేస్తారు) మాకు ప్రమోషన్‌లు, మెడల్స్, అవార్డులు. ఆహా ఎన్‌కౌంటర్. ఒక్క ఎన్‌కౌంటర్‌కి ఇద్దరు నక్సలైట్లు. ఒరేయ్ కానిస్టేబుల్, బ్యాగ్ చెక్ చేయరా. (కానిస్టేబుల్ బ్యాగ్ చెక్‌చేస్తాడు. బ్యాగ్‌లోంచి ఒక లుంగి బైటకు తీసి)

కానిస్టే : ఇది పంచె సార్

ఎస్.ఐ. : ఓరేయ్ ! అది పంచె కాదురా తపంచా.

కానిస్టే : (బ్యాగ్‌లో నుంచి చొక్కా తీస్తూ) ఇది చొక్కా సార్

ఎస్.ఐ. : చొక్కా కాదురా అది. బాంబు

కానిస్టే : పెన్ను సార్

ఎస్.ఐ. : నోర్మూయ్‌రా. అది పెన్ను కాదురా, ఎ.కె. 47.

కానిస్టే : ఒక డ్రాయరు కూడా వుంది సార్.

ఎస్.ఐ. : కాదు అది విప్లవ సాహిత్యం. ఇక చూస్కో వీళ్ళ పని ఖతం.

ఇద్దరూ : మాకేం తెలియదు. మేం నక్సలైట్లం కాము. మమ్మ వదిలేయండి.

ఎస్.ఐ. : తెలీదూ ! అయితే తెలుసుకోండిరా. (అంటూ కాలుస్తాడు) [తూటా దెబ్బకి మొదటి వ్యక్తి మరణిస్తాడు. రెండో వ్యక్తి మొదటి వ్యక్తి శవాన్ని భుజానికెత్తుకుంటాడు. స్టిల్.]

జాగారే జాగారే పాటతో ముగించాలి.

(విరసం సభ్యులు, మిత్రులు కలిసి రూపొందించి నక్సల్బరి గ్రామం దగ్గరలోని సిలిగురిలో 25-4-92న ప్రదర్శించిన స్ట్రీట్‌ప్లే ఇది).



# దార్శనికుడు 'రే'

—జగన్

"ఈ శతాబ్దంలోకెల్లా చెప్పుకోదగిన చరిత్రాత్మక సంఘటన ఏది?"

"వియత్నాం యుద్ధంలో వియత్నాం ప్రజలు సాగించిన పోరాటం"

"మనిషి చంద్రమండలం మీద కాలుపెట్టడం కంటే మహత్తరమైన సంఘటనా అది !?"

"అపుననుకుంటా".

"ఎందుకనుకుంటున్నావలా ?''

"సైన్స్ ఎదుగుదలను చూస్తే మనిషి చంద్రమండలం చేరడం నేడో, రేపో సాధ్యమేనని అందరికీ ముందే తెలుసు. కాని వియత్నాం యుద్ధం అలాకాదు. ఒక శక్తివంతమైన దేశాన్ని సామాన్య మానవులు, ఆ సామాన్య మానవుల కృషీ తిప్పి కొట్టింది. అందువల్ల అదే గొప్పది''.

"నువ్వు కమ్యూనిస్టువా ?''

× × ×

సత్యజిత్‌రే గొప్పదనం ఏమిటని అమాయకంగా ప్రశ్నించేవాళ్ళకి ఈ దృశ్యం సమాధానం అవునో, కాదోగాని ఆయనకు సామాజిక స్పృహ ఉందా అని గడుసుగా ప్రశ్నించే వాళ్ళకు మాత్రం కచ్చితంగా ఈ దృశ్యం ఒక సమాధానమే.

ఇది 'ప్రతిద్వంది' చిత్రంలో సిద్ధార్థ అనే నిరుద్యోగ యువకుడి ఇంటర్వ్యూ ఘట్టం. తెలివితేటలకు కొదవలేని నిరుద్యోగి సిద్ధార్థ చదువు పూర్తిచేసి చిరుద్యోగం దొరికినా చాలనుకుని రోజంతా నానాపాట్లూ పడతాడు. పెరిగిపోతున్న నిరుద్యోగం సిద్ధార్థ కళ్ళల్లోనే తాండవిస్తుంది. ఇంటర్వ్యూ చేస్తున్న వ్యక్తి అడిగినట్లు సిద్ధార్థ కమ్యూనిస్టు కాడు; వ్యవస్థను 'టూటా'తో మార్చాలనుకునేవాడూ కాడు. మనిషి జీవితంలో కొన్ని విలువలకు కట్టుబడి ఉండాలన్నదే సిద్ధార్థ సిద్ధాంతం. దానికోసం కష్టమైనా, నష్టమైనా ఎలాగో భరించడం నేర్చుకున్నాడు. కాని అలా ఎంత కాలం ?

ఈ ప్రశ్నకు సమాధానం సిద్ధార్థ తమ్ముడి దగ్గర లభిస్తుంది. నువ్వు ఎన్ని

శ్శిలా మడికట్టుకు కూర్చున్నా వ్యవస్థ మారనంతకాలం నువ్వూ, నీ పనీ ఇక ఇంతే అన్నట్లుంటాయి తమ్ముడి చూపులు.

అరవైవ దశకం చివరి రోజులలోని "వసంత మేఘగర్జన"కు సెల్యులాయిడ్ మహాశిల్పి సత్యజిత్‌రే స్పందించిన తీరు అది. వేలాదిమంది యువకులు 'వసంత మేఘగర్జన' పిలుపుతో అన్నీ వదులుకుని ఉద్యమంలోకి వెళ్ళిపోయినట్లే సిద్ధార్థ తమ్ముడు కూడా ఉద్యమం బాటనే ఎంచుకున్నాడు.

కాని వ్యవస్థలో విశ్వాసం ఉందా, లేదా అన్న ప్రశ్నే ఎన్నడూ వేసుకోని సిద్ధార్థ చెల్లెలు మాత్రం ఏ గొడవా లేకుండా ఈ చింపిరి వ్యవస్థలో ఇమిడిపోయింది. జీవితంలో ఇలా ఉండవచ్చు, ఇలా ఉండకూడదు అన్న పట్టింపు ఏమీ ఆమెకు లేదు. తాను చేసే ఉద్యోగంలో ఎలా చేరితేనేం, చేరిన తర్వాత చేతికి వచ్చే ఆ నాలుగు రాళ్ళూ కుటుంబ భారం మోయడానికే కాదు తన సౌందర్య వస్తువులకే సరిపోవని గుర్తించిన మరుక్షణం వయసులో పెద్దవాడైనా తమ కంపెనీ యజమానితో "చనువు"గా ఉండడానికే నిర్ణయించుకుంది. తనకు తానే కాకుండా పోతున్నానని ఆమెకు తెలుసు. కాని ఈ దుర్మార్గమైన పరిస్థితుల నుంచి నీతితో విముక్తి కాలేనని కూడా ఆమెకు తెలుసు....ఆమెకు తెలియనిదల్లా తనను "నీతిమాలిన" దాన్నిగా చూస్తున్న అన్నయ్య కూడా ఏదో ఒక రోజున చివరికి 'పక్కదారి' పట్టవలసి వస్తుందన్న కఠోర సత్యమే!

1955లో 'పథేర్ పంచలి' (రహదారి గీతం) చిత్రం నిర్మించినప్పటి నుంచి సత్యజిత్‌రే సగటున ఏడాదికి ఒకటి చొప్పున సినిమాలు నిర్మిస్తున్నారు. వాటిలో ప్రతి ఒక్క చిత్రమూ గొప్పదే అని అందరూ అనుకోనక్కరలేదు. అయితే దేని గొప్పదనం దానిదే అని మాత్రం ఒప్పుకోవాలి—తూనిక రాళ్ళు తేడా. అంతే!

సత్యజిత్‌రే నిత్య సత్యశోధకుడు. అందుకే ఆయన చిత్రాలలో ఏ ఒక్కటీ మరో చిత్రాన్ని పోలి ఉండదు. తనను తాను అనుకరించుకోవడం కూడా ఆయనకు గిట్టదు. అందుకే ఆయన తన సినిమాలలో ఎప్పుడూ నవ్యత కోసం, వైవిధ్యం కోసం తహతహలాడాడు. వ్యధార్థ జీవుల యథార్థ గాథలను తెరకెక్కించిన 'రే' యే 'కళకళ కోసమే' అని విశ్వసించే వాళ్ళకంటె గొప్ప "కళాత్మక చిత్రాలు" నిర్మించాడు. ఎటుచేరీ వాటిని సవ్యంగా అర్థం చేసుకోవడానికి కాస్త ప్రయత్నించాలి.

ఉదాహరణకు "గోపీ గాయె బాఘా బాయే" చిత్రాన్ని తీసుకుంటే అది చిన్న పిల్లల సినిమా అని కొట్టి పారేసిన వాళ్ళున్నారు. పెద్దవాళ్ళ ఆనందం పెద్ద వాళ్ళకి ఉన్నట్లే చిన్న పిల్లల ఆనందం చిన్న పిల్లలకి కూడా ఉండాలని రే ప్రత్యే కంగా ఈ చిత్రం నిర్మించాడు. అందులో గోపీ బాగా పాడతాడు, బాఘా బాగా బాజా వాయిస్తాడు. దేశ బహిష్కృతులైన ఆ ఇద్దరూ అడవిలో పారవశ్యంతో నాట్యం చేస్తే ఓ దెయ్యాల రాజు కనిపించి వారిద్దరికీ అద్భుతమైన శక్తులు ఇస్తాడు. ఎక్క డికి వెళ్ళాలంటే అక్కడికి అదృశ్య మార్గాన తీసుకుపోయే చెప్పులు, ఎప్పుడు కావాలంటే అప్పుడు పం: భక్ష్య పరమాన్నాలూ వారికి సనుకూరుతాయి. ఇన్ని శక్తు లుండీ వాళ్ళు ఓ గుర్తు తెలియని రాజ్యంలో కారాగారవాసం అనుభవించవలసి వస్తుంది. ఈ చిత్రాన్ని చూసి పిల్లలతో సమానంగా పెద్దలు కూడా ఆనం దిస్తారు. దెయ్యాలున్నాయా, మానవాతీత శక్తులున్నాయా అన్న మీమాంస అనవ సరం. బాలసాహిత్యాన్ని హేతు దృక్పథంతో బంధించరాదన్న కొడవటిగంటి అభి ప్రాయమే 'రే'కి కూడా ఉంది. ఈ చిత్రంలో సంగీత, నాట్యకళలకు రే ఎంతో ప్రాముఖ్యం ఇచ్చారు. అట్లాగే సెట్లు డిజైన్లు కూడా చూడడానికి కళ్ళు మిరిమిట్లు గొలి పేటట్లు ఉంటాయి. కేవలం నలుపు – తెలుపులలోనే రే ఈ చిత్రంలో అద్భుతమైన కళాసృష్టి చేశారు. ఈ చిత్రం ప్రారంభమైనప్పటి నుంచి ప్రేక్షకులు చెప్పరాని పార వశ్యానికి లోనవుతారు. చివరలో మాత్రం అకస్మికంగా గోపీ, బాఘాలకు అందమైన దుస్తులు వచ్చినప్పుడు ఈ చిత్రం రంగులలో ఉంటుంది. అప్పటివరకు అది వర్ణ చిత్రం కాదన్న విషయమే మనకు తట్టదు. ఇందులోని ప్రతి ఫ్రేమూ ఓ అందమైన, అపూర్వమైన అనుభవం.

అలాగే సంగీత, నృత్య కళలకు రే ప్రాముఖ్యం ఇచ్చిన మరో చిత్రం 'జల్సా ఘర్'. కూలి పోతున్న జమీందారీ వ్యవస్థకు ఈ చిత్రం దర్పణం పడు తుంది. ఆ స్తి హారతి కర్పూరంలో హరించుకుపోయినా అందులోని జమీందారుకి మాత్రం ఎంతమాత్రం దర్జా తగ్గరాదు. అలా ఎంతోకాలం సాగదని ప్రత్యేకించి చెప్పనక్కరలేదు. ఇంట్లోని నిలువెత్తు వర్ణ చిత్రంపై సాలెపురుగు పాకుతుంటే చేతి కర్రతో దానిని పక్కకు తోసి ఆ జమీందారు ప్రపంచాన్నే జయించినంత గర్వ పడతాడు!

* * *

రే సకల కళా ప్రవీణుడంటే అతిశయోక్తి అనిపించవచ్చుగాని ఇది నిజం. అయితే ఏదీ కూడా ఆయనకు పుట్టుకతో రాలేదు: సాధనతో వచ్చాయి. "పథేర్ పంచలి" చిత్రం నిర్మించేటప్పటికి ఆయనకు సంగీతంలో ప్రత్యక్ష ప్రవేశం లేదు. "పథేర్ పంచలి"కి పండిట్ రవిశంకర్‌తో మరువలేని సంగీతాన్ని సమకూర్పించిన 'రే' తర్వాత తర్వాత తన చిత్రాలకు తానే సంగీత రచన చేశారు. తనకు కావలసిన పద్ధతిలో సంగీతం సమకూర్చగలవారు సకాలంలో అందుబాటులో ఉండరన్న ఒక్క కారణంచేత ఆయన ప్రత్యేకంగా ఒక పియానో కొనుక్కొని, వినడం ద్వారా తనకు తెలిసిన పాశ్చాత్య సంగీతాన్ని, కర్నాటక సంగీతాన్నీ మేళవించి తన చిత్రాలకు ఆయన వినూత్నమైన సంగీతాన్ని సమకూర్చారు.

ప్రపంచ చలనచిత్ర చరిత్రలో సత్యజిత్ రే స్థానం ఏమిటో కాస్త అటు ఇటుగా అయినా అంచనా వేయాలంటే ఆయన సినిమాలతోపాటు ఆయన జీవితాన్ని, విశ్వాసాలను, ఆయన ఎదుర్కొన్న గడ్డు పరిస్థితులనూ కూడా అర్థం చేసుకోవాలి. ఆస్తిపాస్తులేవీ లేని రే చివరివరకు అద్దె ఇంట్లోనే జీవించాడు. తాత ఉపేంద్ర కిశోర్ రే గొప్ప వాగ్గేయకారుడు. తండ్రి సుకుమార్ రే మంచి రచయితగా పేరుపొందాడు. కలకత్తాకు ఆధునిక ముద్రణా సాంకేతిక పరిజ్ఞానాన్ని తీసుకువచ్చిన ఘనతకూడా ఉపేంద్ర కిశోర్ రేదే. ఆయన 1913లో బాలల కోసం 'సందేశ్' అనే బెంగాలీ పత్రిక స్థాపించాడు. రే చిన్నతనంలోనే తాత, తండ్రి కూడా మరణించడంతో తర్వాతి కాలంలో ఆయన మేనమామగారింట పెరిగాడు. తల్లి ఆ పనీ, ఈ పనీ చేస్తూ రేకి చదువు సంధ్యలు చెప్పించింది. తండ్రి సుకుమార్ రేకి విశ్వకవి రవీంద్రుడు అత్యంత సన్నిహితుడు కావడంతో 'రే' కొన్నాళ్ళపాటు 'శాంతి నికేతన్'లో ఉన్నాడు. చిత్రలేఖనం అంటే ఎంతో ఆసక్తి గల రేకు అక్కడే వినోద్ బిహారీ ముఖర్జీ, నందలాల్ బోస్‌లవంటి చిత్రకారులతో పరిచయమైంది. చిత్రాలకు జీవం పోయడం అంటే ఏమిటో వారి దగ్గర నేర్చుకున్న రే ఆ స్ఫూర్తితోనే తన చలనచిత్రాలలో పాత్రలకు ప్రాణం పోయడం నేర్చుకున్నాడు. అయితే 'శాంతినికేతన్'లో ఉన్న రోజులలో కూడా సినిమాలు చూడడం మీదేకాని సినిమాలు తీయడం

మీద 'రే'కి ఆసక్తిలేదు. ఆ ఆలోచన మొదటిసారిగా 1946 లో విభూతిభూషణ్ బెనర్జీ 'పథేర్ పంచలి' పుస్తకానికి కవర్‌పేజి డిజైన్ చేస్తున్నప్పుడు వచ్చిందని రే స్వయంగా ఒక ఇంటర్వ్యూలో చెప్పారు. ఆయన జీవితంలోని ప్రధాన ఘట్టాలు చాలా వరకు ఆయన చిత్రాలలో అక్కడక్కడా కనిపిస్తూనే ఉంటాయి.

సత్యజిత్ రే తనను "కలకత్తాకు, మిగిలిన ప్రపంచానికీ వారధి"గా గుర్తుంచు కుంటే చాలుననుకున్నాడు. ఎందుకంటే నిజంగానే ఆయన ఆ పేరు తెచ్చుకోదగి నంత కృషి చేశాడు.

'శిథిల నగరం' అని కొందరు, 'సజీవ చైతన్య నగరం' అని కొందరూ పిలిచే ఆ కలకత్తా 'వృద్ధ నవ మహానగరం' ఈ మూడువందల సంవత్సరాల కాలంలో భారత సామాజిక వికాసంలో విశిష్ట భూమిక పోషించింది. ఆధునిక భారత పరిణామక్రమానికి మౌనసాక్షి ఆ నగరం.

యూరప్‌తో కలకత్తా సంబంధాలు అక్కడి సాంస్కృతిక వాతావరణాన్ని "సాంస్కృతిక పునరుజ్జీవనా"నికి ముందు ఎంతగానో ప్రభావితం చేశాయి. కల కత్తాలో కొత్తగా ఊపిరిపోసుకున్న ఆలోచనలు మేధావులను కదిలించాయి. ఒక్క సారిగా సృజనాత్మకత పెల్లుబికింది.

దేశంలోనే కాదు, ప్రపంచం మొత్తంమీద జరిగిన సంఘటనలకు కలకత్తా ఎంతో గొప్పగా స్పందించింది. కలకత్తా నగర పరిణామాలనూ, వాటి చుట్టూగల పరి స్థితులనూ 77 ఏళ్ళ 'బెంగాలీ సినిమా' నిక్షిప్తం చేసింది. అందులో 37 సంవత్సరాల బెంగాలీ సినిమా సత్యజిత్ రే సొంతం.

ఆంధ్రప్రదేశ్‌లో అభ్యుదయ రచయితల సంఘం ఏర్పడడానికి పూర్వమే కలకత్తాలో అభ్యుదయ సాహిత్యోద్యమం వేళ్ళూనుకుంది. మరొకవైపు 'ఇండియన్ పీపుల్స్ థియేటర్ అర్ట్' (ఇప్టా) ఏర్పడింది. ఈ సాంస్కృతిక వికాసం నేపథ్యంలో అప్పటికే శంభుమిత్ర నాటకరంగాన్ని ఉర్రూతలూగిస్తుంటే 'నాటకాలు నాటకరంగం మీద కాదు, ప్రజల గుండెలమీద' అని నినదిస్తూ బాదల్ సర్కార్ ముందుకు వచ్చాడు.

సరిగ్గా అదే సమయంలో జీ రినాయర్ అనే సుప్రసిద్ధ ఫ్రెంచ్ సినిమా దర్శకుడు 'ది రివర్' అనే చిత్ర నిర్మాణం కోసం కలకత్తా వచ్చాడు. ఆయనతో 'రే'కి అక్కడ ఏర్పడిన పరిచయం, మరి కొన్నాళ్ళకి ఆఫీసు పనిమీద లండన్

వెళ్ళినప్పుడు విత్తోరియా డీసికా 'సైసికల్ థీవ్స్' (ఇటలీ) చిత్రాన్ని చూసిన అనుభవమూ 'రే'ని కొత్త కళాకారునిగా తీర్చిదిద్దాయి.

రెండవ ప్రపంచ యుద్ధానంతర పరిస్థితులకు అద్దంపడుతూ, చలన చిత్రాలలో "నవ్య వాస్తవికత"ను ఆవిష్కరించిన చిత్రం 'సైసికిల్ థీవ్స్'. ఆ చిత్రం చూసిన అనుభవంతోనే రే 'పథేర్ పంచలి' చిత్ర నిర్మాణానికి సిద్ధపడ్డాడు. (అప్పటికే ఆయన ప్రముఖ జర్నలిస్టు చిదానంద్ దాస్‌గుప్తాతో కలిసి 'కలకత్తా ఫిల్మ్‌సొసైటీ' స్థాపించారు) ఆ చిత్ర నిర్మాణానికి రే ఎదుర్కొన్న కష్టాలు అన్నీ ఇన్నీకావు.

అప్పటివరకు 'ఇండియన్ సినిమా' అంటే ప్రేమ కథలు, తెచ్చిపెట్టుకున్న ఆదర్శ కథలే. వాటిలో రక్తమాంసాలు గల పాత్రలు అరుదు. రే నిర్మించిన 'పథేర్ పంచలి' (1955) నవ్య చిత్ర నిర్మాణంలో తొలిఅడుగు. నవలగా అప్పటికే ఎంతో పేరు పొందిన 'పథేర్ పంచలి' సగటు గ్రామీణ జీవితానికి సజీవ సెల్యులాయిడ్ శిల్పంగా రే చేతిలో రూపుదిద్దుకున్నది (ఇవ్వాళ ఈ చిత్రాన్ని అందరూ కీర్తిస్తున్నారు గాని అప్పట్లో కాన్స్ చలన చిత్రోత్సవంలో ప్రపంచ సినిమా విమర్శకులను 'ఇటువంటి జీవితాలూ, ఇటువంటి సినిమాలు కూడా ఉంటాయా !' అని దిగ్భ్రాంతికి గురిచేసి, అవార్డులు ప్రకటించేవరకు ఇండియాలో ఈ చిత్రం గురించి అనుకున్న వాళ్ళు లేరు).

తెలుగు సాహిత్యానికి సంబంధించి "ఈ శతాబ్దం నాది" అని శ్రీశ్రీ అన్నట్టే సినిమారంగానికి సంబంధించి ఈ శతాబ్దం కచ్చితంగా సత్యజిత్ రేదే. ఈ శతాబ్దపు తొలిరోజులలో ఒక నిరుపేద బెంగాలీ బ్రాహ్మణ కుటుంబ జీవితాన్ని('పథేర్ పంచలి') చిత్రించింది మొదలు, 1991లో రకరకాల సామాజిక పరిణామాలవల్ల మనిషికి మనిషి కాకపోవడం ('ఆగంతుక్') వరకు ప్రతి అంశాన్నీ, మరీ ముఖ్యంగా మానవ సంబంధాలను, మానవ ప్రవృత్తినీ రే తన చిత్రాలలో సున్నితంగా స్పృశించాడు.

1940వ దశకం నాటి బెంగాల్ కరవు మొదలు భారతదేశాన్ని అతలాకుతలం చేసిన ప్రతి సామాజిక పరిణామాన్నీ రే తన చిత్రాలలో రికార్డు చేశారు.

కరవు కాటకాల గురించి ఆయన 1973లో 'అశని సంకేత్' నిర్మించారు. అది అచ్చగా కరవు "గురించి" కాదు; ఆ కరవుకు దారితీసిన పరిస్థితుల గురించి. రెండవ ప్రపంచ యుద్ధం జరుగుతుంటే ఆకాశంలో లోహ విహంగాలు ఎగురు

కుంటూ పోతున్నాయి. గ్రామీణ బెంగాలీ ప్రజానీకానికి అవి ఏమిటో, ఎక్కడికి పోతున్నాయో తెలియదు. వాళ్ళకు తెలిసిందల్లా ఎక్కడో జరుగుతున్న యుద్ధానికి ఆహార పదార్థాల సరఫరా నిలిచిపోతే ఆకలికి అలమటించి మాడి చావడమే. యుద్ధ బీభత్సానికి మానవ జీవితాలు ఎట్లా చెల్లాచెదురైపోయాయో ఈ చిత్రంలో రే చూపిస్తారు: అంతేకాదు, ఈ కరవు నీచ రాజకీయాల కృత్రిమ సృష్టి అని కూడా రే చూపిస్తారు.

ఆనాటి ప్రకృతి వైపరీత్యానికి మించిన వైపరీత్యం 'రాజకీయం' రూపంలో అమాయక గ్రామీణ జీవితాలను బలితీసుకున్నది. ఆర్థిక వ్యవస్థ ఛిన్నాభిన్నం అయిపోయింది. పంట పండించిన రైతుకే పట్టెడన్నం లేని దౌర్భాగ్య పరిస్థితులను కృత్రిమంగా యుద్ధ వాతావరణం సృష్టించింది. రాజకీయ పరిణామాలు మానవ జీవితాన్ని ఎంతగా కల్లోల పరుస్తాయో 1971 నాటి బంగ్లా శరణార్థులను చూసి రే చాలా కలత చెందారు. దానికే సినిమా రూపం ఇవ్వడానికి రే ప్రయత్నిస్తున్న సమయంలోనే విభూతి భూషణ్ బెనర్జీ రాసిన 'అశని సంకేత్' రెండవసారి చదవడంతో, ఆయన ఆ నవలకే సినిమా రూపం ఇచ్చారు. ఆ నవలలోనూ, బంగ్లా శరణార్థుల విషయంలోనూ 'రే'కు కనిపించిన ప్రధానాంశం మానవ వైఫల్యం. సైన్స్ సహాయంతో మనిషి చంద్రమండలానికి వెళ్ళవచ్చుగాక, కాని తోటి మానవుల్ని అన్నార్తులుగా మార్చేసి, వారిని సజీవ సమాధిచేసే అధికారం ఎవరిచ్చారన్నది రే ప్రశ్న.

ఇంతకంటె తీవ్రమైన ప్రశ్నలు వేసిన రే చిత్రాలలో 'ప్రతిద్వంది', 'సీమాబద్ధ', 'జనారణ్య'లను ప్రముఖంగా చెప్పుకోవాలి.

'పథేర్ పంచలి' పూర్తిగానూ, 'అపరాజితో' సగం గ్రామీణ జీవితాన్ని ప్రతిబింబిస్తే, వీటి గొలుసు చిత్రమైన 'అపూర్ సంసార్' పూర్తిగా పట్టణ జీవితాన్ని, అక్కడి ఆటుపోట్లనూ చిత్రించింది.

"ఆడుతు పాడుతు పనిచేస్తుంటే అలుపూ సొలుపేమున్నదిలే" అంటూ తెలుగు చిత్రాలు పాటలు పాడుకుంటూ గ్రామీణ వాతావరణం చుట్టూ అద్భుతమైన ఊహా ప్రపంచాన్ని సృష్టిస్తున్న తరుణంలోనే, అదే గ్రామీణ జీవితం అపూ వంటివాళ్ళను గ్రామాల నుంచి పట్టణాలకు తరిమేయడాన్ని రే చిత్రీకరించారు. జీవితం అందంగా ఉండాలని కోరుకోవచ్చుగాని అందంగా లేదని చెప్పకపోవడం కళాకారుల వైఫల్యంగా రే భావించారు.

'అపూర్ సంసార్'లోని అపూ పట్టణానికి వచ్చేసిన తర్వాత, ఆ తర్వాత తరం వారి జీవితాలను, వాటి చుట్టూ పేరుకుపోతున్న హీన విలువలను, నీచ రాజకీయ - సామాజిక పరిణామాలనూ వరుసగా 'ప్రతిద్వంది', 'సీమాబద్ధ', 'జనారణ్య', 'గణశత్రు', 'శాఖ-ప్రశాఖ', 'ఆగంతుక్' చిత్రాలలో చూస్తాం.

× × ×

కిక్కిరిసిపోయిన జనంతో కిటకిటలాడిపోతున్న నగర యాంత్రిక జీవితంలో తరాలమధ్య అంతరాలను 'మహానగర్' (1963)లో చిత్రించిన రే మరో ఏడేళ్ళలో 'ప్రతిద్వంది', మరో ఐదేళ్ళలో 'జనారణ్య' నిర్మించి అనాటి వర్తమాన సామాజిక పరిస్థితులతో పెనవేసుకుపోయిన 'భవిష్యత్ చిత్రపటా'న్ని కూడా ఆవిష్కరించారు.

భారత సమాజాన్ని ఒక్కసారిగా 'కల్లోల'పరిచిన సంఘటనలు 'మహానగర్', 'ప్రతిద్వంది'ల మధ్య జరిగాయి సామాజిక పరిస్థితుల స్వరూపం, అందుకు సంబంధించిన అవగాహనా అంతకుముందు వేరు: ఆ తర్వాత వేరు.

దేశ రాజకీయ చిత్రపటంలో చక చక రంగులు మారిపోతుంటే దేశం యావత్తూ అవాక్కు అయిపోయిన తరుణం అది. వసంతమేఘం గర్జించిన సమయం అది. ఆర్థిక సంక్షోభం దేశాన్ని అతలా కుతలం చేస్తోంది. కరవు రోజులలో ఆకలికి అలమటించిన ప్రజలు ఆ ఆకలితో మరణించారు గాని ఇప్పుడు ఆకలిదాడులు చేస్తున్నారు. పోలీసులు అమానుషంగా కాల్పులు సాగిస్తే కళాకారులు గొంతెత్తి ప్రశ్నించడం ప్రారంభించారు. రే చదువుకున్న ప్రెసిడెన్సీ కాలేజియే నూతనతరం విద్యార్థులతో, వారి రాజకీయ దృక్పథాలతో 'తీవ్రవాద' కార్యాచరణకు వేదికగా మారింది. బెంగాల్‌లో తొలికాంగ్రెసేతర ప్రభుత్వ దమననీతిని నిర్ద్వంద్వంగా ఖండిస్తూ కలకత్తా వీధులు నినాదాలతో మారుమ్రోగాయి: గోడలన్నీ నక్సలైట్ ఉద్యమ అనుకూల నినాదాలతో నిండిపోయాయి. రోడ్లు విద్యార్థులు చిందించిన రక్తంతో ఏరులై పారాయి.

ఈ నేపథ్యంలో రే 'ప్రతిద్వంది' కలకత్తాలో విడుదలైంది. భారత చలన చిత్రరంగంలో తొలి నక్సలైట్ పాత్ర అందులో ఉంది. ఒకవైపు విప్లవోత్తేజం, మరోవైపు బలమైన అమెరికన్ వ్యతిరేకతా, అంతే మోతాదులో అరాచకం ప్రబలిపోయిన రోజులవి. అప్పట్లో ఈ చిత్రానికి అనుకూలంగా, ప్రతికూలంగా కలకత్తాలో పెద్దఎత్తున ప్రదర్శనలు కూడా జరిగాయట. ఆ చిత్రంలోని ఇంటర్వ్యూ సన్ని

వేళాన్నిబట్టి రేను కమ్యూనిస్టుగా ముద్రించిన వాళ్ళున్నారు: అందులోని నక్సలైటు ఆ చిత్రంలో ప్రధానపాత్ర కాకపోవడంవల్ల ఆయన నక్సలైటు వ్యతిరేకి అన్నవాళ్ళూ ఉన్నారు. "ఇంతటి ఉద్రిక్త పరిస్థితులలో విడుదలైన నా చిత్రం భవిష్యత్తులో నన్ను ఎక్కడ నిలబెడుతుందోనని" ఆశ్చర్యం వ్యక్తం చేస్తూ రే మేరీసేటన్ అనే బ్రిటిష్ సినిమా విమర్శకురాలికి ఒక ఉత్తరం కూడా రాశారు.

"మా అబ్బాయికూడా నక్సలైట్ ఉద్యమంలోకి వెళ్తే యువకుల అంత రంగాన్ని నేను మరింత బాగా అర్థం చేసుకుని ఉండేవాణ్ణి" అని కూడా రే ఒక సందర్భంలో అన్నారు. మౌలికంగా రే సానుభూతి "వామపక్షీయులవైపే" అని ఆయన గురించి 'ది ఇన్నర్ ఐ' అనే గ్రంథం రాసిన ఆండ్రూ రాబిన్సన్ పేర్కొన్నారు. అయితే ఉపన్యాసాలు చేయడం అలవాటులేక, నలుగురితో కలిసి తిరగడం ఇష్టం లేక తన ప్రపంచంలో తాను ఉన్నందుకు మొదటి నుంచీ కమ్యూనిస్టులు రేను దూరంగానే ఉంచారు. (ఆమాటకొస్తే సంప్రదాయ కమ్యూనిస్టులు సినిమా కళను కూడా చాలాకాలం నిషిద్ధ కళగానే చూశారు. కొడవటిగంటి, శ్రీశ్రీల వ్యాసాల పుణ్యమా అని ఒక్క చాప్లిన్‌ను మాత్రం మనం ఆమోదిస్తున్నాం!)

జీవితంలో ఒకే ఒక్కసారి మాత్రం రే బ్రహ్మాండమైన ప్రజాప్రదర్శనకు నాయకత్వం వహించారు. ఆకలిదాడులను సమర్థించిన కళాకారులను ప్రభుత్వం జైళ్ళలో కుక్కినందుకు తీవ్రంగా స్పందిస్తూ రే 1966లో ఆ ప్రదర్శనకు నాయ కత్వం వహించారు. అలాగే వియత్నాం యుద్ధానికి వ్యతిరేకంగా ర్యాలీలో పాల్గొని భారత కళాకారుల తరపున ఒక అంతర్జాతీయ విజ్ఞప్తి చేశారు. చైనాదాడిని ఖండించ మని ఆ తర్వాత భారత ప్రభుత్వం ప్రత్యేకంగా కోరినప్పుడు ఆయన తిరస్క రించారు. అలాగే ఎమర్జెన్సీలో ప్రభుత్వానికి బాకా ఊదుతూ ఒక చిత్రం నిర్మించా లని ఢిల్లీనుంచి వచ్చిన ఆదేశాన్ని కూడా రే త్రోసిపుచ్చారు. కొన్నాళ్ళకు సిక్కిం ప్రజలపై రే నిర్మించిన ఒక డాక్యుమెంటరీని ఆ కక్షతో భారత ప్రభుత్వం నిషేధిం చింది. మళ్ళీ ఆయన చనిపోవడానికి కొద్దిరోజులు ముందు 'భారతరత్న' ప్రకటిం చిన సందర్భంగా ఆ నిషేధాన్ని అధికారికంగా ఎత్తివేశారుగాని ఆ చిత్రం ప్రింటు ఎక్కడుందో ఎవరికీ తెలియదు!

× × ×

'ప్రతిద్వంది'లో పరిస్థితులతో రాజీపడని పాత్రగా సిద్ధార్థను చూస్తాం. కాని ఎంత తమాయించుకున్నా సిద్ధార్థ చివరికి తాను గీసుకున్న 'లక్ష్మణరేఖ' దాటి కాస్తయినా బయటకు పోక తప్పదు....

బ్యాంకుల జాతీయకరణ తర్వాత సమాజంలోకి చొచ్చుకు వచ్చిన 'కంపెనీ లిమిటెడ్' సంస్కృతిని 'సీమాబద్ధ'లో చూస్తాం. సామర్థ్యంతో, స్వశక్తితో ఉద్యోగం సంపాదించాలనుకుని, అది సాధించలేకపోయిన సిద్ధార్థ ఎక్కడ విఫలమయ్యాడో సరిగ్గా అక్కడే 'సీమాబద్ధ'లోని శ్యామలేందు ఘన విజయం సాధిస్తాడు. మంచితనం కాదు మాటకారితనం, సామర్థ్యం కాదు స్వార్థం—ఇదే అతని సిద్ధాంతం.

స్వాతంత్ర్యానంతరం దేశం బాగుపడుతుందని నమ్మి, ఆ నమ్మకం వమ్ము కావడంతో ఆ విషయాన్నే నిక్కచ్చిగా తన సినిమాలలో చూపించిన అగ్రశ్రేణి దర్శకులలో రే ఒకరు. ఆయన ఉద్యోగాన్వేషణలో ఉన్న రోజులలోనే కాళ్ళ క్రింద నుంచి నేల తొలుచుకుపోతున్న విషయం గుర్తించారు. 1970వ దశకం వచ్చేసరికి దేశం అన్ని సంక్షోభాలకూ నిలయమై పోయింది. కాక్‌టైల్ పార్టీల్లో, రివాల్వింగ్ కుర్చీలలో కూర్చుని ఆకాశం అంచునుంచి క్రింది స్థాయి జనంతో, వారి జీవితాలతో పై స్థాయి వారు ఆడుకోవడం చూసి రే సహించలేకపోయాడు. అదే 'సీమాబద్ధ'లో చూస్తాం.

ఒక ఫ్యాన్ల కంపెనీలో పనిచేసే శ్యామలేందు తన అధికార స్థానాన్ని పదిలంగా ఉంచుకోవడం కోసం అడ్డదారులు తొక్కుతాడు. ఎగుమతి చేయవలసిన ఫ్యాన్లు పాడైపోతే, ఆ వచ్చే నష్టాన్ని కూడా లాభంగా మార్చుకునే తెలివితేటలను శ్యామలేందు ప్రదర్శిస్తాడు. కొందరు స్వార్థపరులతో కుమ్మక్కై, సమ్మె చేయించి, తమ కంపెనీ పైనే బాంబు వేయించి, ఆ కంపెనీని గట్టెక్కిస్తాడు శ్యామలేందు. ఈ కంపెనీ లిమిటెడ్ తెలివివల్ల శ్యామలేందు మరో మెట్టుపైకి ఎక్కుతాడు: ఆ తెలివి లేని వాచ్‌మన్ మాత్రం బాంబు దెబ్బ తింటాడు.

ఈ రెండిటికీ గొలుసు చిత్రంలా చెప్పవలసిన మూడో చిత్రం 'జనారణ్య'. ఇందులో ప్రధాన పాత్ర అయిన సోమ్‌నాథ్ కూడా సిద్ధార్థలా ముందు కొన్ని విలువలను తనకు తాను విధించుకున్నవాడే. కాని ఎవరినీ ఆ విలువలతో బ్రతకనీయని స్థితికి సమాజం చేరుకుంది. అప్పటికి అవినీతి అందలం ఎక్కింది. నమ్ముకున్న

విలువలు మనుగడనే కష్ట సాధ్యం చేస్తుంటే సోమ్‌నాథ్ వంటి యువకులు ఏం చేయాలి? జీవితంతో రాజీపడడం, లేదంటే జీవితమే లేకుండా చేసుకోవడం! మరో మార్గం లేదు....అందువల్ల పైసా పెట్టుబడి లేని బ్రోకర్ వ్యాపారంలోకి సోమ్‌నాథ్ దిగుతాడు. కాని ఆ వ్యాపారంలో సోమ్‌నాథ్ చివరికి తన మనస్సాక్షినే పెట్టుబడిగా పెట్టక తప్పదు.

సిద్ధార్థ, శ్యామలేందు, సోమ్‌నాథ్‌లు ముగ్గురూ ఊబిలో దిగబడిపోతున్న హీన సమాజానికి సజీవ ప్రతినిధులు. వాళ్ళు అలా మారిపోవడానికి కారణాలు ఈ సమాజంలో ఉన్నాయి చూడమని రే ఈ మూడు చిత్రాలలో చూపించారు. ఒక విధంగా 'సీమాబద్ధ', 'జనారణ్య'లను "భవిష్య చిత్రాలు"గా చెప్పాలి. మానవ సంబంధాలను షేర్ మార్కెట్ ఎదుగుబొదుగులకు బంధించే మన్‌మోహన్ బడ్జెట్ నేపథ్యంలో రావలసిన చిత్రాలు ఈ రెండూను. కాని ఆర్థిక సంక్షోభం "అమానవీయ" స్వభావాన్ని పుటికి పుచ్చుకునే క్రమాన్ని రే అర్థం చేసుకోవడం వల్లే ఈ సార్వజనీన చిత్రాలు నిర్మించగలిగారు.

సామాజిక విలువల దృష్ట్యా చెప్పవలసి వస్తే సోమ్‌నాథ్ (జనారణ్య, 1975) సిద్ధార్థకు (ప్రతిద్వంది, 1970) కొనసాగింపు. ఆత్మగౌరవాన్ని చంపుకోవడానికి సిద్ధంగా లేని సిద్ధార్థ ఈ ఐదేళ్ళలో డబ్బు సంపాదించడం కోసం ఎంత దిగజారిపోవడానికైనా సిద్ధపడే సోమనాథ్‌గా మారిపోయాడు !

రాజకీయ నేపథ్యంలో మనిషిని యాంత్రికంగా మార్చేస్తున్న ఈ తలక్రిందులు విలువలే పాలకులకు అపారమైన అధికారాలు కట్టబెట్టాయి. ఫలితంగా ఎమర్జెన్సీ సామాన్య ప్రజల ఇంటి ముంగిటకు వచ్చేసింది.

ఆ తర్వాత దాదాపు పదిహేనేళ్ళపాటు రే నిజ జీవితంలో పేరుకుపోతున్న కఠిన వాస్తవాలకు పెద్దగా స్పందించలేదు.

ఈ దశాబ్దంన్నర కాలంలో అవినీతిని మన పాలకులు నిస్సిగ్గుగా "అంతర్జాతీయ మయం" చేసేశారు. సమాజంలో అంతకుముందు అక్కడక్కడా కనిపించే అవినీతిపరులు ఇప్పుడు ఎక్కడ పడితే అక్కడే కుక్కగొడుగుల్లా కనిపిస్తున్నారు. అవినీతికి పాల్పడడమంటే మొహమాటపడే మధ్యతరగతి పాలకుల వరుస చూసి తమ అవినీతిని సమర్థించుకోవడమే కాదు, ఆరాధించే స్థితికి చేరుకుంది. అంత

టితో జనానికి దూరమయ్యారన్న అపప్రదకు గురైన రే ఒక్కసారిగా 'గణశత్రు' (1989)తో ఈ సమాజం పైకి ఓ నవ్యాస్త్రం సంధించారు. ఆ తర్వాత నిర్మించిన 'శాఖ-ప్రశాఖ', 'ఆగంతుక్' చిత్రాలలో ఆయన తన సునిశితమైన పరిశీలనలతో ప్రతి మనిషి మస్తిష్కంలోకి చొచ్చుకుపోతున్న హీన విలువలను ప్రశ్నించారు. సమస్యలకు దర్శకుని దగ్గర సమాధానాలు ఉండకపోవచ్చు, కాని అందరూ వాటి గురించి ఆలోచించే ఒక వాతావరణాన్ని సృష్టించడమే తాను చేయగలిగిందని ఆయన ఒక సందర్భంలో తన చిత్రాల గురించి నమ్రతతో చెప్పారు.

రే పాత చిత్రాలతో ఏ మాత్రం పోలికలేని ఈ చివరి మూడు చిత్రాలలోనూ కథాంశాలు వేరైనా వాటి సామాజిక నేపథ్యం ఒకటే. రేలోని వినూత్న దృక్పథాన్ని ఆవిష్కరించిన 'గణశత్రు'లో నీటి కాలుష్య సమస్య, 'శాఖ-ప్రశాఖ'లో తరాల మధ్య అంతరాలు, 'ఆగంతుక్'లో మనిషిని మనిషి శంకించే అవమానకరమైన పరిస్థితులూ కనిపిస్తాయి. అణు విద్యుత్ కేంద్రాలకు, భారీ ప్రాజెక్టులకూ పెద్ద ఎత్తున ప్రజా నిరసన వెల్లువుతున్న తరుణంలో రే సరైన సమస్యను తీసుకుని ఇబ్సెన్ 'యాన్ ఎనెమీ ఆఫ్ ది పీపుల్' నాటకం ఆధారంగా 'గణశత్రు' నిర్మించారు. 'జల్సాఘర్', 'షత్రంజ్ కె ఖిలాడి', 'గోపీగైన్ బాఘాబైన్' వంటి చిత్రాలలో మాత్రమే రే సినిమా సౌందర్య కళాదృష్టిని హర్షించిన మితవర్గం 'గణశత్రు'ను వివాదాస్పదం చేసింది. చాలాకాలం తర్వాత ఆయన వర్తమాన కథాంశాన్ని తీసుకోవడమే ఈ అసహనానికి కారణం.

'పథేర్ పంచలి'లో హరిహర్ ఎంత నిష్కల్మషమైన వాడో, 'శాఖ-ప్రశాఖ'లోని ఆనందమోహన్ కూడా అంత నిష్కల్మషమైనవాడు. కాని ఆయనలా ఉండడం సాధ్యం కాదని కొడుకుల జీవితాలు చూపిస్తాయి. అది చూసి ఆనందమోహన్ హతాశుడవుతాడు. తూర్పు యూరప్ పరిణామాలు చూసి బాధపడిన చిన్నకొడుకు తాను స్వయంగా అవినీతికి పాల్పడకపోతే చాలునని ఉన్న ఉద్యోగానికి రాజీనామా చేసి నాటక రంగానికి జీవితం అంకితం చేస్తాడు. ఈ చిత్రంలో నల్లధనం అంటే ఏమిటో ఇంకా ఊహామాత్రంగానైనా తెలియనివాడు ఆనందమోహన్ మనుమడు!

ఇక రే నిర్మించిన అన్ని చిత్రాలలోకీ విశిష్టమైనది ఆయన చివరి చిత్రం 'ఆగంతుక్' (1991). సత్యజిత్ రే జీవిత కాలంలో నిర్మించిన చిత్రాలకు గుర్తింపుగా

'ఆస్కార్' అవార్డు లభించిన నెలరోజులలోనే బెంగుళూరు చలన చిత్రోత్సవంలో ప్రదర్శించిన ఈ చిత్రాన్ని సినిమా విమర్శకులంతా 'ఆస్కార్'కే గర్వకారణంగా గుర్తించారు.

ఒక మనిషిని తోటి మనిషి నమ్మలేని దైన్య స్థితికి చేరుకున్న ఈ సమాజం లోని అన్ని కోణాలనుంచి మనుషుల జీవితాలను, వారి చుట్టూ ఉన్న సామాజిక పరిస్థితులనూ రే అనన్య సామాన్య రీతిలో ఈ చిత్రంలో స్పృశించారు. మనలోని ప్రతి ఒక్కరూ ఈ చిత్రంలో కనిపించే అనిల, సుధీంద్ర కావచ్చు, మన ఎదురుగా కనిపించే ప్రతి వ్యక్తి ఈ చిత్రంలోని 'ఆగంతకుడు' కావచ్చునని రే చూపిస్తారు.

ఇలా ఆధునిక మానవ జీవితంలోని అన్ని పార్శ్వాలనూ రే తమ చిత్రాలలో ఎంతో సున్నితంగా స్పృశించారు. సినిమా సర్వకళల సమాహారం అనుకుంటే, అటువంటి సినిమా రంగం ద్వారా మంచి గురించి తపనపడే మానవతావాదాన్ని ఆవిష్కరించిన మహా దార్శనికుడు రే. స్త్రీ-పురుష సంబంధాలను 'చారులత'లో, మధ్యతరగతి ఆకాంక్షలను 'పరస్ పత్థర్'లోనూ అసాధారణంగా చిత్రీకరించిన రే అంతర్జాతీయ సినిమా రంగంలో తనకో సుస్థిరమైన స్థానాన్ని సంపాదించుకున్నాడు.

అందుకే ఆయన గురించి మరో 'ఆస్కార్' అవార్డు గ్రహీత అకిరా కురొసోవా "రే చిత్రాలు చూడక పోవడమంటే సూర్య చంద్రులను చూడకపోవడమే" నని అన్నారు. ఇది రేను పొగడడానికి అన్నమాట కాదు, తోటి కళాకారుణ్ని చిత్తశుద్ధితో ప్రశంసించిన తీరు అది. జీవితాలలోకి వచ్చిపడుతున్న రకరకాల 'కాలుష్యం' గురించి, వాటి కారణాల గురించీ శోధిస్తూ, తన చిత్రాలద్వారా సమాజానికి శస్త్ర చికిత్స చేస్తున్న రే ఇక లేరు; ఆయన చిత్రాలు ఉన్నాయి.

ఆయన మరణించినప్పుడు "కలకత్తా ప్రజా జీవితంలో రే లేని తొలి రోజు" అని కలకత్తా పత్రిక 'ఆజ్‌కల్' విచారం వ్యక్తం చేసింది గాని నిజానికది యావత్ కళా ప్రపంచానికీ 'రే' లేని తొలి రోజు!

* * *

# అక్కా! రేపటి తరానికి నీవే!

దారి పొడుగునా నీ శ్వాస - నా ఊపిరై నన్ను నడిపిస్తోంది!
నీ భుజాల మీద నా ఆశ దారి పక్క పూలవనమౌతోంది!
నిన్ను నీవు చిదుముకొని దీపమై నాకు దారి చూపిస్తున్నా పు
నీవు వేసిన ప్రతి అడుగూ ఇక్కడ ఈ దారిని సరళం చేస్తోంది
నీ అలికిడికి తోడేళ్ళు పారిపోతున్నాయి
పులులు భయపడి ముసుగులు తొడుక్కుంటున్నాయి
రాజకీయం తలకింద మెత్తని దిండై పోయిన రాజ్యాంగం
చెయ్యని పని కోసం
నీ ఊపిరిని ప్రభంజనంగా చేసి నువ్వు వీస్తున్నపుడు
ఓ గాలి తెమ్మెర నా కిటికీలోంచి వచ్చి నన్ను తాకి
నా నుదుటి మీద ముద్దాడి నన్ను సేద దీరుస్తోంది
నీ చూపు తాకిడికి
గిరిజన కార్పొరేషన్ తూనిక స్థిరపడి నిలబడుతోంది
నీ చేతి సైగతో శ్రామికుని స్వేదబిందువు
పదినుంచి యిరవైకి ఎదిగింది
నీ నవ్వు -
నిప్పుల కొలిమిలో మల్లెల్ని పూయిస్తోంది
చీకటి పామై కొండల్లో కాటేసిన అక్కా!
నీ ముఖ్య ముఖం నాకెందుకు ?
నువ్వో సమూహానివి !
ఇక్కడ ప్రతి ఆకూ ప్రతి కొమ్మా ప్రతి చెట్టూ నీ కదలికనే చెబుతాయి
ఇక్కడ వీస్తోన్న కొండగాలి నీ జీవితాశయాన్ని విన్పిస్తోంది !!
ఇక్కడ రేపు పుట్టబోయే బిడ్డ -
నీ జీవన సాఫల్యాన్నే ఆలపిస్తుంది !!!

- ఆప్త చైతన్య

137 ARUNATARA APRIL/MAY 1992 H/GTR-70
Annual Subscription Rs. 50/- Single Issue Rs. 5/-

# కలం కవాతు

— జీవని

**1**

భాగ్యనగరమా నీకు
ఏం భాగ్యం తల్లీ
నీ వాడిలో నిఖ్ఖచ్చిగ
ఎన్‌కౌంటర్ మళ్ళీ
జనారణ్య మృగాలకు
జనులేనోయ్ 'లేళ్ళ'
స్మశానాలవుతున్నాయ్
తెలంగాణ ఊళ్ళు

**2**

సారాలో దాగున్నరు
మన గాంధీ గారలు
సచ్చినా వదలకండ్ర
సర్కారోడి 'బారు'లు
మత్తుతో గమ్మత్తుగ
చేస్తున్నరు దోపిడి
కనరండీ జనులారిది
కాంగిరేసు గారడి

**3**

నేలతల్లి విముక్తికై
నినదించిన మేడె
కడుతుందిర ధనవంతుల
దోపిడీకి పాడె
చిందిన నెత్తురు సాక్షిగ
చేస్తున్నాం బాస
చివరి శ్వాసవరకు కమ్యు
నిజంమీదె ధ్యాస

**4**

పేగులెండి సస్తుంటే
పేదసాద జనులు
'ప్లీనరీ'లో కులుకుతుండ్రు
మన 'ఖద్దరు' ఘనులు
ఏమి ప్రేమ దేశంపై
ఏలేటి దొరలకు
ఏమీ మిగిలేట్టు లేదు
'చిప్ప' తప్ప చివరకు.

Printed at Nagendra Press, VJA-2 on behalf of Venkataramana
Printers Guntur-1 Revolutionary Writers' Association



మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| పుస్తకం సంఖ్య | KLVA106M106 |
| --- | --- |
| పుస్తకం పేరు | అరుణతార |
| తారీఖు | 07 February 2025 |
| ముందు అట్ట | yes |
| వెనుక అట్ట | yes |
| మొత్తం పేజీలు | 105 |
| పెద్ద సైజు పేజీలు | no |
| ఖాళీ పేజీలు | no |
| లేని పేజీలు | no |
| తయారు చేసినది | akshaya |
| పేజీలు విడదీసినది | jayamma |
| స్కాన్ చేసినది | Priyanka |
| పరీక్ష చేసినది | AMRUTHA |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good |